# పీఠిక.

అసంఖ్యాకమగు నలెగ్జాండరు సైన్యము నొంటరిగా నెదిరించిన పురుషోత్తముఁడును, స్వార్థపరాయణులగు సాటిరాజులచేఁ బరిత్యజింపఁబడియు స్వాతంత్ర్యమునకై యనేకసంవత్సరము లక్బరుతో హోరాహోరీగాఁ బోరాడిన రాణాప్రతాపసింగును, శరణాగతుఁడైన యొకానొక మహమ్మదీయుని ప్రాణసంరక్షణార్థమై తనసర్వస్వము ధారఁబోసిన జంబుకేశ్వరరాయలును, బొబ్బిలి రంగారాయ పాపారాయలకన్న మిన్నలనిచెప్ప సందేహము కలుగుచున్నది. రాజపుత్రస్థానము రాణా హమీరు భాప్పారావల్ సంగ్రామసింహుఁడు మొదలగు వీరక్షత్రియుల రక్తధారలచే నార్ద్రీకృతమై యెట్లు ప్రాతస్స్మరణీయమైనదో పర్వతమయమైన మహారాష్ట్రదేశము శ్రీశివాజీ, బాలాజీవిశ్వనాథు, హోల్కారు సింధియా మున్నగు వీరులచే హిందూదేశమున కంతకు నెట్లు తిలకాయమానమైనదో పాంచాలదేశము గురుగోవిందు రణజిత్ సింహు మొదలగు మహాశయులచే నెట్లుపవిత్రము కాఁబడినదో యటులే యాంధ్రదేశము సైతము శాతవాహనా ద్యాంధ్రచక్రవర్తులచేతను గాకతీయులచేతను విద్యానగరసార్వభౌములచేతను బొబ్బిలి పద్మనాయకులచేతను నలంకృతమై వీరస్వర్గద్వారమునకు సోపానమై విరాజిల్లుచున్నది. ఏవీరయోధుల బలపరాక్రమములు పల్లెలయందు సైతము గానము చేయఁబడుచున్నవో యేయభిమానధనుల కీర్తిచంద్రిక లాంధ్రదేశమును సుధాలేపనము చేయుచున్నవో యేమహనీయుల రక్తధారలు స్వాతంత్ర్య ప్రవాహమున సంగమించుచున్నవో యా వెలమనాయకుల పవిత్రచరిత్ర మెందఱు గ్రంథకర్త లెన్నినాటకములుగ వ్రాసినను దనివి తీఱకున్నది.

ప్రకృతనాటకమున వీరరసము ప్రధానమై కరుణారస మంగముగానున్నది. మొదటి మూడంకములయందుఁ గేవలము వీరరసముమాత్రము వర్ణింపఁబడినది. తుది నాలుగంకములయందును వీరకరుణారసములు తరంగితములై యొక్కొకతఱి క్షాత్రతేజమునందును మఱియొకతఱి విషాదసముద్రము నందును ముంచివేయుచున్నవి. విజయరామ

రాజు వంచక స్వభావమును, బుస్సియొక్క నిర్దోషత్వమును, హైదరు జంగు లంచగొండితనమును రావువంశీయుల పరాక్రమపౌరుషములును వివరింపఁబడినవి.

చితుకులు కదల్చుటచే నగ్ని చెలఁగి మండుచున్నది. చెడుగుఁ జేయుటచేఁ బాము పడగవిప్పుచున్నది. మానవుఁడు సైతము క్షోభమునవలననె తనపరాక్రమతేజములు కనబఱచి విజృంభించుచున్నాఁడు. బొబ్బిలి పద్మనాయకులు పరాక్రమైకజీవనులు. స్వాతంత్ర్యప్రియులు. అంతటి వారు తమస్వాతంత్ర్యమును గోలుపోనోపరు. బుస్సిదొరయాగమనముచేఁ దమసంస్థానముపైఁ గ్రొత్తపన్నులు విధింపఁబడుటయేగాక తమస్వాతంత్ర్యమునకు సైతము భంగమువాటిల్లుచున్నది. పరాసువారి సైన్యము శతఘ్నికాసమేతమై భయంకరమైనది. అయినను ధూర్తుఁడగు వెంగళరాయఁడు

“ వాలును డాలుఁ గేలఁగొని వచ్చిరణాంగణమందునిల్చి యా
భీలపరాక్రమంబుఁ గనుపింప మెలంగెడి వెల్మతేనితోఁ
గాలుఁడె కాదు తత్ప్రళయకాలగిరీశుఁడుగాని నిల్వఁగాఁ
జాలఁడు సంశయింపఁడఁగఁ జన్నె యొకానొక మ్లేచ్ఛసూతికిన్”

మఱియొకచోట.

“వెలమవీరుండు వెరచునే విలయమునకు”

అని పలికియున్నాఁడు. అంతియకాక దేశకాలపాత్రవేదియగు పాపారాయఁడు సైతము

“జ్వాలామాలికా కీలితంబైన యీపద్మనాయక శౌర్యవహ్నికిఁ
బ్రతిపక్షకోటి శలభబృందమై తీఱును”

అని ధైర్యముగాఁ జెప్పియున్నాఁడు. అభిమాన ధనుండగు రంగరాయఁడు పరాసు సైన్యముల బలాబలములు గ్రహింపక పోలేదు. కావుననే యతఁడు బుస్సి హైదరుజంగులకుఁ బంపిన సందేశములో నిట్లుచెప్పియున్నాఁడు.

“మానప్రాణముండిన దనుక బొబ్బిలికోటఁ
బరులకీయరు వెల్మవారలనుము

* * * *

తుచ్ఛపుఁ బ్రాణములకయి స్వచ్ఛయశముఁ
బాడొనర్పరు శ్రీరావు వంశ్యులనుము
కీర్తి శాశ్వతమనుము................"

అంతియకాదు వృద్ధుఁడును బ్రభుభక్తి పరాయణుఁడును, నను భవజ్ఞుఁడు నగు దామెర దమ్మన్నసైతము విజయము విషయమై యించుక సందేహపడియే యున్నాఁడు.

"జననీ! బొబ్బిలిరాజ్యలక్ష్మి నిను నీచస్వాంతుఁడొక్కఁడు తీ
అని కామంబునఁ గోరినాఁడతనిపై రాగంబువాటించి నీ
తని వర్జించెదవో జగద్విదిత పాతివ్రత్య రుజ్మండలా
శనిచే భస్మముఁ జేసెదో యిదె నమస్కారంబు నీకీశ్వరీ!॥

ఎటులైనను సంధికార్యనిర్వాహణభార మాతనియందే యున్నది. సంధి తప్పక కుదురునని యతనికి దృఢమైన నమ్మకము లేకపోవుట చేతనే

"ఖడ్గపుత్రికిఁ గదనరంగంబునందుఁ
బెండ్లిపేరంటములను గావింపవలయుఁ
ద్వరితముగ మీరలెల్ల స్నాతకులుగండు
పద్మనాయకులార! ధీసద్ములార!"

అని వెలమవీరులను హెచ్చరించి యున్నాఁడు.

ఈనాటకములోని కరుణారసము మిక్కిలి జాలి పుట్టించునది గానున్నది. విజయరామరాజు పద్మనాయకసైన్యమును నురుము జేయుచుండుటయుఁ, బద్మనాయకవీరులు పెక్కండ్రు భయంకరములగు శత్రుఘ్నుల కాహుతి యగుచుండుటయు, బొబ్బిలికోట పగిలిపోవుచుండుటయుఁ గాంచి రంగారాయఁడు

"బొబ్బిలిరాజ్యలక్ష్మి! సరిపోయెను నీకిక నా ఋణంబు"

అని యనినప్పుడును అంతఃపుర కాంతాజనమును శత్రులపాలఁ బడకుండ వీరోచితముగ క్షాత్రధర్మము నిర్వహించు విషయమై చెలికాని వెంకయ్య కాజ్ఞాపించి

"జాలివహింపకయ్య, కలుషంబని నీకిఁక బ్రాలుమాలి యీ

వాలును రిత్తసేయుటకుఁ బొల్పడకయ్యా, సతీమతల్లులన్
గూలుచు పట్లనెమ్మదిని గుండు వహింపకుమయ్యా, గెల్వఁగాఁ
జాలమటంచు స్త్రీవధను సల్పఁగఁబోగదవయ్యా నెయ్యమా!"

ఖడ్గము నొసంగునపుడును మఱియు

"అనురాగంబునకున్ బ్రియంబునకుఁ బ్రేమావేశ సంసిద్ధికి
దినమే యంత్యదినంబు సాంఘికమృతిన్ దేవుండు కల్పించె నో
వనితారత్నములార! ఐహికపు సంబంధంబు తీరెన్ బరం
బుననే యింకఁ బునస్సమాగమము ప్రాపింపుం డశ్రుగర్భాంజలుల్"

అని యవరోధజనమునకు సందేశమంపునపుడును హృదయము కఱఁగి స్రవించు చున్నది. రంగారాయని మరణాంతమున వెంగళ రాయని మనోదుఃఖమును రాజాము కోటనుండి తిరిగివచ్చు పాపారా యఁడు దుశ్శకునములఁ గాంచుటయు మూర్ఛపోయిన వెంగళరాయని సందర్శనమును వారిరువురి యంత్యసంభాషణము విచారము కలిగించుచున్నది. మఱియు మల్లమాదేవి తనకుమారుని జూచి

"ముద్దులకుమార యికనైనఁ బోయిరారం"

యని చేటి కప్పగించునపుడును దనకుమారుని విషయమై సాముర్లకోటలోని సోదరికి సందేశమంపుచు

"కడుపసిపాపఁడాకలికిఁ దాళఁగలేఁడు
కడుపుననిడిపెనిఁ గాంచుమమ్మ
బుడుతండు పిల్లిపేర్పులవాఁడు కావునఁ
గనలియెన్నండేని కసరకమ్మ
శిశునాకును గల నేస్తంబుఁ దలపోసి
యూరకమది దిగులొందకమ్మ
పసివానిఁ బ్రతికించి వంశంబునిల్పి నా
యాశీర్వచనముల నందుమమ్మ
వఱల నీయుత్తరమువచ్చు వఱకుమేము
బంధుగణంబులతోడ స్వర్గాననుండుమమ్మ

కరుణవిడకమ్మ సుతుని నేమఱకుమమ్మ
బాలుఁబ్రతికింపు మమ్మ! నీ భారమమ్మ!॥”

అని వచించునపుడు హృదయము శతధా భిన్నమగుచున్నది. పాపము! చెలికాని వెంకయ్య మిక్కిలి జాలిపేగులవాఁడు. అతఁడు పద్మనాయకవీరుల యంతఃపురాంగనల దుర్దశలపాలు గాకుండ వీరోచితముగ ఖండింపవలయునని యుద్దేశముకలవాఁడె గాని యాసాహస కార్యము నిర్వర్తింప నాతనిచేతు లాడకున్నవి. కావుననె,

“చెలికాని వెంకయ కరప్రాలంబతీక్ష్ణాసికా
పరకాంతానికురుంబ కంఠరుధిరప్రత్యగ్రసత్కారముల్”

అని యెంతపరితపించినను నాకార్యము నిర్వర్తించుటకు రంగారాయుని కంతకంటెఁ బరమాప్తుఁ డెవ్వడును లేడు. ఇంకొకచోట,

“కఠినకర్కశరిపురాజ కంఠదళన
భయదకర్మంబునకు నీవుపనికిరావు
ఖడ్గమా యింక మార్దవ కలితములగు
చివురుఁబోఁడులకుత్తుకల్ చెండఁబొమ్మ॥”

అని యెట్టకేలకు మల్లమదేవికి ఖడ్గమునొసంగి సాధ్వీరక్త పూరితమైన కరవాలమును తిరిగి కైకొనుచున్నాఁడు.

మల్లమాదేవి పాత్రసంపోషణ విషయమై యించుక చెప్పవలసి యున్నది. బొబ్బిలి కథాంశమును గూర్చి యిదివఱకు వ్రాయఁబడిన నాటకములలో మల్లమాంబ పతిభిక్ష పెట్టుమని విజయరామరాజునకు రహస్యముగా సందేశమంపినట్లు కానవచ్చుచున్నది. కాని ధీరస్వాంత యగు నావీరమాత స్వభావనిర్మాణమునం దది యెంతపెద్దలోపమొ విశదమగుచున్నది. దిట్టకవి నారాయణ కవిచే రచింపఁబడిన రంగారాయ చరిత్రమును బట్టిచూడ నాసాధ్వీమణి యెన్నఁడట్టి నీచమున కొడఁబడలేదనియు మానరక్షణార్థమై తుచ్ఛప్రాణములను రవ్వంతయు నరకు సేయలేదనియుఁ దేటతెల్లమగుచున్నది. అంతియుకాదు. వెలమ పెద్దను మాన్యుఁడునగు రంగారాయుని యగ్రాంగి నాటకమునను నాజన్మద్వేషియు మ్లేచ్ఛపక్షపాతియునగు విజయరామరాజును బతిభి

త్రుపెట్టుమున నెటుల సాహసించెనో గ్రాహ్యముకాకున్నది. ఈ రెండు కారణములను బట్టియే మల్లమాదేవి పద్మిని, మీరాబాయి, దుర్గావతి, కృష్ణాకుమారి, లక్ష్మీబాయి, రుద్రమదేవి మొదలగు నుత్తమ వీర పత్నులతోఁ దులదూగుచు నాంధ్ర మహిళాలలామలకు మేలుబంతియై యలరారుచున్నది.

ఈనాటకము నందలి కొన్ని పద్యము లాంధ్రుల రాజ్యవిస్తారమును, నాంధ్రుల పరాక్రమాతిశయమును, నాంధ్రుల కీర్తివైభవమును వర్ణించుచు నాంధ్రదేశాభిమానము హృదయ సీమలయందు నెలకొల్పుచున్నది.

ఈనాటకము పాపారాయనిర్యాణమని పేరు పెట్టబడినను ఇందలి ప్రధానపాత్రము పాపారాయఁడెయని తోఁచుచున్నను 4, 5, 6, అంకములయందు నతనిఁ జేర్కొనుట కవకాశము లేకుంటయును, వెలమ వీరులందఱకును బ్రళయసామ్యమగు యుద్ధసమయమున బొబ్బిలిలో లేకుంటయును నతనిమనోభావములు బొబ్బిలి కోటపైనను మల్లమాదేవి రంగారావులపైనను గేంద్రీకృతములగుటచే నాటకము విషాదముగాఁ బరిణమించుటకుఁ గేవలమతఁడే కారకుఁడుగాక పోవుటయును, మొదలగు కారణములచే నితఁడె కథానాయకుండని నిరూపింప వీలులేకున్నది. ఐనను విజయరామరాజునకును బుస్సి హైదరుజంగులకును హృదయశల్యమును రంగారాయని కాగర్భశత్రువునునగు విజయరామ రాజును జంపిన వెలమవీరుని మరణముతో నాటకము విషాదముగ ముగింపఁబడిన కారణమునఁ బాపారాయఁడు ప్రధానపాత్రమని తప్పక యొప్పుకొనవలసియున్నది. అతని కథానాయకత్వమును గూర్చి గుణగ్రహణ పారీణులగు విమర్శకులే చర్చింతురుగాక.

ఇందలి శైలి నిర్దుష్టమై యించుక సులభమై ధారాళముగనున్నది. మనోహరమగు నిట్టి పితృప్రేమవిషయిక విషాదనాటకమును బాంక మహాశయుల కందఁజేసిన శ్రీ శేషాద్రిరమణకవు లెంతయు వందనీయులు.

గుంటూరు
6-3-21

ఇట్లు,
చామర్తి రాజశేఖరరావు, బి. ఏ.

# విజ్ఞప్తి.

రసికులారా!

ఆంధ్రవీరుల విక్రమాతిశయముఁ దెలుపు నీకథాంశమును పలువురు నాటకములుగ వ్రాసియున్నారు. కథాంశముపైఁగల విశ్వాసమె మమ్మీనాటకరచనమునకు సాహసింపఁ జేసినది. ఈనాటకరచనమున మేము కొన్ని నూతనమార్గములతోఁ గథావస్తువును సవరించి సుఖాంతముగ మార్చితిమి. పద్మనాయకాబాలవృద్ధ రక్తధారాపరిప్లుతమగు బొబ్బిలి కథారంగమునఁ బట్టాభిషేకముఁ బెట్టి వీరరసమును శుభాంశముతో సాంకర్యమొనరింప సాహసింపక ప్రధానపాత్రమగు పాపారాయని మరణముతో నీనాటకము ముగించితిమి. కథాసంగ్రహణార్థమై రావువంశీయుల చరిత్రము, రంగారాయచరిత్రము, బొబ్బిలికథ (జంగముకథ), ఆంధ్రకవుల చరిత్రము నాధారముగఁ దీసికొంటిమి. గ్రంథరచనానంతరము శ్రీ అయ్యంకి వేంకటరమణయ్యగారు రచించిన "బొబ్బిలియుద్ధ"మను వచనకావ్యముఁ జూచియు వారి సలహా ననుసరించియుఁ గథాంశములు కొన్ని మార్చితిమి.

గ్రంథము రచించి యారుసంవత్సరములయ్యెను. కారణాంతరములచే నాటకముఁ బ్రదర్శించుటకును ముద్రించుటకును వీలు కాదయ్యెను. చాలకాలము గ్రంథము నజ్ఞాతవాసముఁ జేయించి, రసికులు భాషాభిమానులు మా శ్రేయోభిలాషులు నగు శ్రీ అయ్యంకి వేంకటరమణయ్య [illegible] యాభిమానముచే నిప్పటికిఁ బ్రచురింపఁ గలిగితిమి. నాటకము [illegible] కాలమున మేము స్థానాంతరమునందుంట [illegible] ముద్రణస్ఖాలిత్యములు మిక్కుటముగ దొరలెను. విస్తరింపక యర్థభంగమొనరించు ముఖ్యదోషముల మాత్రము గ్రంథాంతమున వివరించియున్నారము. బుస్సీభాషణము గ్రాంథికభాషలో వ్రాసితిమి. నర్తకులావశ్యకమును బట్టి యాంగ్లేయములోనికి మార్చికొనవచ్చును. హైదరుజంగు సంభాషణము తురుష్కపదమిశ్రితమగు గ్రామ్యములో వ్రాసితిమి.

విలున్నచో హిందీలోఁ బరివర్తనము చేయించికొనినఁ బ్రదర్శనమున కుపయుక్తము. కథానుసారముగ భాషాంతరీకరణము గావించి విజయ రామరాజు బుస్సి హైదరుజంగుల యభిప్రాయముల నొకరికొకరికిఁ దెలుపుట యావశ్యకమేని యొక (దుబాసి) ద్విభాషిని రెండవయంక మున జేర్చికొనవచ్చును. ప్రదర్శకుల కింతకంటె విన్నవింపవలసినది లేదు.

ఈనాటకము నామూలాగ్రము పఠించి తమయమూల్యమగు కాల ము వినియోగించి పీఠికవ్రాసి దయచేసిన మామిత్రులగు శ్రీయుత చామర్తి రాజశేఖరరావు పంతులువారికిఁ గృతజ్ఞులము. రసజ్ఞులీ నాటక మునఁగల గుణలేశమున కానందింపఁ బ్రార్థితులు.

సుధీవిధేయులు,
శేషాద్రిరమణకవులు,
శతావధానులు.

———

# నాటకమునవచ్చు పాత్రలు.



రంగారావు. (బొబ్బిలి ప్రభువు)

వెంగళరావు. (యువరాజు)

పాపారాయుఁడు (సర్వసేనానాయకుఁడు)

దామెర దమ్మన్న (రాయబారి)

గూఢచారులు

భటుఁడు

విజయరామరాజు (ప్రతినాయకుఁడు)

బుస్సి

హైదరుజంగు

లాడూఖాను

కాకర్లపూడి వెంకటరాయుఁడు

ఇనుగంటి ధర్మారాయుఁడు

చెలికాని వెంకయ్య

హాసనల్లీఖాఁ

చినరంగారావు (రాజపుత్త్రుఁడు)

దేవులపల్లి పెద్దన్న

## స్త్రీలు.

చేటి

మల్లమాదేవి ([illegible])

కథానుసారముగఁ గొందఱు యుద్ధభటులు వత్తురు.

శ్రీ ర స్తు.

# నాంది

చ॥ నిరుపమసద్మనాయక వినిర్మలవంశమునన్ జనించి భూ
భరమును బాపరాయుపయిఁ వైచి ద్విజాన్వయు రాము గర్వసం
హరణ మొనర్చి ధర్మపథమందు జరింపుచుఁ బ్రేమ మల్లమా
తరుణిపయిన్ వహించు గుణధాముఁడు రాణ్మణి ప్రోచులోకముల్.

ఉ॥ భారతధర్మనిర్వహణ పారగులౌనరపాలకుల్ రస
స్ఫారకవిత్వతత్త్వ విలసత్తరులౌ విబుధుల్ పరాక్రమో
దారులు యోధవర్యులు సతంబును సేవయొనర్చుచుండఁ జె
ల్వారెడి యాంధ్రమాతచరణాంబుజముల్ మదిఁజేర్చిమ్రొక్కెదన్॥

(నాంద్యంతమున)

సూత్రధారుఁడు—అభిరూప శేఖరులగు నోసభాస్తారులారా! ఆంధ్రదేశ కథాప్రదర్శనముచే మిమ్మునలరింపఁ దలంచితిని. రూపకనామ మేమనుచున్నారా? నటితో నించుక భాషించి కాలాను గుణ్యమగు కథాంశమును నిర్ణయించి నాటకనామము విన్నవిం తును. సతీ! ఒకమాఱిటురమ్ము. (స్వ) ఇంకఁ గేశరచనము ముగి యలేదుకాఁబోలు.

నటి—(ప్రవేశించి) ఆర్యపుత్రా! బొబ్బిలి సంగ్రామమునె ప్రదర్శింప నిశ్చయించితిరా? మీతలంపు గణనీయము. ఆంధ్రవీరుల విక్ర మ జీవితములఁ బ్రచురించుటలో నీకథ సర్వవిధముల వాసిఁగాం చియున్నది.

సూత్ర—బొబ్బిలి సంగ్రామమునె ప్రదర్శింపఁదలంచితినని నీవెటులఁ నిర్ణయింపఁగలవు. నేనిదివఱకుఁ దెల్పితినా?

నటి—ఆఁ. తెలిపితిరి.

సూత్ర—నేనేనా? నీతోడనా? వినుఁడు సభాసదులారా! నేఁడు బొబ్బిలి సంగ్రామముఁ బ్రదర్శింతుమని వాకొనియున్నాఁడనట. చూచితిరా నటీమృషావాదము?

నటి—ఆర్యా! ప్రమాదము నాయందెయున్న క్షమింపుఁడు. మీరు పద్మనాయకులను పాపారాయని మల్లమాదేవిని ద్విజవంశాలంకారుఁడగు విజయరామరాజును ప్రశంసించుటచే నేనటుల భావించితిని.

సూత్ర—"ఘుణాక్షరన్యాయము"గనిష్టదేవతాప్రార్థనము బొబ్బిలివీరుల కన్వయించియుండ వచ్చును. సుప్రసిద్ధులగు ననేకు లీ బొబ్బిలి నాటకము రచించిరి. మన మనేకపర్యాయములు ప్రదర్శించియుంటిమి. క్రొత్తనాటక మేదేని తెలుపరాదా? క్రొత్త వింతగదా?

నటి—ప్రకృతకాలానుగుణ్యముగ విషాదాంతముగ వ్రాయఁబడిన నీ పాపారాయ నిర్యాణమును బ్రదర్శింతమా? ఇది చరిత్ర నాటకమేగదా.

సూత్ర—(నటి వద్దనుండి గ్రంథము దీసికొనిచూచి) ఇది దుఃఖాంతమగు బొబ్బిలినాటకమా? నీయభిమానము ననుసరించి దీనినె ప్రదర్శింపఁజేసెద. గ్రంథకర్తలెవరు?

నటి—శేషాద్రి రమణకవు లను సోదరులు.

సూత్ర—సుప్రసిద్ధులగు నీకవులఁ గూర్చి వేఱు తెలుపఁబని లేదు. గ్రంథప్రశస్తి ప్రపంచ ముఖమున నేను వినియె యున్నాఁడ. సభ్యులనీ గానకౌశలముచే నానందపఱుపుము. నేపథ్యమునకుఁ జేరుదము.

నటి—మనోజ్ఞమగు నీఋతురాజమును దనివిదీఱ వర్ణించి జిహ్వాఁజరితార్థ మొనర్చికొందుఁగాక.

సీ॥ ప్రధనంబునఁ గాయ♦పడిన వీరుల మేని
యట్లు రాజిల్లె ర♦క్తాంబుజములు

పగతురబల్లెంపు ♦ బదనువాయివితాన
మోహనంబు గమించె ♦ మొగలిపూలు
శాత్రవసైనిక ♦ శల్యసంచయముల
ట్లలరారసాగెను ♦ భ్రాంబుజములు
విజయలక్ష్మిహాస ♦ విమలకాంతులరీతి
నిండారె పండువె♦న్నెలలమిన్ను

తే॥ గీ॥ రణమునకా భూమికొఱగిన♦రాచబిడ్ల
కొసఁగ తర్పణవారి నా౯♦బొసఁగె రభసులు
వితతసంగ్రామ నిర్వాహ♦విజయలక్ష్మి
యాకృతినిఁబోలె నీశర♦దాగమంబు॥

సూత్ర—సతీ! నీజవ్వనంబునందుబలె గాత్రమందుఁగూడ నొకానొక నూత్నవికాసము వెల్లివిరియుచున్నది. శాంతితో నీరణగీతము ముగింపుము. వీరరసావతారులగు పద్మనాయకులు రంగస్థలమ లంకరించుచున్నారు. నేపథ్యమున కేగుదము.

నటి—వీరరసావతారు లనుటచేఁ దేటిచూడభయమునగుచున్నది. పోవుద మురండు.

ఇది ప్రస్తావనము.

---

శ్రీ ర స్తు.

# పా పా రా య ని ర్యా ణ ము



## ప్ర థ మాం క ము.

రంగము:— బొబ్బిలి సభా మందిరము.

(రంగారావు, వెంగళరాయఁడు, పాపారాయఁడు ప్రవేశింతురు)

రంగా—నిజాముప్రభు వుత్తరసర్కారులఁ బరాసువారి కొసంగియుం టచే వారిపక్షమున బుస్సిదొరగారు కళింగదేశమునఁ బన్నులు తీసికొనుటకు దేశమును దమ యాజమాన్యముక్రింద నుంచుకొను టకు దేశకాలావస్థలఁ దిలకించుటకు రాజమహేంద్రవరమునకు వచ్చియుంటయు మనముదక్క మిగిలిన జెంద్రండలు దర్శనము సేగియుంటయు మీరెఱింగియే యుందురు. అతని మంత్రి హైదరు జంగు మిగుల వంచకస్వభావుఁడు.

పాపా—అయిననిపుడేమి! నిష్కల్మషులమగు మనకు వెఱపేల!

రంగా—మనకుఁ బ్రబలద్వేషియగు విజయరామరాజు బుస్సిదొరగారి యొక్కయుఁ దన్మంత్రియగు హైదరుజంగుయొక్కయు నెయ్య ముఁబడసి మనకేదో యెగ్గాలోచించుచున్నటుల గూఢచారు లెఱింగించియున్నారు.

వెంగ—అన్నయ్యా! తామిందులకై విచారము నొందవలసిన యవ సరములేదు. బొబ్బిలిగడ్డపై నొక్కపద్మనాయకుఁడు జీవించి యున్నను మన కపాయము వాటిల్లదు.

ఉ॥ వాలును డాలు కేలఁగొని ♦ వచ్చి రణాంగణమందు నిల్చి యా
భీలపరాక్రమంబు గను ♦ పించి మెలంగెడి వెల్మజేనితో
కాలుఁడెకాదు, త్రిపురహరుఁడు ♦ కాల గిరీశుఁడుగాని నిల్వఁగాఁ

జాలఁడు, సంశయింపడఁగఁ జన్నె! యొకానొక మ్లేచ్ఛసూతికిఁ॥

పాపా—వెంగళరాయూ! కాలమెుక్కవిధమున లేదు. విజయరామరాజు మన కనులమూసి యే మాయోపాయముచేనైనను బొబ్బిలి రాజ్యము హరింప వలయునని పట్టుఁబట్టియున్నాఁడు. తగినట్టు లాతనికిఁ బరాసుదొర ప్రాపకముఁ గూడ లభించినది. కావుననే యీవిషయమయి యింతగ నాలోచింప వలసివచ్చినది.

వెంగ—అంతటి వికల్పకాలము తటస్థించి విజయరామరాజు పరాసు వారితోఁగలసి మనలఁ బ్రతిఘటింపనే తెంచిన నాఁటికి మనకుఁ గర్తవ్యము శరణ్యము లేకపోవునా? నిర్హేతుకముగఁ బరాసు వారు మనపైఁ గత్తికట్టుదురా!

రంగా—తమ్ముఁడా! మనము చేయునాలోచనలు శరణ్యముకొఱకుఁ గర్తవ్యముకొఱకె. అసూయాపరులు పరుల వంచింప నుద్యమించుతఱి హేతువులఁ గల్పించుకొనలేకపోరు. విజయరామ రాజు పరులవంచించుటలో నమానుషప్రజ్ఞఁ గలవాఁడు. బుస్సి పరులకులోఁబడుటలోఁగూడ నట్టివాఁడె. కాననె దూరదృష్టికిఁ బాలుపడవలసివచ్చినది.

వెంగ—అన్నయ్యా! విజయరామరాజు కృత్రిమమార్గము నవలంబించునని దృఢముగా నమ్మకమున్నచోఁ దాముగూడ బుస్సి సన్నిధానమున కరుగరాదా?

పాపా—వెంగళరాయూ! మీయన్నగారు బుస్సిదర్శనమునకుఁ బోకుండుటకుఁ బెక్కులు కారణములుకలవు. బుస్సిదొర సంస్థానములపైఁ గ్రొత్తపన్నులువిధించి ప్రతిసంస్థానముపైని స్వాతంత్ర్యము తానె వహించుచున్నాఁడఁట. ఇఁక మనముదర్శించిన నిట్టినిర్బంధమునకు లోఁబడవలసివచ్చునేమొ యని యుపేక్షవహించిరి.

వెంగ—ఏమీ! యాంతర్యమిదియూ! పద్మనాయకవీరుల పరాక్రమమె వజ్రప్రాకారముగాఁగల బొబ్బిలిసంస్థానముపైఁ బన్నులుపెంచు

టకు యాజమాన్యముమార్చుటకు నీ బుస్సియెవఁడు. అట్టివిప
రీతపుమార్పువలని లాభమనుభవింప విజయరామరాజెవఁడు.

సీ॥ శ్రీకాకుళాంధ్ర ల♦క్ష్మీనాథు కడకంట
ననిశమింపొందు ప్రే ♦ మామృతంబు
కాకతీయుల పతా ♦ కలక్రిందఁ దాండవిం
చిన రాజ్యలక్ష్మి సు ♦ శ్రీప్రసక్తి
ఖడ్గతిక్కన యశః ♦ కాంతిలోలీనమై
కానవచ్చెడి పరా ♦ క్రమరసంబు
శ్రీకృష్ణరాయ ధా ♦ త్రీనాథ విక్రమ
క్రమ గర్భితంబైన ♦ కౌశలంబు
తే॥ గీ॥ ఆంధ్రశూరవతంసులా ♦ రా? పరాక్ర
మాధిగత భారతీయులా ♦ రా? రణార్థు
లింకనేనియుఁ గండని ♦ హెచ్చరింప
వెలమవీరుండువెలుచునే ♦ విలయమునకు॥	2

పాపా—రణరంగమునఁ బద్మనాయకశూరులకుఁ గల చిరకాలాభ్యా
సము ప్రపంచమునఁ గొలఁదికాలములో వ్యక్తముకాఁగలదు.
కాకతీయ రాజ్యారంభమునఁ బరరాజ్యాకర్షణంబువలన జని
యించి స్వతంత్రపాలనవశంబున జ్వాలామాలికాకీలితంబైన
యీపద్మనాయకశౌర్యవహ్నికిఁ బ్రతిపక్షకోటి శలభబృందమై
తీఱును. ఆంధ్రమాతయు నాసుదినముకొఱకె వెలమవీరుల
హృదయపీఠమునఁ దపముఁగావించుచున్నది.

మ॥ అనవద్యంబగు నాంధ్రతేజమునకై ♦ యాసించి గెల్వఁగడిం
చినవారెవ్వరు? ఖడ్గతిక్కనయశ ♦ శ్శ్రీభాగ్యముఁ రుద్రదే
వుని విఖ్యాతపరాక్రమంబును స్వయం ♦ భూదేవ కారుణ్యభా
జనముఁ గాంచిన వెల్మవీరు మహదై ♦ శ్వర్యంబు సామాన్యమే॥

వెంగ—హృదయపుటమునిండి వెలికుఱుకు మనపరాక్రమములఁ గష్ట
సాధ్యముగ లోలోననె నిర్బంధించి యరాతులచెంతనుండి సందే

శము తెలియువఱకు శాంతించుదము. అనంతరకర్తవ్యమున కాంధ్ర దేశముకలదు. ఆంధ్రవీరులుకలరు.

(నేపథ్యమున) దేవా? హైదరుజంగుసమ్ముఖమునుండి యొక భటుఁడు సందేశముఁగొని ద్వారమున నిలచియున్నాఁడు. ఏమి యాజ్ఞ.

వెంగ—ఓయీ వెంటనే ప్రవేశపెట్టుము.

భటు—(ప్రవేశించి అందఱినుజూచి) దేవా వందనములు. బుస్సిహైదరుజంగుప్రభువులు తమ కీపత్రిక నొసంగి సరియగుప్రత్యుత్తరము వెంటనె తెమ్మనిసెలవిచ్చిరి. చిత్తగింపుఁడు

(రంగారాయునికి జాబునొసంగును)

రంగా—(చూచి ఆగ్రహముతో) ఏమీ! ఉత్తరము వ్రాసినవాఁడు విజయరామరాజా! వ్రాయించినవారు బుస్సీయు హైదరుజంగునా? హిందువుల దురదృష్టవశమున నాంధ్ర దేశము పరాసువారిచేతిలోనికిఁ బోయినది. పోవుఁగాక. అంతమాత్రమున నే నేల బుస్సియడుగులకు మడుగులొత్తవలయును. పరాక్రమహీనుఁడు పౌరుషపువిలువ నెఱుంగనివాఁడు పరుల దాస్యమునకుఁ బాలుపడునేమొగాని యీరంగారావుమాత్రము సజీవిగ నున్న నట్టినైచ్యమునకుఁ బాలుపడఁడు. పరాసువారిని వ్యతిరేకించినందులకు నాకు స్థానచలనమాశిక్ష! ఆంధ్రసామ్రాజ్యస్థాపకులును వీరాహవనిర్వహణప్రతిష్ఠా ధురంధరులును శూరచూడామణులు నగు నీవెలమవజీరులు కొనప్రాణముతో నున్నవఱకు బొబ్బిలికోట పరులకు వశముకానేరదు. కాఁజాలదు. బొబ్బిలికోట మేము వారములో విడువవలయునా? లేకున్నఁ గోట బలవంతముగా స్వాధీనముఁగావించి కొందురా! ఓపరాసుదొరా? ఓహైదరుజంగు మంత్రీ! తెలుఁగుఁగత్తుల మెఱుఁకుఁదనము మీా రెఱుంగరుకాఁబోలు. రండు ప్రతిఘటిం

పుఁడు. విజయరామరాజున కీబొబ్బిలిరాజ్యము స్వాధీనమగుట మాటలతో జరుగునదికాదు. ఈయనుచితమగు తలంపున కెడమిచ్చినందులకు బొబ్బిలిరాజ్యలక్ష్మి కెంతభూతబలి కావలయునో అగాతులారా! ఊహింపుఁడు.

సీ॥ కాంచీపురంపు దు ♦ ర్గములభేదించిన
బ్రహ్మయసేనాని ♦ పౌరుషంబు
ఖడ్గపుత్రికి రణాం ♦ గణమునఁ బెండ్లిఁగా
వించిన శ్రీరుద్ర ♦ విభునిశక్తి
మార్తురబలముల ♦ నార్తిపాల్ జేసిన
బాలచంద్రుకృపాణ ♦ భావుకంబు
అరులరక్తంబుచే ♦ ధరణి భూషించిన
యనపోతనాయకు ♦ నాగ్రహంబు
తే॥ గీ॥ రావువేంకటరంగభూ ♦ రమణహృదయ
పద్మమున నూత్నభావనా ♦ పటిమతోడఁ
బ్రతిఫలించుచునుండెనో ♦ పగతులార
కదనకార్యార్థులై వేగఁ ♦ గదలి రండు॥

పాపా—(రంగారాయునివలన జాబుఁగైకొని) ఇది విజయరామరాజు లిపివలె నున్నదే. విజయరామ భూపాలా! నీయందెట్టి విపరీతాభిప్రాయము లుద్భవించుచున్నవి. పరులరాజ్యమున కాసనొంది నీవుచేయుచున్న మాఱువేసములే యీరూపమునఁ బ్రతిఫలించుచున్నవి. సహజమగు పరాక్రమమె నీకున్నఁ బరుల పంచల పాలగుదువా?

మ॥ విలయప్రాప్తికి హేతుభూతమగు నీ ♦ విద్రోహదుర్బుద్ధి బొ
బ్బిలిపై నేటికిఁ బెట్టజూచెదవురా? ♦ వీరుండవేనైన చోఁ
బలకఱ్ఱ వాలునుదాల్చి మమ్ము నెదిరిం ♦ పఱారమ్ము; నీబీరపుం
బలముల్ దేలకయుండునే విజయరా ♦ మా! దుష్టకల్పద్రుమా॥ 5

వెంగ—(జాబుచదివి) ఓరీ పరిచారకా! నీవు విజయరామరాజుగారి

పరిచారకుఁడవై మ్లేచ్ఛులకు సందేశముల నడపుచున్నాఁడ వేల! నీప్రభువునకు వలె నీకేదేని దురాశాపాశము కుతికకుఁదగులు కొనలేదుగదా!

భటు—ఈప్రశ్న ప్రకృతవ్యవహారమునకు సంబంధించినయంశము కాదు. పామునోటఁబడి కప్ప పురుగులకై నాలుక సాచునట్లువిజయ రామభూపాలుని వాగురలోఁ బడియు నింక విక్రమింతురేల! ప్రతికృతియోజింపుఁడు. అభిమానమునిల్పుకొనుఁడు.

వెంగ—ఏమిరా! విపరీతప్రసంగమునకు సాహసించుచున్నాఁడవు. వెలమ వీరుల పరాక్రమము నీవెన్నఁడెఱుంగవుకాఁబోలు. మేము విజయ రామరాజు మాయావాగురలో నెన్నటికిఁజిక్కము. ప్రభు మంత్రోత్సాహశక్తులలో మాకెందునుఁ గొఱంతలేదు. మేమభి మానమునిల్పుకొనఁగలమొలేదొ యాంధ్రదేశమె వీక్షింపఁగల దు. ముందునీవుప్రాణమునిల్పుకొమ్ము.

ఉ॥ రాక్షసజన్ముఁడౌ విజయ ♦ రాముని దాస్యమునక్షమదించి, ప్రా
ణక్షయభీతిఁబోవిడచి ♦ న్యాయవిహీన దురుక్తిసంతతిక్షా
బాక్షికబుద్ధితో నిచటఁ ♦ బల్కిన దోషముశాంతినొందఁగా
శిక్షయొనర్తు, నాలుకను ♦ జీల్చెదు, నా కెవరడ్డువత్తురో॥ ౯

(కత్తిఁగొనిపైకిఁ బోఁబోవఁ బాపారాయఁడు వారించును.)

పాపా—వెంగళరాయా! శాంతింపుము. శాంతింపుము. ఈ పరిచార కుఁడు విజయరామరాజు దుర్బోధలచే నిటులఁబ్రేలు చుండ వచ్చును. మనమితని శిక్షించితిమేని హైదరుజంగు బుస్సిగార లకు మఱింత కోపకారణమగును. కోపమునకు దేశకాలపాత్ర ములుండవుకదా!

వెంగ—అగ్రజా! ఈదురుద్యముఁడు మనకొలువుకూటమున నుండఁ దగిన వాఁడు కాఁడు. వేగ ప్రత్యుత్తరమునొసంగి పంపుట యుక్తము. ఈతని మొగముఁజూచిన దాది నాహృదయమున

వింతయునరాని కోపాగ్ని రగుల్కొనుచున్నది.

రంగా—ఓయీ పరిచారకా! నీప్రసంగవైఖరిఁజూడ నీవెన్నఁడు రాజ సభలలోఁ బ్రవర్తింపవలసిన ధర్మముల నెఱుంగనివానివలెనో యెఱింగి తిరస్కారభావముఁ బ్రకటించువానివలెనో గానవచ్చు చున్నాఁడవు. నీతో విశేషించి భాషించుటకు నిన్నిట విశేషకాల మునిల్పుటకు మేమంగీకరింపఁజాలము. మావిన్నపము నంతయు నొకదూతునిముఖమున బుస్సి హైదరుజంగులకు నివేదింతుము. నీవీసందేశము మాత్ర మెఱింగింపుము.

సీ॥ కొనప్రాణముండిన ♦ దనుక బొబ్బిలికోట
పరులకీయరు వెల్మ ♦ వారలనుము
పద్మనాయకసుతుల్ ♦ ప్రథనరంగంబన్నఁ
గలనైన భయమును ♦ గాంచరనుము
పరులకు స్వాతంత్ర్య ♦ పట్టాభిషేకంబు
సేయరీ తెలుఁగువ ♦ జీరులనుము
విజయరాముని కై గా ♦ దజునకైనను రాజ్య
సంపద వశముకాఁ ♦ జాలదనుము
తే॥ గీ॥ తుచ్ఛపుం బ్రాణములకయి ♦ స్వచ్ఛయశము
పాడొనర్పరు శ్రీరావు ♦ వంశ్యులనుము
కీర్తిశాశ్వతమనుము దు♦ర్వర్తనంబు
కొలఁదికాలంబునకె గట్టి ♦ కుడుపుననుము॥ 7

ఈసందేశము కేవలము బుస్సినిగూర్చినదియె కాన నాయనకు విన్నవింపుము. మాప్రతినిధివలన బుస్సిదొరగారు వ్రాయించిన లేఖకుం బ్రత్యుత్తరమును బంపుదుము.

పాపా—ఓయీ! ఈవిరోధమునకుఁ గారయితయగు విజయరామ రాజున కీసందేశమును తాండ్రపాపారాయఁడు పంపెనని తెలియ జేయుము.

ఉ॥ రార! దురాశయా! విజయ ♦ రాఘవ! బొబ్బిలిరాజ్యలక్ష్మి నిం
డారుకవుంగిటన్ నిను జ ♦ యాంతమునందువరించునో రిపు
స్ఫారుపహ వీతిహోత్రమనఁ ♦ గాఁదగు మామక ముష్టిఘాతసం
స్కారముచేత శుద్ధుఁడవు ♦ కాఁగలవో తెలియంగనయ్యెడిన్॥ 8

వెంగ—ఓరీ! సేవకా! నాసందేశముకూడ విజయరామరాజున కెఱిం గింపుము. విజయరామరాజా! బొబ్బిలిరాజ్యమున కాశపడుచుం టివా! వినాశకాలమునకే నీకిట్టి విపరీతపుబుద్ధులు జనించుచు న్నవి. నిజముగ నీకిఁక బత్తెముతీరినది.

ఉ॥ విలసితధర్మలో వెలమ ♦ వీరుల కౌఁగిటిలోననిల్చి యి
మ్ముల సుఖజీవనంబుగను ♦ బొబ్బిలిరాజ్యరమాపురంధ్రి నిన్
వలచునఁటంచు నెంచకుము ♦ వామపదంబు భవత్ శిరస్థ్సలిన్
నిలుపదు; కానియాసపడి ♦ నీల్గకు దానఁ బరంబు దప్పెడిన్॥ 9

పాపా—ఓపరిచారకా! మా సందేశవాక్యములు యథారూపములుగా మీప్రభువులకు విన్నపింపుము. ఇఁక నీవుగమ్యస్థానమునకుఁ జేర వచ్చును.

భటు—అయ్యా! మీక్షేమమునకేని మీరుపాటుబడుట కర్తవ్యము. కేవలము పరాక్రమమునె నమ్మికొని ప్రతిఘటించి సంస్థాన మును అవస్థలపాలుఁగావింపకుఁడు.

వెంగ—నీచాత్మకా! ఇంకను ప్రేలుచున్నాఁడవా! ఈకరవాలముచే నీ యుత్తమాంగమును త్రెళ్ళగొట్టుచున్నాఁడను. కాచుకొమ్ము. (కత్తివిసరివేయును.)

భటు—(స్వ) అన్యాయముగఁ జంప నుద్యమింతురా? ప్రతిఫలముఁ జూపెదనులెండు. (నిష్క్రమించును.)

పాపా—విజయరామరాజా! సరిహద్దులలోనున్న బొబ్బిలిరాజ్యమును నీవిజయనగరసామ్రాజ్యముతోఁ గలుపుకొనవలయునని పరా సుదారను దేవిరించుచున్నాఁడవా! హైదరుజంగును యాచించు

చున్నాఁడవా! ఇది మాటలతో సాధ్యమగుకార్యముకాదు. భారతమాత యీనెపమున క్షత్రసేనారక్తమెంత బానముజేసి తృప్తిఁగాంచనున్నదో యోజింపవైతివి. దురుద్యమ బద్ధకంకణు లగు భవాదృశుల శిరముల సాలభంజికలుగ మొగసాలల కంటఁగట్టుదుముగాని యాత్మీయరాజ్యమును మీకుఁబట్టము గట్టము. ఆత్మనాశనమునకు వెనుదీయము. పరులకు బొబ్బిలి రాజ్యము వశముగానీయము. శ్రీరంగభూపాలుని యాజమాన్య మున్నంతవఱకుఁ బాపారాయఁడు సజీవిగనున్నంతవఱకు స్కంధావారమున నొకసైనికుఁడేని జీవించియున్నవఱకు బొబ్బిలి రాజ్యము పరులకు వశముకాఁజాలదు. పార్థివగుదువేని వృథావాంఛలఁజాలింపుము.

చం॥ పరమ పవిత్రశీలయయి ♦ భాసిలు బొబ్బిలిరాజ్యలక్ష్మి సా
దరమొటుసంఘటిల్లు రిపు ♦ ధైర్య సమాహరణప్రశస్తి బం
ధురుఁడగు పాంపప్రాపయఘు ♦ నుండు సజీవిగనున్న దుర్నయా
కరుఁడగు రామభూపతికిఁ ♦ గాలముసాయము చేయకుండినన్ ॥ 10

వెంగ—అగ్రజా! దూతనుబంపుట మన కవశ్యకర్తవ్యము. కార్యఖడ్గ ప్రవీణుఁడగు వెలమవీరు నెవనినేని యిందులకు నియోగించుట యుక్తమని నాకుఁదోఁచుచున్నది.

(దామెరదమ్మన్న ప్రవేశించి కోపముతో) ఓవిజయరామ రాజా! నీవెంతటి నైచ్యమునకుఁ బాలుపడు చున్నాఁడవు. బొబ్బిలిరాజ్యము నీకొసంగిన పండ్రెండులక్షలరూపికలు హైదరు జంగున కొసంగెదవా! అతఁడీలంచపుఁ గల్లుదావి నీకు బొబ్బిలిరాజ్యము కట్టిపెట్టునా? వెలమవీరు లీప్రళయకాలమున నుపేక్షామాత్రశరణ్యులై యుందురా! మంచిది.

మ॥ అరిరాజన్య వరూధినీదళన లీ ♦ లాభీల బాహాబలా
కర యోధోత్తమజాలపాలితము, రం ♦ గారాయ భూమండలే

శ్వర సంరక్షిత తాంధ్రపాపయ ధరా ♦ పాలాగ్ర్యి నిర్యాత్యర్థ ద్రో:
పరిఘావేష్టితమైన బొబ్బిలిని నీ♦వా? కోరి జీవించుటల్॥ 11

విజయరామరాజా! దురాశాపాశ బద్ధుఁడవగు నిన్నువధింప నీ దామెరదమ్మన్న యొక్కఁడె చాలునుఁగాని యింతవఱకు రా జాజ్ఞకొఱకు నిరీక్షించితిని. ఇఁక నీయాయువు కొలఁదికాల ములో నున్నది. (ముందునకుఁజూచి) అపుడె రాజసమ్ముఖ మునకే తెంచితినే! కోపావేశమునఁ బ్రకృతము మఱచుచున్నాఁ డను. (రాజు వైపునకు మఱలి) వినయముతో రాజా! విజయ రామరాజొనరించు దుండగముల వినుచుంటిరిగదా!

రంగా—ఆఁ వినక యేమి. ప్రపంచముఖమున సర్వము నెఱింగియే యున్నారము.

వెంగ—దమ్మన్నగారూ! విజయరామరాజు హైదరుజంగునకు లంచ మొసంగి బొబ్బిలిరాజ్యముఁ బడయనున్నాఁడా! ... వార్త. దీనిని మీకెవ రెఱింగించిరి?

దమ్మ—ఇప్పుడె గూఢచారులవలన ... కెఱింగించి ప్రతిక్రియ కల దేమో యోజింపవచ్చునని వచ్చుచున్నాఁడను.

పాపా—దుర్మార్గా! విజయరామరాజా! నీకెట్టి విపరీతపుబుద్ధులు పుట్టు చున్నవిరా! బొబ్బిలిరాజ్యము మాకనులమూసి హైదరుజంగు నీకెటులనర్పించునో నీవెటులఁబాలింతువో కాంచకపోను.

సీ॥ వేంకటరంగభూ ♦ విభునిఖడ్గకుమారి
కదనంబునన్ శాంతిఁ ♦ గాంచలేదు
వెలమవీరుల బాహు ♦ బలకీర్తిచంద్రికల్
ప్రౌఢభానం బెడఁ ♦ బాయలేదు
బొబ్బిలిశూరుల ♦ భూరిపరాక్రమ
సూర్యుఁడస్తాద్రికిఁ ♦ జొచ్చలేదు
నౌంగళరాయు దో ♦ ర్వీర్యవహ్నిజ్వాల
కడలల్లిగొని నివు ♦ ర్గప్పలేదు

తే॥ గీ॥ రండు వైరినృపాలులా ♦ రా? త్వదీయ
సైనికబలంబు నుగ్గనూ ♦ చముగఁ గాఁతి
హైన్యముగ, నామరూపాది ♦ శూన్యముగను
భస్మముగఁ జేయుదుము రణ ♦ ప్రాంగణమున॥ 12

వెంగ—బావా! ఇది విలంబమొనరించుటకుఁ దగినకాలముకాదు. ముందు ప్రతిపక్షుల సమ్ముఖమునకు దూతను బంపుటయుక్త కార్యము.

రంగా—దమ్మన్నగారూ! గూఢచారు లింకనేమేని విశేషముల నెఱిం గించిరా?

దమ్మ—విన్నవించు చున్నాఁడను. మనరాజ్యమునుండి విజయనగర రాజ్యములోనికిఁ బాఱుచు నారాజ్యము ఫలవంతముగఁ జేయు గొండవాఁగులకు మనమానకట్టలఁగట్టి మనదేశమునఁ బాఱించి విజయరామరాజును నష్టపఱచితిమఁట. అదిప్రధానకారణముగ మనల ద్వేషించుకొఱకు దన శక్తినంతయు వినియోగించి యనేకవిధముల దుర్బోధలగావించి విజయరామరాజు బుస్సిని లోఁబఱచికొనెను. హైదరుజంగును లంచమొసంగి వశము గావించుకొనెను. ఈ స్థితిలో నొకవంచకుఁడు రంగారావు జాఫరల్లీఖాన్ మొదలగు ద్రోహులతోఁ గలసి రాజద్రోహ బుద్ధితో నుండెననియు నందువలననె దర్శనమునకు రాలేదని యును మొఱఁగెను. విజయరామరాజు పదివేలసేనతో బుస్సి దర్శనమునకువచ్చెను. కాన నాతనిదుండగము తనంతనె బహి రంగమగుచున్నది. దీనికనుగుణముగ నారాయణదేవుఁడు నరస రాజు మొదలగువారు తలలూపిరి. ఇవిగూఢచారులవాక్య ములు.

రంగా—ఔరా! విజయరామరా జెంతటిపాపమునకుఁ బరవంచనమునకుఁ బాలగుచున్నాఁడు. స్వబలము లేని వాఁడు పరులవలన లభ్య

మైన భాగ్యము నెంతకాలము వశమున నుంచుకొనఁగలఁడు; మిత్రభేదముగావించు నీ విజయరామరాజు బాగుపడిననాఁటికిఁ జూచెదఁగాక! దమ్మన్నగారూ! బుస్సిదొరగారివద్దనుండి మా కొకవార్తవచ్చినది. చిత్తగింపుఁడు.

దమ్మ—నాయనా! నీవే పఠింపుము. నేను సావధానముగానాలకింతును.

వెంగ—(జాబు చదువును) మహారాజశ్రీ రావు రంగారావుగారికి.

మీరు ఉత్తరసర్కారులపై సర్వస్వాతంత్ర్యములుగల మమ్ము దర్శింపరాకుంటయెకాక పలువురను రాజద్రోహమునకుఁ బురికొల్పుచుంటిరి. మీకీవిషయమున సహాయకారియగు శ్రీకాకుళపు నవాబ్ జాఫరల్లీఖానును సాధింపనున్నారము. మమ్ము వ్యతిరేకించినందులకు స్థానచలనమే మీకుశిక్ష. ఈలేఖను మీకుఁజేరిన వారముదినములలోఁగ బొబ్బిలికోటనువిడచి ప్రతిఫలముగ మేము చూపినస్థలమున కరుఁగవలయును. అందుల కియ్యకొనరేని బలవంతముగ మీకోట [illegible]ధ్వంసముఁగావించికొని బొబ్బిలిరాజ్యము విజయ[illegible]సంగఁగలమని నమ్మవలయును.

(లేఖకుఁడు విజయరామరాజు) ఇట్లు, బూసి. హైదరుజంగ్.

దమ్మ—ఔరా కాలమహత్త్వము. ప్రభువులు దూరదృష్టిలేని వారయినపుడు పైయధికారులు లంచపుఁగొండులయినపుడు ధర్మము వకు నిలువనీడదొరకునా!

మ॥ జననీ బొబ్బిలిరాజ్యలక్ష్మి! నిను నీ ♦ చస్వాంతుఁడొక్కండు తీ
అనికామంబునఁగోరినాఁ డతనిపై ♦ రాగంబువాటించి నీ
తినివర్జించెదవో? జగద్విదిత పా ♦ తివ్రత్యరుజ్మండలా
శనిచే భస్మముఁజేసెదో? యిదె నమ ♦ స్కారంబు నీకీశ్వరీ॥ 13

పాపా—దమ్మన్నగారూ! తాము రాజకీయ వృత్తాంతముల నన్నింటి నెఱింగియున్నారు. విజయరామరాజు దుస్తంత్రములు పెచ్చు

బెఱఁగి బొబ్బిలిరాజ్య వినాశన హేతుభూతము లగునేమోయని మనము భయపడవలసిన దినములు వచ్చుచున్నవి. బుస్సిదొర హైదరుజంగులచే విజయరామరాజు వ్రాయించిన జాబు మీరు వినియేయున్నారు. ఈ వికల్పసమయమున వివిధన్యాయజ్ఞుఁడు అనుభవజ్ఞుఁడు నగు నొకదూతను బరాసుదొరపాలికిఁ బంపుట కర్తవ్యము. ఈ కార్యము నిర్వహించుటకు సంధిఁగూర్చుటకు మీరలెయోగ్యులు. ఉత్తమ పద్మనాయక వంశజులగు తా మీపని కియ్యకొని రాజ్యమునకు క్షేమముఁగల్గింపవలెనని ప్రార్థన.

దమ్మ—పాపారాయా! నేను దౌత్యమునకు సంతోషపూర్వకముగా నంగీకరించుచున్నాఁడను. నేనంతటి యుత్తమ కార్యము సమర్థింప నర్హుఁడఁగానని సంశయపడుచున్నాఁడను గాని వేఱుగాదు. నాజీవితము నీయుత్తమకార్యము నిర్వర్తించి పవిత్రముఁ జేసికొందును.

[illegible] ♦ [illegible] లపల్కులెల్ల మీ
కలఁతలఁనన్నిఁటిౕ లయముఁ ♦ గాంచఁగఁ జేసెద రామరాజుకో
ర్కులు నశియింపఁ జేసెద వి ♦ రోధములేదనిపించెదౕ మదు
క్తులచట సాగవేని యని ♦ కోసమురమ్మని పిల్చివచ్చెదౕ॥ 14
ప్రభుభక్తిపరాయణుఁడగు నీదమ్మన యింతటిస్వల్పపుఁ బనినెఱవేర్పఁ జాలఁడా? రాజా మీసందేశము నెఱిఁగింపుఁడు. వేగమె దూతకృత్యమునిర్వహించెద.

తే॥ గీ॥ ఖడ్గపుత్రికిఁ గదనరం ♦ గంబునందుఁ
బెండ్లిపేరంటములను గా ♦ వింపవలయుఁ
ద్వరితముగ మీరలెల్ల స్నా ♦ తకులుకండు
పద్మనాయకులార! ధీ ♦ సద్ములార॥ 15

రంగా—దమ్మన్నగారూ! బుస్సిగారితో సమయోచితముగ భాషించి వెంగళరాయని వివాహకార్యమున, రంగారావు ప్రమత్తుఁడై యుంటచే మీసమక్షమునకు రాలేదని విన్నవింపుము. దాని

తో వారు శాంతించిరేని యవకాశముఁగల్పించుకొని నేను
జా॥ దర్శనమున కేగుదును. అందుల కియ్యకొనక బొబ్బిలిరాజ్యమె
కావలయునని భల్లూకపుఁబట్టుఁ బట్టిరేని

పాపా॥ సీ॥ ఇటుసూర్యుఁడటు లుద ♦ యించిన బొబ్బిలి
విజయరామునకు న ♦ ర్పింపఁబోము
వెలమవీరులు ప్రాణ ♦ ములతోడ నున్నంత
దనుక రాజ్యంబు సా ♦ ధ్యంబుగాదు
పద్మనాయకులపైఁ ♦ బగదాల్చి బ్రతికిన
వెంగ॥ ఘనుఁడు మందునకేని ♦ కానరాఁడు
ప్రాణసువారలకైన ♦ బరదేవతకునైనఁ
దెలుఁగుపౌజులు వెను ♦ దీయబోవు

గీ॥ బుస్సియును హైదరేకాదు ♦ మూఁడునూర్ల
రంగ మందిబుస్సులు హైదరుల్ ♦ మార్కొనినను
ఆంధ్రవీరులు చలనంబు ♦ నందబోరు
కదలిరమ్మను మరులను ♦ గదనమునకు॥ 16

మ॥ కదనస్థానము వైరిభూరమణ ర ♦ క్తస్విన్నముఁ జల్పి, దు
ర్మద రాజన్య కపాలమాలికలచే ♦ రాజ్యంబుభూషించి, య
స్మదుపాస్యన్ జయలక్ష్మి నాంధ్రధరణీ♦ సర్వంకష ప్రాభవన్
వె॥ ముదితాత్మన్ బొనరింతునంచు నరిభూ ♦ పున్ మండలింపందగున్॥

కం॥ సంగరమన వెఱవఁడు క్షణ
భంగురమగు ప్రాణమునకు ♦ వాంఛింపఁడు శ్రీ
పె॥ రంగవిభుఁడనుచు హైదరు
జంగుదళిన్ బుస్సిదళిఁ బ్రి ♦ సంగింపఁదగున్॥ 18

ఈహూతబోధకంబై విజయరామరాజు దుర్బోధయే రుచించెనేని
వెలమవీరుల కరవాలములె విరోధులఁ జక్కఁగాఁ బరామర్శింపఁ
గలవు. పోయిరండు.

పాపా—దమ్మన్నగారూ! బుస్సీహైదరుజంగులకుఁ బ్రభువొసంగిన ప్రత్యుత్తరంబె చాలును. సర్వవిషయములా సూత్రప్రాయవాక్యములయందు గర్భితములై యున్నవి. న్యాయవేదుల కంతకంటె నెక్కుడు బోధఁజేయ నవసరములేదు. ఈవిద్వేషమునకుఁ గారకుఁడగు విజయరామరాజుతో మాత్రము నానూటఁగ నిటుల సెలవీయఁ బ్రార్థించెదను.

మ॥ రణమేనిశ్చయమేని త్వద్రుధిరధా ♦ రాసారణిన్ వైరిమా
రణ విఖ్యాత పరాక్రమక్రమ సమి ♦ ద్రంగప్రచారుండు భీ
షణశాతాసి నికృత్త విద్విష దధీ ♦ శవ్రాతుఁడౌ పాపరా
ణ్మణి శ్రీబొబ్బిలిధారిణీస్థలమునన్ ♦ బాటించు రామాహ్వయా॥ 19

ఇప్పటి కీసందేశము చాలును. దైవవశమున యుద్ధమె యగునేని మిగిలినసందేశము నేను స్వయముగ విజయరామభూపాలున కెఱింగించెదను.

దమ్మ—వెంగళరాయా! నీకేమేని సందేశమున్న నెఱింగింపుము.

వెంగ—నేనుగూడ విజయరామరాజున కొక సందేశమును బంపవలసి యున్నయది. దమ్మన్నగారూ! సావధానులై చిత్తగింపుఁడు.

కం॥ కరవాలధారచే, నీ
శిరమును జెండాడ వెలమ ♦ సేనానాథుల్
పరతెంతురు, బొబ్బిలిలో
మరణింపకు విజయరామ ♦ మానవనాథా॥ 20

ఇంతియ నాసందేశము. శూరవర్యా! మీరింకఁ దడయక రాజమహేంద్రవరమునకుఁ బ్రయాణము కావలయును. మీసంధి విషయ మేరీతిగ ఫలించునో తెలియనిది మేమేమియుఁ జేయవీలు కలుఁగఁజాలదు.

దమ్మ—రాజా! పాపారాయా! వెంగళరాయా! ఇంక నాకాజ్ఞ నొసంగుఁడు. నాశక్తినంతయు ధారఁబోసి యెటులేని బుస్సిచెంతఁ

బరిచయమును గల్పించుకొని విజయరాముని దుస్తంత్రములు హైదరుజంగు లంచగొండితనములు నివేదించి మన కభిముఖు నిగఁజేసెద. అయ్యది యొనగూడదేని కాఁగలకార్యములు మీరందరెఱింగినవె.

సీ॥ విజయరాఘవుఁడు క ♦ ల్పించిన దుష్కృత్య
పుంజముల్ బుస్సికి ♦ బోధఁజేసి
లంచంబుఁజేకొని ♦ వంచించు హైదరు
జంగుచేష్టలను ర ♦ చ్చలకునీడ్చి
పరరాజ్యమున కాస ♦ పడ నధర్మంబంచు
విజయరామునిచెంత ♦ విన్నవించి
అన్యుల స్వాతంత్ర్యి ♦ మపహరించుట రాజ
ధర్మేతరమని యం ♦ దఱకుఁ దెలిపి
గీ॥ సంధిసూత్రమ్ములను గాఢ ♦ బంధనమున
వైరికులమును బంధించి ♦ వచ్చువాఁడ
సామ దానమ్ము లచ్చట ♦ సాగవేని
సంగరంబున నన్నియుఁ ♦ జక్కవడును॥ 21

ఉ॥ సంధికి నాప్రయత్నములు ♦ సాగకయుండిన విక్రమించి ద
ర్పాంధుల మార్తురఁ ♦ రణవి♦హారమునల్పఁగఁ బిల్చివచ్చెదఁ
బంధుర యోధజాల పరి ♦ పాలిత బొబ్బిలిరాజ్యలక్ష్మి సం
బంధమె కాకయున్నఁ బ్రతి ♦ బంధమె కాంతురుగాక శాత్రవుల్॥

పాపా—దమ్మన్నగారూ! రాయబారమునఁగూడ బొబ్బిలి వెలమబిడ్డ యని యనిపింపవలయును సుండీ! మనము ప్రత్యర్థుల యాచింప వలసిన యవసరములేదు.

దమ్మ—మిత్రమా! ఆవిషయమై మీరు చెప్పవలసిన యగత్యములేదు. సహజమగు విక్రమమె యుండవలయునుగాని యది దాఁచినను దాఁగునదికాదు. విరోధులు నాహితోక్తులు వినక ప్రతికూలిం

తురేమొ, మీరు సేనలసిద్ధపఱచి బొబ్బిలికోట జాగరూకతతోఁ దిలకించుచుండుఁడు. నేను సెలవుఁ బుచ్చుకొనెదను.

రంగా—(సింహాసనముదిగి) మంచిది. మీరాకకొఱకు నిరీక్షింతుము. పోయిరండు. ఉభయుల భావముల సమన్వయించు కార్యము మాతయందెక్కలదు.

చం॥ మనమునఁ బక్షపాతమును ♦ మాని, హితంబు హితేతరంబు రూ
జనమొనరించి, నీమదికి ♦ సమ్మదమౌగతి, రాట్సభాంగణం
బున వచియించి, మార్తురకు ♦ బొబ్బిలికిన్ బ్రణయ ప్రధానబం
ధనము ఘటించి జన్మముఁ గృ♦తార్థముఁ జేయఁగదయ్య నెయ్యమా॥

పాపా—శూరశిఖామణీ! సంధివిధాన మంతయు నీలౌక్యమున బద్ధమై యున్నది.

మ॥ కరవాలంబులు శాంతిఁగైకొనవు సం ♦ గ్రామంబునన్, వెల్మవా
రరిరాజన్య శిరోధి ఖండనము జే♦యన్ జంకఁగాఁబోరు, మా
ర్తురు నిశ్వేలసమిత్కళావిదులు దు ♦ ర్బుద్ధుల్ తటస్థుల్ ప్రజా
భరముల్ దీర్పకుమంచు బున్నిదొరకున్♦ వ్రాయుచ్చఁగాఁ గోరెదన్॥

రంగ—ఓ పద్మనాయకాగ్రేసరా! అరాతులు యుద్ధమునకే మురియుదురేని సాధ్యమైనంతవఱకు వెంటఁబెట్టుకొని రమ్ము. ఆవలి విషయముల మేము సమర్థింతుము.

ఉ॥ కత్తులతోడఁ గాఁదగిన ♦ కార్యము మాటలతోడఁ గాదు, దు
శ్చిత్తుల కాత్మనాశనము ♦ జేకురుదాఁక గుణంబురాదు, నీ
మెత్తఁదనంబుఁ జూపక స ♦ మీహిత వైరివిదారణక్రియా
యత్తుఁడవై విరోధి నృపు ♦ లందఱఁ దోఁపఁగనిరమ్ము పోరికిన్॥

దామె—శూరవర్యులారా! మీ యిష్టానుసారముగ వర్తించెద. సెలవుఁ బుచ్చుకొనెదను.

మ॥ అరులం గైవసమాచరించెద! నసా ♦ ధ్యంబైనచో సామవా
క్పరిణామమ్ములతోడ నీతిపథముల్ ♦ వాక్రుచ్చెదర్, దానమా
ర్థురు శాంతంబువహింపకున్న ఘనశ ♦ త్రువ్రాత విచ్ఛేదనా
చరణ ప్రాభవ హేతిఘాతములచే ♦ సర్వంబుఁ జక్కఁబఱుచ్॥ 26

(నిష్క్రమించును)

పాపా—విజయరామరాజు చెంత లంచపుఁగసవుమేసిన హైదరుజంగు బుస్సిని సంధికంగీకరింపనీయఁడు. దమ్మనగారి కార్యనిర్వాహణములో నెట్టిలోప ముండనేరదుగాని పగతురుమాత్ర ముచితానుచితజ్ఞానశూన్యులు. ఫలితాంశ మచిరకాలమున ఘోరసంగ్రామ సంఘటనమె యనితోఁచుచున్నది.

వెంగ—(విసుగుతో) అట్లైన దమ్మన్నగారిచే సందేశము నేలపంపవలయును?

రంగా—తమ్ముఁడా! మనము శక్తికొలఁది పాటుపడుదము. అదృష్టము దైవాధీనము. పాపారాయా! పరాసుదొరగారి వద్దనుండి యైకమత్యవార్త వచ్చువఱకు మనము వృథాగఁ గాలక్షేపముఁ జేయఁదగదు. యుద్ధపరికరముల నాయత్తపఱచి దూరస్థలములనున్న సైన్యమును రప్పించి బురుజులఁ గోటల బాగుచేయించి యుద్ధమునకు మనమందఱము సర్వసిద్ధముగ నుండవలయును. ఈసంక్షోభ సమయమున వెంగళరాయుని వివాహము నాపుటయె యుక్తధర్మము.

పాపా—కాలము నమ్మఁదగినస్థితిలో లేదు. విరోధు లెపుడు మోసముగఁ బైఁబడుదురొ మనము కాచికొనవలయును. వివాహము నాపుటయె నాకభిమతము.

వెంగ—అన్నయ్యా! ఇపుడు వివాహము ముఖ్యముగా నాపనగును. ఏలయన

చం॥ లలితగుణాభిరామ జయ ♦ లక్ష్మి స్వయంగ్రహ యోగ్యశీలవై
యలరుచునుండె; నాయువిద ♦ హస్తముఁ గైకొన రామరాజెదర్
దలఁచుచునున్నవాఁడు నను ♦ దక్క మఱొక్కని స్వీకరింపదా
చెలువ, వివాహకార్యమును ♦ జేయఁగవచ్చు రణాంతమందునన్॥

రంగా—సోదరా! నీయభిమతమునకు దైవ మనుకూల మగునుగాక. నీయూహ ఫలవంతమగుఁగాక. మనము మిగుల జాగరూకులమై ప్రవర్తింపవలసినయదనిదియె. నీవు కొందఱు గూఢచారులను రాజమహేంద్రవగమునకు విరోధుల రహస్యములఁ దెలిసికొని వచ్చుటకుఁ బంపి సైనికులందఱును సాయంకాలమునకుఁ గోట చెంతకు వచ్చునటుల నాజ్ఞాపింపుము. మేమింతలో నాయుధశాలలు కోటబురుజులు చూచి వెంటనె వచ్చెదము. పాపారాయా! పోదమురమ్ము.

పాపా—రాజా! దయచేయుఁడు. ముం దీయాయుధశాలలోనికిఁ బోవుదము.

(అందఱునిష్క్రమింతురు.)

ఇది ప్రథమాంకము.



శ్రీరస్తు.

# పాపారాయ నిర్యాణము.



## ద్వితీయాంకము.

(విజయరామరాజు ప్రవేశించును.)

విజ— ప్రయత్నము చేయఁగఁజేయఁగ నిప్పటికి బొబ్బిలివారిని సాధింప నవకాశము చిక్కినది. బొబ్బిలివారిపై నాకుఁగల క్రోధము మితిమీఱినది. వారలొనర్చిన తిరస్కృతులు, సాహసములు, దుండగములుసహించి నాయాగ్రహమింతవఱకుఁ జంపుకొంటిని. బొబ్బిలిసంస్థానమునకంటె నాసంస్థానమన్నివిధముల నభివృద్ధిలో నున్నది. నేనెప్రతిఘటించి బొబ్బిలిరాజ్యముపైకి సంగ్రామమునకు సిద్ధపడువాఁడనెగాని నేటివఱకు దేశమునంతయు మహమ్మదీయులు పాలించుచుంటచేతను, సామంతులతగవు ప్రభువులే తీర్పవలయునను నియమముంటచేతను ఇంతవఱకు నాసంకల్పము నెఱవేఱదయ్యెను. ఇపుడుత్తర సర్కారులు ప్రెంచివారి వశమైనవి. వారిపక్షమున సర్వాధికారములఁ బడసి బుస్సియు హైదరుజంగును వచ్చియున్నారు. ఏసంస్థాన మెటుల దగులఁ బడిపోయిననేమి? ఏరాజెటుల నశించిననేమి? వారలకుఁ గావలసినది ధనముమాత్రమె! కావుననే లంచమపేక్షించి హైదరుజంగు బొబ్బిలి నెటులేని నాకు వశముఁగావింతునని వాగ్దానముఁజేసియున్నాఁడు. బుస్సి హైదరుజంగునతిక్రమించి పోవువాఁడు కాకపోవుటచే నాసంకల్పము ఫలించినది. ఎంతశ్రమమైనపడి బొబ్బిలినిజయించి విజయనగరరాజ్యముతోఁ గలుపవలయును. విరోధి బలవంతుఁడై సరిహద్దులలోనుండఁగ నుపేక్షింపరాదు. బొబ్బిలిని గారణాంతరములు కల్పించి ముట్టడించువారును, తదనంతరము నాకొసంగువారును పరాసువారుగాన

నాకీర్త్యపకీర్తులువారివి. ఫలితము నాయది. రంగారావు బుస్సి దొరవారిదర్శనమునకు రాకపోవుటయే నా ప్రయత్నమునకు సహకారియైనది. బొబ్బిలికిఁ బంపఁబడిన పరిచారకునివలన నేమి వార్తవచ్చెనో తెలిసికొని యనంతర కర్తవ్యము నిర్ణయింతుఁగాక. (ప్రకాశముగ) ఎవరురా! అక్కడ! హైదరు జంగునవాబుగారివద్ద కేగి నేను దర్శనమునకై వచ్చితినని మనవిఁ జేయుము.

(నేపథ్యమున) చిత్తమటులె యొనర్చెదను.

విజ—మహమ్మదీయులు స్తోత్రప్రియులు. ఎంతస్తోత్రమొనర్చిన వారంత వశమగుదురు. కార్యార్థి కిదియొకమార్గము.

(నేప) దేవా! దర్శనమునకు రావచ్చునని సెలవిచ్చిరి.

విజ—మంచిది. నీపనికినీవుపొమ్ము.

(నిష్క్రమించును)

---

*రంగము- హైదరుజంగు సభాభవనము.*

(భటుఁడు, విజయరామరాజు ప్రవేశింతురు)

హైద—ఐతేబొబ్బిలిగడి యిస్తామని నీకీవాంళ్లు శెప్పారూలేదూ.

భటు—మీయాజ్ఞాపత్రిముఁగాంచి రంగారావు ఆగ్రహోద్రగ్రుఁడై కన్నులనిప్పులుకుఱియ బొబ్బిలికోటను బొందిలోఁ బ్రాణమున్నంత వఱకుఁ పరులకు వశముచేయమనియుఁ దుచ్ఛప్రాణముల కాసనొంది యన్యులకు దాస్యము చేయమనియు మీరందఱొక్క పెట్టున మమ్ములముట్టడించినను లక్ష్యము లేదనియు మేఘగంభీరస్వరంబున దిక్కులుమారుమ్రోయ కత్తిజళిపించుచు వాకొనసాగెను. ఇది తగదని రంగారావుగారిని మందలింపఁబోవ వెంగళ రాయఁడు కత్తిఁగైకొని నన్నుఁ జంపవచ్చెను. పాపారా

యుఁడు వారింపకున్న నీసరికి గతించియుందును. అంతతో శాం తింపక వెంగళరాయఁడు బొబ్బిలిరాజ్యము బుస్సికి హైదరుజంగు లకు వశముఁగానీయము. నీ విటనుండఁదగదు పొమ్మని కత్తి విసరివైచెను.

హైద—యెంగళరాయడు బోత్ బహద్దూర్ వుండాడు. ఆయనికి యుద్దెంలో శిచ్చచేశి నౌకరిసేపిచ్చాలా! ఆయన్కి మాది తాఖిద్ అంటె యేమిలక్షెంలేకుండావుంది. సచ్ బోలో! కోట మాకీ హుకుంశూంచీ యిస్తాం అన్నారూలేదూ? యియ్యకపోతే తిగినపని అవుతుందీ అనిచెప్పావూలేదూ! క్యా.

భటు—కోటను విడువమని గట్టిగ తాయిగ్రుద్దిచెప్పిరి. విజయరామ రాజుగారన మీరన బుస్సిదొరగారన వారలకించుకేనియు లక్ష్యములేదు. మీయాజ్ఞను వారు మాటలతోఁబాటించెదరా! మీరలనిన వారలకేమేని లక్ష్యముకలదా?

హైద—లక్షెంగిక్షెం బైటికి తెప్పిస్తా దేఖో. హైదర్ జంగ్ పేరు శెప్తె బొబ్బిలివాండ్లు గడగడ వనికిస్తా శూడు! బొబ్బిలికోట యిజ యరాంసాబ్ కి యియ్యకపోతే యేమివుంది? తెలింగీదేశెం అంతా మాదీసర్కార్ క్రిందవుంది. మాకి స్వతంత్ర జాస్తీవుంది. జబర్దస్తీ చేస్తాం. మాకీ అడ్డెం యేమివుంది. యిజయరామసాబ్ రావాలా యిసారణ శెయ్యాలా! (చూచి) బోత్ ఖుషి. యిజయ్యరాంసాబ్ వస్తూవుంది. బైటో మహారాజ్ బైటో.

విజ—(కూర్చుండి) పరిచారకా! బొబ్బిలి వృత్తాంతములెవ్వి? కోటను రంగారావు మొదలగువారు విడచి మనకు వశముఁ జేసెద మనిరా? లేదా?

భటు—కోటను మూమ్మాటికి విడువమనిరి. అంతతోఁబోక సందేశ ముల తెచ్చితిమని మరుస్తులాడిరి. వెంగళరాయఁడు నన్ను జంపఁ బైకవచ్చెను.

విజ—ఔరా! బొబ్బిలివారల యహంకార మింక నంతరింపలేదా ! ఈ పరిచారకుఁడు విజయరామరాజుగారి బంటనియు బుస్సిదొరగారి దూతయనియు నెఱింగియే వెంగళరాయఁడు చంపఁబోయెగా! ఏమి కాలవిపర్యాసము. ఇవి యంత్యకాలపుబుద్ధులు.

ఉ॥ పొంగకు పొంగకోయిమది ♦ బొబ్బిలిరాజ్యము సుంతలో సమి
ద్రంగమొనర్చెదన్, విజయ ♦ రామనృపాలుని శక్తినీవు చూ
డంగల వేలరిత్తగ జ ♦ డత్వముఁదాలిచి పూన్కిఁజూపెదో
వెంగళరాయ! నీవు విల ♦ పించుదినంబులు రాకపోవునే॥ 1

హైద—(కోపముతో) ఫౌజు లడాయికి తయ్యార్ శెయ్యాలా! నాకీ హుకుం జవాన్కి హుకుం లక్షిం శెయ్యకుండా బొబ్బిలివాండ్లు బేఫికర్ మీద వుండారు. వాళ్లది కోట మట్టికిమట్టి దుమ్మూకు దుమ్ము శేసి నాది తడాఖా శూపిస్తాన్. వాళ్ళకి సంగతి బుస్సి మహారాజ్ కి శెప్పి జైలుకీపెట్టిస్తాన్! తమాషా దేఖో.

భటు—మీరీతప్పునకు క్షమించిన బొబ్బిలివారలు మనల నిలువ నీయరు. మీచిత్తము.

హైద—నువ్వు మాకీ శెప్పాలావద్దు. బొబ్బిలిగడీకి మాదీ షైన్యం జల్దీపడుతుంది. వాంళ్ళకి గమ్మత్తు శేస్తాను. తెలింగీ దేషం పమునా బుస్సిమహారాజ్కి అధీకారం మస్తూవుంది. బుస్సీ నాదీమాటలో వుండాడు. జవాన్! ఈసంగతి హుజూర్ బుస్సి దొరకి చెప్పిజావ్.

భటు—చిత్తము. సెలవుపుచ్చుకొనెదను. (నిష్క్రమించును)

విజ—చూచితిరా! బొబ్బిలివారి స్వాతిశయము. తాము వచ్చిన సంగతి విని దర్శనమునకు రాకపోవుటయుఁ బ్రత్యర్థులతోఁగలసి రాజద్రోహమునకుఁ బాలుపడుటయుఁ గాక మనపరిచారకుని బంపినను బొబ్బిలిరాజ్యము మాకు వశముఁజేయవలయునని

తెలిపినను రంగారావింతవఱకు వచ్చియుండఁడు. ఔరా! ఎంత తిరస్కారస్వభావుఁడు.

హైద—తిరష్కారం గిరష్కారం హైదర్ జంగ్ సాహెబ్ తెప్పిస్తాడు దేఖో. విజయ్ రామంసాబ్! రంగారావుకీ యింతా హామీవుంది వాడ్కి సైన్నెం ఎంతావుంది. గడీయెంతపెద్దావుంది.

విజ—స్వామీ! బొబ్బిలికోటనలువైపులలో నెటుచూచినను నాలుగువేంగల గజములు పొడవుగలది. నాలుగువైపుల నాలుగు బలవంతములైన బురుజులు దృఢములగు ద్వారములుకలవు. చుట్టును మిక్కిలిలోతుఁగల యగడ్తకలదు. ఆకోటనెప్పుడు గాలకింకరులకుఁ దీసిపోని నాలుగువేలమంది వీరభటులు రక్షించుచుందురు.

ఉ॥ నాలుగువేలసైనికులు ♦ నాలుగు వైపులఁగాచియుండ ని
ర్వేలసమిత్కళావిదుఁడు ♦ వెంగళరాయఁడు వైరినారి పాం
చాలుఁడు పాపరాయఁడును ♦ సౌఖ్యముఁగూర్పఁగ రంగరాయభూ
పాలకబాహుపాల్యమయి ♦ బాసిలు బొబ్బిలిగెల్వ శక్యమే॥ 2

హైద—యిజయరాంసాబ్ తుం దివానావుండావు. నీది మనస్సులో ధైర్నెం నిలవటాన్కి జోటులేదు. నాలుగుయేలాసైన్నెం కీ భయంపడ్తావు యెందుకు. తాంద్రపాపయ్యా యెంతావస్తాదు వుండాడు. బొబ్బిలిగడీ యెంతపెద్దా వుంది. రంగారావుకీ బలం యెంతావుంది. మనకీ ఫర్వాలేదు.

విజ—తామటుల సెలవీయకుఁడు. బొబ్బిలి నాలుగువేల సైనికులుగల సంస్థానముగదాయని చులకనగాఁ జూడఁదగదు. అంతకు నాలుగురెట్లు పెద్దసంస్థానముఁగలవాఁడనయ్యు నంతకు నాలుగురెట్లు సైన్యముఁ గలవాఁడనయ్యు సరిహద్దులలోనుండి వారల బల పరాక్రమ పౌరుషాదు లామూలమెఱింగి యుంటచేతనే నేఁటివఱకు వారొనర్చిన ద్రోహమునకు శాంతించితిని. ఇంతియగాక మఱియొక విశేషముఁగూడఁ గలదు.

సీ॥ వైరిమత్తద్విప ♦ పంచాననుఁడు చెలి
కాని వెంకయ్య కా ♦ లూనినిలువ
అరిరాజతిమిర మా ♦ ర్తాండుండు వెంగళ
రాయండు కదనవి ♦ క్రమముఁజూప
విద్విషజ్జలధర ♦ విలయానిలుఁడుదమ్మ
నాహ్వాయుం డతులశౌ ♦ ర్యంబు నెఱపఁ
బరిపంథి శంబర ♦ పటల శార్దూలుండు
తాండ్రపాపయ రణ ♦ స్థలి వసింపఁ

తే॥ గీ॥ బ్రథిత రిపుసైన్య జలనిధి ♦ మథన పృథుల
మందరాద్రియనందగు ♦ మహితమూర్తి
రంగరాయండు కదనభా ♦ రము వహింపఁ
బ్రతిఘటింపఁగ శక్యమే ♦ భువనకైన॥ 3

హైద—విజయ్యారాంసాబ్ తుం బడాపిఱికివాఁడూ వుండావు. నీకీ దైర్రెం లేదు. శౌర్రెం లేదు. బొబ్బిలివాంళ్లకి బయాంపడ్తావ్ యెందుకు. హైదరుజంగూ సాహెబ్ నీకి ఉప్పర్ ఉంది. నువ్వు పిచ్చివాఁడూవుండావ్. దైర్రెం జరా తెచ్చుకో.

విజ—మీరిటులఁ జెప్పుచున్నను బొబ్బిలివారిని జయించుట మన కసాధ్యమని నాకుఁ దోఁచుచునేయున్నది. కాననే యింతవఱకు నేనీప్రసక్తిఁ బెట్టుకొనఁజాలనైతిని. రంగారావు నాకంటె ధనమెక్కుడొసంగి మిమ్ముసత్కరించినచో నన్నుఁ బరిత్యజింతురేమో! అప్పుడు నాప్రయత్నము విఫలమగునేమో యనిసంశయించుచున్నాను.

హైద—మహారాజ్ తురకబిడ్డకి నాల్కవహాటివుంది. రెండులేదు. దెఖో పెమాణంశేస్తాఁ (కత్తిముట్టుకొని) మాఅల్లాతోడు సికియిడిచీపెట్టితే వుంది. నైతో సువర్ కాఘోష్ తిన్నట్లూ వట్టూ వుంది. నాదీ తాఖిద్ శూడక నాదీదర్శెనం శెయ్యక నాదీ జవాన్కి సంపబోయిన బొబ్బిలివాంళ్ళపైకి నాదీ దయ యట్లా

వస్తుంది. నీకీ ఆమందేహాంవద్దూ భాయి. ఆంద్రదేశం పైనా మాకీ సొతంత్రం అంతావుంది. మాకీ అడ్డంలేదు.

విజ—దేవా ! శాసఁ దప్పవద్దు. మీరు విరోధుల కించు కేనియుఁ జనుపీయవలదు. అది రాజనీతికి విరుద్ధము. తప్పక రంగారావో లేక దూతయో రాకపోఁడు. అపుడు మీరు గంభీరము వహించిన నన్నియు సాధ్యమగును. (ముందునకుఁజూచి) ఎవఁడో యోధుఁడు వచ్చుచున్నాఁడు. బహుశః రంగారావుగారి ప్రతినిధి కావచ్చును. మీదర్శనమునకె వచ్చుచున్నాఁడు.

హైద—ఎవఁడో కొత్తమనిషీ వుంది.

(దామెరదమ్మన్నప్రవేశించి) అకటా ! ఆంధ్రదేశమున కెంతటి దురవస్థపట్టినది. రాజులకైకమత్యములేదు. జాత్యభిమానము లేదు. పౌరుషాగ్ని చల్లారినది. మాతృదేశమంతయు పాశ్చాత్యుల హస్తగతమైనది. మనము వారలచేతి కీలుబొమ్మలమె. ఇఁక నెక్కడి స్వాతంత్ర్యము. ఎక్కడి విక్రమము. సర్వము మాఱిపోయినది.

శా॥ చాళుక్యావనినాథ విక్రమకళా ♦ జాజ్వల్యమాన ప్రభా
జ్వాలామాలిక తగ్గెఁగాకతి మహీ ♦ శ సామ్రాజ్య సామ్రాజ్య ల
క్ష్మీలీలావిభవంబు శాంతిలెఁ, ద్వదం ♦ ఘ్రిద్వంద్వ సంసేవన
వ్యాలోలాత్ముల నాంధ్రపుత్రుల మదం ♦ బా! యెట్లురక్షించెదో॥ 4
దేశీయుల జీవితములు పరహస్తగతములైనవి. ఇఁకఁ బూర్వ విచారముతో నేమిపని. నాసందేశకార్యము నిర్వర్తింతుఁగాక (హైదరునుజూచి) ఆదాబ్. సర్కార్ !

హైద—మీది యేసంస్థానం. మాకచ్చేర్కి యెందుకు వచ్చావు. క్యాకాం.

దమ్మ—అయ్యా ! విన్నవించు చున్నాఁడను. బొబ్బిలి సంస్థానాధీశ్వరుఁడు తమకొక సందేశమును బంప విన్నవింపవచ్చితిని. బొబ్బిలి

వారి దూతుఁడను. (విజయరామరాజునుజూచి) విజయరామ రాజా! నీకును దాంద్రపాపారాయఁడు వెంగళరాయఁడుగారలు వేఱొకసందేశమంపిరి.

విజ—ఔరా! రంగారాయని సాహసము. బొబ్బిలి రాజ్యవినాశన కాలముదాపరించినను రంగారా వింతవఱకు మేలుకొనకయు న్నాఁడు. ఇంకను సందేశములతోఁ గార్యములు సానుకూల మగునని తలంచెను గాఁబోలు. ఆతరుణము తొలంగిచాలకాల మైనది.

దమ్మ—విజయరామరాజా! బొబ్బిలి రాజ్య వినాశనకాలము దాప రించినదా! ఒకవేళనంతటి ప్రళయమె జరుగునేని విజయనగర రాజ్య నాశనకాలముఁగూడ దాపరింపకపోదు. ఊఱక ధర్మము తొలంగి భాషింపకుము.

హైద—బొబ్బిలిదొరా! మీకీ మీకీ లడాయియెందుకు పంగతిశెప్పు.

దమ్మ—(తనలో) లంచపుఁ గనవుమేసిన యీహైదరుజంగు విజయ రామరాజు పక్షము నవలంబించుటలో నాశ్చర్యమేమున్నది. ఈదురాత్ముఁడు సంధికుదురనీయఁడు. విజయరామరాజును బద్మనాయకవీరులు ప్రాణములతోవిడువరు. ఇపుడు నాసందేశ ము దెల్పఁజనదు. (ప్రకాశముగ) మారాజుగారు తమసందేశ మును బుస్సిదొరవారిముం దెఱింగింపుమనిరి. స్వతంత్రబుద్ధియు నధికారము గూడ నాయనకెకలదుగదా!

విజ—అదిగో? బుస్సిదొరగారు వచ్చుచున్నారు. సందేశముఁదెల్ప మొదలిడుము.

దమ్మ—విజయరామరాజా! నీకేల యీయప్రస్తుతప్రసంశ. తటస్థ ముగ నుండలేవా!

బుస్సి—(ప్రవేశించి పీఠముపై నాసీనుఁడగును.)

దమ్మ—అయ్యా! సలాములు.

బుస్సి—(చూచి) ఎవఁడవునీవు. ఇచటికేలవచ్చినాఁడవు.

దమ్మ—నేను బొబ్బిలివారి దూతను. వారు తమసన్నిధిలోఁ గొన్ని సంగతుల విన్నవింపుమని చెప్పిపంపిరి. విన్నవింప వచ్చితిని. తమదర్శనమునకు రాకుంటచే రంగారాయని మీరలు స్వతంత్రునిగ భావించితిరి. అదిమిక్కిలి యక్రమము. వారునేఁటికిని మీకు విధేయులె.

బుస్సి—మాకు విన్నపములతోఁ బనిలేదు. మాదర్శనమునకు రంగారావు రాక యెపుడుమానెనో త్రిలింగదేశముపై సర్వస్వతంత్రముఁగల మమ్ము నాఁడె తిరస్కరించినటుల భావించితిమి. మాపరిచారకు నెపుడు తిరస్కరించెనో యపుడె మాయుద్దేశము స్థిరపడినది. బొబ్బిలికోటను మాప్రభువు విడచెనా? ఇంకను విడువలేదా!

విజ—మాటలతో విడతురా! నువ్వులునూనె నిమ్మనిన నిచ్చునా!

దమ్మ—స్వామీ! ఆవిషయమె రంగారావుగారు మనవిచేయు మనినది.

సీ॥ అనుజు వివాహకా ♦ ర్యమగుట మీదుద
ర్శనమున కేనురాఁ ♦ జాలననియె
వలసినయంత క ♦ ప్పమొసంగెదముగాని
పురమును విడనాడి ♦ యరుగమనియె
విజయరామాఖ్యు బొ ♦ బ్బిలికధీశునిఁజేయఁ
దమపాటివారికిఁ ♦ దగనిదనియె
బూర్వార్జితములైన ♦ భూముల విడనాడి
పొమ్మనుటలు మీకుఁ ♦ బోలదనియె

తే॥ గీ॥ ఓరువఁగలేక యెవఁడొ యే ♦ దోవచింప
నాలకించుట మీకు న ♦ నర్హమనియెఁ

గొలఁది తప్పున కింతటి ♦ కోపమంద
నేల? మాలోపముల క్షమి ♦ యింపుమనిరె॥

ఇదియె రంగారాయని విజ్ఞాపనము.

విజ—పనిలోని పనిగ నన్నుఁగూర్చి పాపారాయఁడు వెంగళరాయఁడుఁ దెలిపిన సంగతులుగూడ వాకొనుము, ప్రత్యుత్తర మవసర మేని యొసఁగుదును.

దమ్మ—యుద్ధమేయగుట నిశ్చయమేని పాపారాయఁడు నీరక్తమును బొబ్బిలిరాజ్యములోఁ బ్రవహింపఁజేసెదనని చెప్పుమనెను. వెంగళరాయఁ డీదురాశకు లోనై ప్రాణాపాయమును గల్పించుకొనకుమని నీతి గఱపెను.

విజ—ఈపాపారాయని బెదరింపులకు వెంగళరాయని ధర్మశాస్త్రములకు నేను వెఱచువాఁడనుకాను. ఇదియే నావాండ్రిసందేశము.

బుస్సి—బొబ్బిలివారిని క్షమింపవీలులేదు. మఱచితిమి. మాయాజ్ఞోల్లంఘన మాచరించుటయెగాక మాదూతుని పరాభవించిన వారల మేము క్షమించునంతటి సమర్థులమా?

దమ్మ—దూతను పరాభవించుట రాజధర్మ విరుద్ధమని మాబొబ్బిలి ప్రభు వెఱుంగనివాఁడుకాఁడు, దూతుఁడేమేని వాక్పారుష్యము వెల్లడింప వెంగళరాయఁడు దుడుకుతనముఁ గనఁబఱచెనేమో. రంగారావు మీయాజ్ఞోల్లంఘనము నాచరించువాఁడు కాఁడు. దేశము స్వాధీనము నందుంచుకొనుటయుఁ గప్పముఁ దీసికొనుటయు మీనియతకృత్యము. ఈయుభయ నిబంధనములకు మేము లోఁబడెదము. మమ్ము మన్నింపుఁడు.

బుస్సి—మీయందు మాకు ద్వేషముఁగలిగిన కారణము లిదివఱకె వాకొని యున్నాఁడను. కావుననే మాకు విధేయుఁడై యున్న

ి విజయరామరాజునకు బొబ్బిలిరాజ్యము కొలునకొసంగెదనని
జాల వాగ్దానముఁ గావించియున్నాఁడను. ఇఁక సంధివాక్యము లిట బని
లేదు. మాయాజ్ఞప్రకారము రంగారావు బొబ్బిలికోటను విడచ్చి
పాపా— పెట్టినాలేదా!

హైద—హుజూర్ సాబ్ రంగారావు జాఫరల్లాకి స్నేహం శేసిమన్ది అధికారాన్కి మోషంశెయ్యాలా అని బడాబడా ఖుషి శేసి వుండాడు. మీకీయాద్ లేదూ!

వెంగ— దమ్మ—(స్వగతము) సంధి సర్వవిధముల భగ్నమైనది. నేనిఁక శాంతము వహించిన ఫలములేదు. ఇఁక రక్తనాళముల నుడికించుచు హృదయమున నాగక విజృంభింపనున్న నాసహజ పరాక్రమము ప్రకటింపవలయును. (ప్రకాశముగ) బుస్సిదొరా! పూర్వార్జితమైన బొబ్బిలికోటను రంగారావుగా రేలవిడచిపెట్ట
రంగా వలయును.

బూసి—ఏలయన, విజయరామరాజునకుఁ బట్టాభిషేకము చేయుటకు.

దమ్మ—ఏమీ! బొబ్బిలి రాజ్యమునకా! విజయరామరాజు నా! పట్టాభిషిక్తుని జేయుటయా! బాపురే! యేమిసాహసము. బొబ్బిలి గడ్డపై నొకపద్మనాయకవీరుఁడు కొనప్రాణముతోడ
వెం నున్నను కలనైన యీకార్యము సాధ్యముగాదని తలంచుము.

మ॥ అరిరాట్కంధర నిర్గళ ద్రుధిర ధా ♦ రాసార సంపూర్ణమై
పా ధరణీమండల మొప్పలేదు, రిపుకాం ♦ తా బాష్ప ధారావళుల్
ఝరులై పాఱఁగ లేదు, సర్వదిశలున్ ♦ సంక్షోభముం జెంద లే
దరరే బొబ్బిలి రామభూపతికి మీ ♦ రర్పింతు రేముందుగన్॥ 6

విజ—బొబ్బిలిని సాధించుటనిజముగ నీవుచెప్పినటులదుర్ఘటమె. అగుగాక. మేముమాత్రమేకదీక్షతో మీకోటవశముఁ జేసికొనక మానము.

దమ్మ—అసహనశీలా! విజయరామనరపాలా! నీయసంగతాలాప
ములు ముగింపుము. నీ బుద్ధులు నీదశకు స్థితిగతులకుఁదగినవికావు.
కాన నావిజ్ఞప్తివినుము.

చం॥ యవనపరాసు సైన్యనివ ♦ హంబులరక్తము క్షత్రసైనిక
ప్రవరుల మాంసఖండములు ♦ భండనభూమిని బాఱజల్లి భూ
తవితతిఁ దన్పనెంచితిమి ♦ ధైర్యముఁగల్గిన బంటవేని మా
యవసరమందుఁ దోడుపడు ♦ మా! సుకృతంబగు రామభూపతీ॥

విజ—ఓయీ! పొంగి పడకుము. నీగర్వోక్తులకు, బొబ్బిలి రాజ్యము
నకు, నవసానదివసములు సమీపించినవి. మావంటయింటి
కుందేలువయ్యు మీజీవితములు మాయఅచేతిలోనున్నవని
యెఱింగియు నేల యనవసర పారుష్యములకుఁ బాల్పడెదవు.
ఇది విజయరామరాజుతోఁ బ్రతిఘటించుటకాదు. దేశదేశము
లాక్రమించి యాంధ్రరాజ్యమున బావుటాయెత్తిన పరాసువా
రితోఁ బోరాటమని తెలిసి భాషింపుము. మహమ్మదీయుల
సామంతుల మైనపుడాడిన యాటలనన్నింటి నిపుడుగూడ నాడఁ
దలంచుచున్నారు కాఁబోలు. ఆయాటలు సాగుదినములుపోయి
చాలకాలమైనది.

ఉ॥ సంగరరంగభాగముల ♦ క్షత్రియసైనికులాక్రమించి, "ఓ
వెంగళరాయ నిల్వుమిట, ♦ వేంకటరంగనృపాల పోవకం
చుం గరవాలధారలను ♦ జూపెడికాలము వచ్చుచుండెఁ గ
త్తింగొని యెవ్వఁడడ్డుపడి ♦ తీరుచునో కదనంబు చూచెదన్॥ 8

దమ్మ—ఛీ! అన్యైశ్వర్యాసహిష్ణు భావా! విజయరామా! నీవు
వంచకస్వభావుఁడవు నీలంచపుఁగసవున కాసపడిన హైదరుజంగు
మాయామయుఁడు. మీమొగంబులఁజూచి మాటలాడుటకంటె
ననుచితము వేఱుండనేరదు. (బుస్సివైపునకు మరలి) దేవా!
నావిజ్ఞాపనముఁ జిత్తగింపుఁడు, బొబ్బిలికోట విజయరామరాజున
కొసంగవలయునని మీకుఁదలం పున్న యెడ విజయనగరమువారి

కిని బొబ్బిలివారికిని యుద్ధమునియమించి గెలిచినవారల కోడిన వారు రాజ్యమునొసంగునటులఁ జేయుఁడు. ఇదిధర్మమార్గము. మీరొక వేళ బలవంతముగ బొబ్బిలిరాజ్యము విజయరామ రాజున కొసంగినను బద్మనాయకవీరు లాతనికిఁదక్కనీయరు.

హైద—నీదీ మాటా బడా ఝాటాహమాటా వుంది. విజయ్యారాంసాబ్ తప్పూ శెయ్యకపోయినా లడాయి చేయించాల శెస్తాన్. నీది మాటాకానూకాదు.

బుస్సి—విజయనగరము వారికి బొబ్బిలివారికి యుద్ధములఁగల్పించి వినోదములఁ జూచుటకు మేము రాలేదు. మాకువిధేయులు గాని నృపుల వెడలఁగొట్టి దేశము స్వాధీనముఁజేసికొనుటయందు మాకు సంపూర్ణస్వతంత్రముకలదు. ముందు బొబ్బిలికోటను విడచి రంగారావును మేము చూపినస్థలమునకుఁ బొమ్మని చెప్పుము. పరులతోఁగలసి రాజద్రోహము చేయ నెంచుటయు, సామంతుఁడయ్యుఁ గప్పము నొసంగకపోవుటయుగాక దర్శనము నకు సైతము రాకుండుట, మాభటుని పరాభవించుట లోనగు దోషములు గావించిన రంగారావును క్షమింపవీలులేదు. నేను బలవంతుఁడనని రంగారావు విఱ్ఱవీగుచున్నాఁడు. ఆబల మేమో కనుగొనువఱకు కీపట్టుదల నేను వదలఁ జాలను. ఇపు డేని కోటవదలకున్నచో సంస్థానమును రూపుమాపెదము.

దమ్మ—(చెవులుమూసికొని) ఎంతటి కఠినవాక్యములు వినఁగలిగితిని. (తనలో) ఈబుస్సిదొరయు హైదరుజంగుతోఁబాటు విజయ రామరాజు వలలోఁ బడినాఁడు. వీరిరువురు బొబ్బిలిరాజ్యము విజయరామరాజునకుఁగట్టిపెట్ట సిద్ధసంకల్పులై యున్నారు. వెలమ వీరులు వీండ్రబెదరింపులకుఁ బ్రాణముబాయుటకు జంకువారు కారు. అక్కటా! భావికార్యవిధు లెటుల జరుగనున్నవియో నే నింకను శాంతము పవదలఁదగదు. (ప్రకాశముగ) దేవా! బుస్సిదొరా! తాము పక్షపాతము వహించుట యుక్తముకాదు.

మనవివినుఁడు. సర్కారునకొసంగవలసిన పన్నులన్నియు నేఁడె
యొసంగుదుము. మిమ్ముదర్శింపనిహేతువు సకారణముగ రం
గారావుగారు నివేదింపనున్నారు. మహమ్మదీయులతోఁగలసి
మేము కుట్రలుచేయుచుంటిమనునది యసత్యము. మాశ్రేయ
స్సునుజూడలేని స్వార్థపరాయణులెవరో యిటులనివేదించియుం
దురు. విజయనగర సంస్థానమువారికిని మాకును జిరకాలము
నుండి వైరముకలదు. తరతరములనుండి యది యవిచ్ఛిన్న
ముగఁ బెఱుఁగుచున్నది. మావైరికి సంస్థానముగట్టిపెట్టి మాచు
మము తొలగింపనేలయత్నింతురు! ఒక్కవేళ బొబ్బిలిరాజ్యము
బలవంతముగ మీరు విజయరామున కొసంగినను బొబ్బిలిగడ్డ
పై నొకవెలమవీరుఁడైన్ని సజీవముగనున్న నాతనికిఁదక్కఁదు.
ఇది విజయరామరాజు మరణమునకై వచ్చినదేయని యాతఁ
డును మీరు గ్రహింపకుంట చిత్రముగనున్నది.

చం॥ పరహిత పద్మనాయక నృ ♦ పాలక పౌరుషతైలధారచే
స్ఫురదురు కాంతిమంతమగు ♦ బొబ్బిలిరాజ్య సమాఖ్యదీప మ
బ్బురపడి రామరాజశల ♦ భంబు గ్రసింపఁగనూఁడెఁ దావకా
గ్రహపరిణామమే విధివి ♦ ధానముగాఁ బురికొల్పుచుండఁగన్॥ 9

ఆర్యా! మఱియొకవిజ్ఞాపనమును సావధానులై చిత్తగింపఁ గోరె
దను.

తే॥ గీ॥ వలసినంత ధనంబీయఁ ♦ గలము మమ్ము
సైపుఁ డదిగాక యున్నచోఁ ♦ జాలినంత
విత్తమిత్తుము మీరలు ♦ విజయనగర
రాజ్యమొసఁగెదరే రంగ ♦ రాయపతికి॥ 10

విజ—ఓరీ పరవంచనప్రవీణా! విజయనగరరాజ్యమున కాసపడుచుం
టివా? ఆత్మనాశనమునకు విచారము నొందుటకు మారు పర
రాజ్యమునకుఁ బ్రయత్నించుచున్నాఁడవు. ఈ యనుచితసందేశ
ముఁ దెచ్చిన నిన్నుఁజెండాడినఁగాని నాకోపము చల్లారదు.

తి ఉ॥ బంధుర భోగభాగ్య విభవప్రభవంబగు నాదురాజ్య సం
బంధముఁ గోరువంచకునిఁ బ్రాణములోఁ జననిత్తునే? భవ
జాలఁ త్కంధరనాళముల్ దునిమి ఖడ్గకుమారికి వెల్మరక్తపుల్
పాపా— గంధముఁబూసి దోర్యుగికిఁ గల్పనఁజేయుదు విక్రమాంకముల్॥

(కత్తిఁ ద్రిప్పుచుఁబైకిఁ బోవును)

దమ్మ—బొబ్బిలిరాజ్యమున కాసపడి యనుచితభాషణము లాడినపుడె వీనినిఖండింపవలసియుండ సందేశభంగమగునేమో, యని యపుడూఱకయుంటిని. ఇప్పటి కాయనుమానముఁగూడ తీఱినది.
వెంగ— కావున స్వతంత్రముగ విజయరామరాజును మందలించి నా పరాక్రమము బుస్సికి హైదరుజంగునకుఁ జూపుదునుగాక.

మ॥ అతులక్రూరశితాసిపాతమునదుష్టా! నిన్నుఖండించిమ
ద్వ్రతసంపూర్తినొనర్చి, బొబ్బిలికిఁరన్ బ్రాప్తింపఁగానున్న దు
రంగా ర్గతినిన్ బాపెద ; విక్రమాఢ్యుఁడగుశ్రీ రంగావనీభర్తకున్
గుతుకంబుల్ ఘటియించెదన్ నిలువుమా కుక్షింభరాగ్రేసరా॥

(కత్తివిసరుచుఁబైకిఁబోవును)

బుస్సి—(చూచి) ముదుసలివాఁడైనను దమ్మన్న విజయరామరాజును వెనుకంగవేయించుచున్నాఁడు. ఇప్పుడు నేనుపేక్షించితినేని
వెం విజయరామరాజు గతించుటయే నిశ్చయము. (ఇరువురకడ్డముపోయి) రాజసభలో యుద్ధములా! ఆగుఁ డాగుఁడు.

విజ—మీరు క్షణము సేపు సహించిన నీదమ్మన్నను స్వర్గమునకుఁ బంపి
పా యుందును.

దమ్మ—విజయనగరరాజ్యరమ వైధవ్య మనుభవింపకమున్నె!
విజ—నిన్నాప్రసంగమె చేయవద్దనినది. జాగరూకతతో మెలంగుము.
దమ్మ—ఛీ, పరులచాటునఁ జేరి ప్రేలుదువేల ? బయటికిరమ్ము.
హైద—మీకీ, మీకీ లడాయివద్దని మహారాజ్ సాబ్ శెప్పాడులేదూ,

మీకీ శెవికిపెట్టర్ ఎందుకు. కోడిపుంజులు వుండారు. మీకి హుజూర్ మాట లక్షెంలేదు.

దమ్మ—(తనలో) బుస్సిదొరవారు హైదరుజంగు విజయరామరాజు పక్షములోని వారని తెలినది. ఏకాకినగు నేను మిన్నకుండక చేయునదేమున్నది. (ప్రకాశముగ) ధర్మమార్గవిదా! బుస్సిదొరా! బొబ్బిలివారి ననుగ్రహింపవీలున్నచో నా ప్రార్థనఁ బరిగ్రహించి క్షేమకరమగు ప్రత్యుత్తరము దయచేయుఁడు. నేను సెలవుఁ బుచ్చుకొనెదను.

బుస్సి—మేము రెండు మాట లాడువారముకాము. విజయరామరాజునకు బొబ్బిలిరాజ్యము పట్టాభిషేకము చేయవలసినదె. రంగారావు బొబ్బిలికోట విడచి పోవలసినదె. మాదర్శనము నకురాక పన్నొసంగక రాజద్రోహమున జోక్యముఁగలిగించు కొనినందులకుఁ ప్రతికృతిఁజేసితీరుదుము. ఇఁక మార్పుజరుగదు.

హైద—మహారాజికీబాత్ భోత్ అచ్ఛావుండింది.

దమ్మ—ఆర్యా! తగినంత తప్పులేనిది పరుల వంచింపఁదగదు. మాటలతో బొబ్బిలి కోట వశముకాదు. ఏల నిష్కారణముగా నుభయ సేనాప్రళయకాలమును గల్పించెదరు. నా ప్రార్థనము నంగీకరింపుఁడు. బొబ్బిలివారిని క్షమింపుఁడు.

బుస్సి—మేము నీతో సంధివిషయమై మాటలాడము. ఆతరుణము తప్పినది. ఏదేనియుద్ధవిషయమై చెప్పవలసియున్నఁ జెప్పుము. లేదా వచ్చినత్రోవనుబొమ్ము. అనవసరప్రసంగముతో మాకుఁ బనిలేదు. మేమును బనిపాటలులేక తీఱికూర్చుండలేదు.

హైద—దమ్మాయ్యాసాబ్! మహారాజాసాబ్ అడిగేటేది ఒహాటివుంది నీవు శెప్పేది వహాటివుంది. బేపర్వాసాలించి హుజూర్కిసవాల్కి జవాబ్ బోలో!

దమ్మ—(స్వగతము) ఔరా! యీముక్కిడి తురుష్కునకు విజయరామునిపై నింతయనరాని యభిమానముకలదు. కానిమ్ము. కాలమునకు బద్ధుడనై మానావమానమును సహించితీఱవలయును. (ప్రకాశముగ) ఆర్యా! బొబ్బిలివారినిక్షమింపరా? అనుగ్రహింపరా!

బుస్సి—(కోపముతో) మరల నీప్రసంగమును దెచ్చిన నిన్ననుగ్రహింపను, క్షమింపను.

దమ్మ—(స్వగతము) ఔను! ఎటుల క్షమింతురు! పైత్యరోగికిఁ బంచదార రుచించునా! ఆంధ్రదేశీయుల స్వైరైశ్వర్యములు హరింప మఱిగిన మహానుభావులకు రాయబారములు ధర్మపరిపాలనములు రుచింపవు. వారికిఁ గావలసినది భేదనీతి యొక్కటియే. దానితోనే ఖండాంతరములనుండి వచ్చి పాదుకొనఁగలిగినది. (ప్రకాశముగా) ఓ విజయరామరాజా! నీవైన నావిజ్ఞప్తి నాలకింపుము. నీకుఁ బరాసువారి యాశ్రయ మపాయకరమైనది. మనలో మనకెన్ని యంతఃకలహములున్నను బరులకు గుట్టు తెలియనీయరాదు. నేఁడు పరాసువారి సహాయముతో నీవు బొబ్బిలిని జయింతువు. దానివలన నీబలాబలములు వారెఱింగి రేఁ పెద్దాపురమువారితోనో కలసి విజయనగరము ముట్టడింతురు. అపుడు నీగతి యేమికావలయును? చిక్కినంతవఱకు దేశము నాక్రమించుకొనుటయే గాని పరాసువా రెవరిని బాగుచేయలేదు. నిన్నును బాగుచేయరు. మహామహులగు నవాబులనే వారు ఫకీరులఁ జేసిరి. కాన పరాసువారి యాశ్రయము వదలుము. బొబ్బిలి విజయనగరములనుకూలముగనున్న సృష్టికర్తయేని మనకు వ్యతిరేకము చేయఁజాలఁడు. నీవుగోదావరి సరిహద్దుఁజేసి కటకమువఱకున్న యాంధ్రమండలమును నేకచ్ఛత్రముగఁ బాలించుచున్నాఁడవు. పరాక్రమశాలివి క్షత్రియవంశ్యుఁడవు. ఏల నీకీభావదాస్యము — చేతిమీఁదుగ నాంధ్ర

దేశమును బరులపాలు చేయకుము. నామనవివినుము. నీసోద రుఁడగు నాంధ్రుఁడు పాలించుచున్నంతవఱకు బొబ్బిలి నీవు పాలించుచున్నటులే ! ఏలమాన కీభిన్నాభిప్రాయము.

విజ—దమ్మన్నగారూ ! మీవచనములు యుక్తియుక్తములె. కాని కార్యము మిగిలినది. ఈశాంతము మీకిదివఱకె యున్న బాగుండెడిది, ఇఁక మార్పుఁజేయ వీలుకాదు. బొబ్బిలికోట వశముఁజేసికొనవలసినదె. రానున్నచిక్కుల నావల సవరించు కొనవలసినదె !

దమ్మ—(స్వగతము) దురాశాపీడితుఁడగు విజయరామరాజునకు నాప లుకులు రుచింపవు. హైదరుజంగుతో నించుక మాటలాడిచూ చెద (ప్రకాశముగ) ఓ మహమ్మదీయా ! బొబ్బిలిసంస్థానమును గరుణించుట యుక్తము. ఖండాంతరమునుండి వచ్చినను భరత ఖండమున స్థిరవాసమేర్పఱచుకొని మీరు భారతీయులైతిరి. హిందువులలోఁ గొందఱు పవిత్రమగు తమ మతధర్మమునేని పాటింపక జాత్యైక్యము ఘటించి చిరకాలమునుండి పాదుకొని యున్న యంతర్వైరములఁ బోకార్చ మీతో బాంధవ్యములు నైతముఁ జేసియున్నారు. మాకవులు మీకుఁ గృతులనొసఁగి యున్నారు. ఈపరిచయము మఱచి మమ్ము పరాసువారిచేఁ జంపింతువా! నీవాంధ్రదేశమునఁ దరతరములనుండి జీవించు చుంటివి. పరాసువారో జలగ రక్తముదొరికినంతవఱకుఁ బీల్చి మడుగులోఁ జేరినటుల భరతఖండమును నిస్సారముఁ జేయువా రెగాని బాగుచేయువారుకారు. కాన నాంధ్రదేశమునకు నాయకమణియనఁదగు బొబ్బిలిగడ్డను పరాసువారి స్వాతంత్ర్య ములోనికిం జేర్పకుము. ఈధర్మరహస్యమును గ్రహింపుము. ఇదియె నాయంత్యవిజ్ఞాపనము. పైనిమీచిత్తము.

హైద—నేనూపంశయ్యాలా ! బొబ్బిలిపైకి బుస్సీ తయ్యారుపడ్డాడు. మీకీమీకీ స్నేహం తక్వావుంది. విజయ్యరాంసాబ్ బొబ్బిలి

పైన కన్నూయేసి వుండాడు. లడాయిక్కి మేమూ తయ్యార్ వుండాము. పావురానీయి. బత్కూరానీయి. యీదభాయీలూ లేదూభాయి. మమ్మూ శమిచ్చాలా! నీదీమాటా యాదీవుంచి ముందూముందూ తెల్వీకి తెచ్చుకొంటాం. నువ్వూ అచ్చాబాత్ శెప్పావు.

దమ్మ—(తనలో) ఔరా! నే నెంతవినయము వహించుచుంటినో వీరంద అంత వ్యతిరేకము వహించుచున్నారు. భావికార్యవిధులెటులజరుగనున్నవి యొగాని వీరు బొబ్బిలికోటను ముట్టడింప సిద్ధసంకల్పులై యున్నారు. నాబోధయిందెవరికి రుచింపలేదు. ఇఁక శాంతోక్తుల నాపి యాచరణీయముం దెలిపెదను. (ప్రకాశముగ) బూసిదొరా! మీరు యుద్ధముచేసి మమ్ము గెలువవలయునని మురియుచున్నారు. కావున నావచనములించుక యాలకింపఁ గోరెదను. మిత్రభేదముఁ గల్పించి యుద్ధమునకు సన్నద్ధమొనరించినచోఁ బోరున దాంధ్రసైన్యమె! ఈనష్ట మనుభవించు నదాంధ్రదేశమెయని విజయరామరాజింతవఱకు గ్రహింపకున్నాఁడు. చంద్రవంశీయుల రక్తధారలచేఁ దండ్రికి దర్పణాదులొసంగిన యనపోతానాయకుని శరీరమున బ్రవహించిన పరాక్రమరక్తధారలు రంగరాయని హృదయమునఁ బ్రవహించుచునేయున్నవి. నేనింతవఱకుఁ బరాక్రమహీనుల రక్షింపుమని మిమ్ముయాచింపలేదు. దేశనాశనహేతుభూతమగు సంగ్రామము మాన్పుఁడని మిమ్ముఁగోరితిని. ప్రతిఘటించితిరి. ఫల మందఱనుభవింపవలసినదె. కాన మా వేంకటరంగారాయ నృపాలశిఖామణి యుద్ధమునకె యియ్యకొన్న మీకుందెలుపుమనిన సందేశము విని మామనోనిశ్చయము లాలకించి బొబ్బిలిరాజ్యమునకు బయలుదేరిరండు.

సీ॥ ఇటుసూర్యుఁడటు లుద ♦ యించిన బొబ్బిలి
విజయరామునకు న ♦ ర్పింపఁబోము

వెలమవీరులు ప్రాణ ♦ ములతోడ నున్నంత
దనుక రాజ్యంబుసా ♦ ధ్యంబుగాదు
పద్మనాయకులపైఁ ♦ బగగాల్చి బ్రదికిన
ఘనుఁడు మందునకేని ♦ గానరాఁడు
ఫ్రాంసువారలకైనఁ ♦ బరదేవతకునైన
దెలుఁగుపోజులు వెను ♦ దీయఁబోవు

తే॥ గీ॥ బుస్సియును హైదరేకాదు ♦ మూఁడునూర్ల
మందిబుస్సులు హైదరుల్ ♦ మార్కొనినను
ఆంధ్రవీరులు చలనంబు ♦ నందఁబోరు
కదలిరమ్మను మరులను ♦ గదనమునకు॥ 13

బుస్సి—మీమనోనిశ్చయముకూడ మాతలంపుల కనుకూలముగ నున్నది.

దమ్మ—ఇంకను మీరు దుర్మతమును విడువకున్నారు. గీతలలోఁ గృష్ణభగవానుఁడు ధర్మమున్నచోట జయముండునని చెప్పినాఁడు. మీవిక్రమమంతయు నధర్మగర్భితము. మీయధర్మసంరంభమే మీకపజయము నాపాదింప నున్నది. పద్మనాయకవీరుల పరాక్రమము విజయరామరాజునకుం దెలిసినట్టుల మీకుం దెలిసియుండదు. ఎఱింగియున్న నిటుల సంగరాభిముఖులు కారు. ఈవాక్య మవగతముఁజేసికొండు.

సీ॥ వెలమవీరులు రణ ♦ స్థలినిల్చి నిశితాస్త్ర
ములచేత మిమ్ముఁ గ ♦ ప్పుటకుమున్న
అరులొక్కమొగి పయి ♦ కుఱికిమీసేనల
నన్నింటినురుముసే ♦ యకయమున్న
దమ్మన చేయుబో ♦ ధలఁ జెవిజొచ్చనీ
యక పోతినంచు నెం ♦ చకయమున్న
విజయరాముని మాట ♦ విని దుర్దశాప్తిచే
స్రుగ్గితిమని తలం ♦ చుటకుమున్న

తే॥ గీ॥ మీదుమిక్కృత్యములె మీకు ♦ మేదురముగ
స్వబలనాశనమును బొన ♦ ర్పకయమున్న
తెలివిమై యనిపై నాశ ♦ తొలఁగుమయ్య
పరవచోలోల ♦ ఓ బుస్సిధరణిపాల॥ 14

బుస్సి—నీప్రసంగములతో మాకవసరములేదు. త్వరలో మిమ్ము గెలువ వచ్చుచున్నారము.

దమ్మ—అకటా! అశేషదుర్జన సమావృతంబగు నీధరాచక్రంబున ధర్మమను సూక్ష్మవస్తువు నిలువ నెలవులేకపోయెనుగదా! సంపెంగపూవును జూచిన తుమ్మెదవలె లంచగొండినిఁగాంచిన ధర్మదేవత ఛాఁటుమాటులఁ బడితీయును. ఇఁక బుస్సికి మనస్సు తిరుగదు. పద్మనాయకులు జీవితసర్వస్వము గతించినను విరోధుల మన్నింపరు. ఈకారణమున బొబ్బిలిరాజ్యము నిరంకుశ నిర్మల యశస్సుధాకిరణునిచే భరతఖండమును కలధౌతసన్నిభ చంద్రికాసాంద్రంబుఁ జేయనున్నది. ఇంతియె చాలును.

మ॥ పరబోధారతులెల్ల ఱేండ్రయిరి, పా ♦ పవ్యాపకుల్ మంత్రులై
రి రసాభాస దురుద్యమావృతులు శా ♦ స్త్రీయార్థ నిర్ణేతలై
రి రణప్రాభవశూన్య దుర్మదులు దో ♦ ర్వీర్యాఢ్యులై రీనిరం
తర భారంబెటులన్ భరించెదవొ మా ♦ తా! ఆంధ్రసామ్రాజ్యమా॥

విజ—ఓరీ! దమ్మన్నా! నీప్రగల్భములఁ జాలించి నావిక్రమసూక్తుల నాలకింపుము. వెలమవీరులకుఁ బ్రపంచమంతయు వెఱచుదినములు గతించి చాలకాలమైనది. ఎపుడాంధ్రదేశము పరాసువారి హస్తగతమయ్యెనో నాఁటనుండియే మీతేజ మంతరించినది. మీవిజృంభణములు శాంతించినవి. ఇఁక మీవిక్రమములు సాగిరానేరవని గట్టిగ నమ్ముము.

చం॥ అరులకు వెన్నుఁజూపని ని ♦ రంతర విక్రమ భాసమానులౌ
తురకలు, గర్వసంభరిత ♦ దుస్తర వైరివిదారణక్రియా

పరులగు ఫ్రాంసుసైనికులు, ♦ పౌరుషరూపులు రాచబంటులున్
బోరఁగొనననున్నవా రెటుల ♦ బొబ్బిలికోటను గాచికొందురో॥ 16

దామె—ఈవిజయరామరాజు వాక్యంబులన్నియుఁ ద్రాఁగుబోతువాని భాషణములవలెఁ దిరస్కరించుచున్నాఁడ. ఈతని వాక్యము లాలకించఁ దగినవి గోడలె. ఓబుస్సీనరపాలా! సంధి కరుదెంచిన నన్ను దిరస్కరించుచున్నారు. పిమ్మటఁ బశ్చాత్తాపము నొంది ఫలములేదు. ఇపుడె మీహృదయముల నాలోచనము నకుఁ బ్రేరేపుట యుక్తధర్మము. నేను సాత్వికముపయోగించితి ననియు బొబ్బిలివెలమవీరు లందఱిట్టివారేమోయని భ్రమించుచున్నారేమొ! ఆవ్యర్థభ్రాంతియే మీకంత్యకాలముఁ గల్పించిడీఱును. మీకును మాకును జాతిమతభేదములుకలవు. మాదురదృష్టవశమున మాతృదేశమునకు మీరధిపతులుఁటి. కానసే మా కష్టసుఖముల యోజింపరైతిరి. పరరాజన్య శిక్షాచరణంబునకు మేము గలనైన జంకముగాని దేశీయవధయనిన మాహృదయములు కంపించును. ఖడ్గములు చంచలించును. ఏల మీరీపాపకార్యమున బాలుఁ బంచుకొందురు. ఏకామిష వాంఛచే నేల బొబ్బిలిని విజయనగరమును నంతమొందించెదరు?

సీ॥ బేతాళుపైకి ద ♦ ర్పించిదూఁకిన చెవ్వి
రెడ్డి విక్రమ మంత ♦ రించలేదు
వైరికిఁ బ్రాణముల్ ♦ పణముఁజేసిన బ్రహ్మ
నేని శౌర్యంబు క్షీ ♦ ణించలేదు
రాజరక్తమునఁ ద ♦ ర్పణము సల్పిన యన
పోతభూపు ప్రశస్తి ♦ పోవలేదు
తురకభూపతుల నె ♦ త్తుట క్రీడసల్పిన
మాదనాయకు శక్తి ♦ మ్రగ్గలేదు

తే॥ గీ॥ పద్మనాయక నరపాల ♦ భావవీధి
పూర్వవిఖ్యాతి వాసనల్ ♦ పోవలేదు

వెలమవీరులముందు మీ ♦ బలము లెంత
చావు కొని తెచ్చికొనకుఁడో ♦ శత్రులార॥ 17

హైద—నీకీ మాకీ షంబంధంలేదు. హుజూర్ నీదీమాటా యినుటాన్కి ఖుషి లేకుండా వుండాడు. నీదిమాట పాలించి నీదీదోవ నీవు శూస్కో. జావ్ జావ్.

విజ—దమ్మన్నా ? పాపము పెద్దవాఁడవు. ఉపన్యసించి ఉపన్యసించి యలసితివి. ఇఁక నీవృథా కంఠశోష ముగించి యలసటఁ దీర్చికొని త్రోవఁబట్టుము.

దమ్మ—ఏమీ! పరిహాసము లాడుచున్నాఁడవా ! నీవు మాకు అతిథి వైనవుడు సగౌరవముగ స్వస్థానమునకుఁ బ్రయాణముచేయింతును.

మ॥ లలితప్రాభవ భాసమానులు గుణా ♦ లంకారులౌ వెల్మవీ
రులు నీరాకకు స్వాగతంబొసఁగి కో ♦ ర్కుల్ దీర్చు మన్నింత్రు బొ
బ్బిలికిన్ రమ్మ నృపాల.

ఓ హైదర్ జంగుమంత్రీ! బుస్సీదొరా! మిమ్ములఁ బిలువ లేదనుకొనకుఁడు.

మీ రిరువురున్ ♦ వేవేగనే తెండు ని
శ్చలదోర్వీర్యులు పద్మనాయకులు కాం ♦ క్షల్ గూర్తురి యుద్ధంబునన్.

విజ—ఇఁక నీచాతుర్యోక్తులఁ గట్టిపెట్టుము. ముందు బొబ్బిలి రాజ్యము వినాశనము గాకుండఁ బద్మనాయక సైన్యము రూపుమాయకుండఁ గాపాడుకొమ్ము.

దమ్మ—కుబుసము విడచిన గోడెత్రాఁచుబాముతో నాటలాడునటుల నాముందు దురహంకారోక్తుల బయటపెట్టుచున్నాఁడవా! సందేశము భంగమగునేమో యని నిన్నింతవఱకు క్షమించితినిగాని శక్తిహీనుఁడనై యూఱకుండ లేదు. క్షత్రియరక్తమును మా వెలమకత్తులు పానముజేసి చాలకాలమైనది. నాఁడు దనపోతనాయకుడు తనతండ్రికిఁ దర్పణాదులనొసంగుట కినుగుర్తిదుర్గసమీపమున నూటొక్క క్షత్రియుల కంఠనాళములఁ ద్రెంచి భూత

దృష్టిఁగావించెను. నేఁడు మరల రాజ్యలక్ష్మికిఁ దర్పణాదులొసంగుటకు వేంకటరంగారాయఁ డావ్రతమును బురశ్చరణ గావింప నున్నాఁడు. భారతీయులరక్తముతో భగతమాత నెటులఁ బూజింపవలయునో తోఁచక నవనాగరకులు నిన్న రణరంగమునఁ బరిత్యజించినను బూర్వాచారపరాయణులమగు మే మా వీర వ్రతము నియమబద్ధముగ నొనరించి భూతప్రేతపిశాచాదులఁ దనుపఁగలము.

మ॥ పరబాధా చరణాను భావులగు నీ ♦ పాశ్చాత్యులన్ గూడి, దు
ర్భర సంగ్రామ నిబద్ధమానసుఁడవై ♦ రాకుండ నీ శీర్షమి
త్తఱిఁ జెండాడి మదీయ మాతృధరణీ ♦ దైన్యంబు వారింతు ని
ల్వర శ్రీతాంధ్ర కులాబ్ధిచంద్రుఁడగు బా ♦ పారాయఁ డొనొనర్
(విజయరామరాజును గత్తితోఁబొడిచి బుస్సి హైదరుజంగులఁ గాంచి) ఓ అరాతులార!

ఉ॥ పోరగ శక్తియున్నయెడ ♦ బొబ్బిలికోటకురండు, రిత్తగా
బీరపుమాటలాడినను ♦ ప్రేలిన లాభము లేదు, విక్రమా
కారులు పద్మనాయకులు ♦ గత్తులనూరుచున్నవారు దు
ర్వారి చమూసమూహమును ♦ స్వాగతమిచ్చి బహూకరింపఁగన్॥

దమ్మ—(తనలో) ఇప్పటికి వచ్చినపనితీఱినది. సంధి సర్వవిధముల భంగమైనది. యుద్ధమె నిశ్చయమని తెలినది. ప్రాణములతో బొబ్బిలికోటకుఁ జేరి యిచ్చటి విపరీతపరిణామములన్నియు నట నెఱింగించువఱకు నేనీ విరోధిబృందమునకుఁ జిక్కకుండ జాగరూకత వహింపవలయును. కావున నే నిట నిలుచుటయుక్తము కాదు. (పోఁబోవును)

హైద—అరే! కిదర్ హైరే, లాడూఖాన్, జానూఖాన్, సిద్దిబిలాల్, మాహమ్మద్ హుసేన్, దమ్మన్న సాబ్ పోతూవుంది. పటో్కా పటో్కా. బేగీ. బేగీ.

దమ్మ—ఈశూరంమన్యుఁడు నన్నెదిరింపఁజాలక సేనానాయకులఁబిల్చు చున్నాఁడు. వాండ్రు నన్నెంతవఱకు వెంబడింతురో యెటులఁ బ్రతిఘటింతురో చూచెద.

(దాఁమెర దమ్మన్న నిష్క్రమించును)

విజ—(కత్తిఁదీసికొని) ఏఁడీ. దమ్మన్న. యెటుపోయినాఁడు. కాన రాఁడేమి?

శా॥ గర్వాతీతవిరోధిభూరమణహృ ♦ త్కాలామిషాస్వాదనా
ఖర్వప్రాభవ భాసమానమగు మత్ ♦ ఖడ్గంబుచేఁ జెండి, నా
దుర్వారోగ్ర పరాక్రమానలమునం ♦ దున్ నిన్ను వ్రేల్తున్ శ్రవః
పర్వంబున్ బొనరింతు మామకయశః ♦ ప్రఖ్యాతి దమ్మాహ్వయా॥

(లేవఁబోవును)

(దిక్కులఁజూచి) ఎచ్చటకుం బాఱిపోయె! కానరాఁడేమి! దమ్మన్నా! దమ్మన్నా! ఈవ్రేటునుగాచుకొమ్ము. నీశిరమీవ్రేటుతోఁ బడిలేఱును.

హైద—దమ్మన్నాసాబ్ బొబ్బిలికిపోయిందీ! ఇంకా ఆయనపైనా నీకి కోపంయెందుక్కు. ఆయన వస్తాదువుండాడు. కోపం మస్నీవుండాడు.

బుస్సి—దాఁటిపోయినవానింగూర్చి పరోక్షమున భాషించుట యుక్తము కాదు. విజయరామరాజా! నీకేమి గాయములు తగులలేదుగద! బొబ్బిలివారు ద్రోహులవలె నున్నారు.

విజ—మీయనుగ్రహమువలన నాకుఁ గాయము తగులలేదు. కాని కొద్దిగఁ గత్తి గీచుకొనిపోయినది. బొబ్బిలివారు తమప్రాణములనేని లక్ష్యపెట్టరనియు నెంతవారలనేని దిరస్కరింతురనియు ఁదమ కిప్పటికి బోధపడియుండును. కేవలము బరాక్రమమును విశ్వసింపక ప్రాణాపాయమునకు వెఱవక యుక్తాయుక్త

విషయములలో సైతము స్వబుద్ధి వినియోగింపక విజృంభించు నీపద్మనాయకు లవశ్యము శిక్షార్హులు.

హైద—బొబ్బిలివాండ్లకి మంచీసాహసం వుంది. వాండ్ల ప్యాణం తీపి లేదు. దమ్మన్నసాబ్! ముసిలివాడు అయ్యిగూడ బంతీఆడినట్లు ఆడాడు. అచ్ఛా.

బుస్సి—విజయరామరాజా! ప్రాణములకేని తెగించివచ్చిన దమ్మన్నతో నీవు వాగ్వాదములుగావించుట గొప్పదోషము. ఇంక నతఁ డనుభవజ్ఞానముఁగల యోగ్యుఁడుగాన నూఱకుండెను. లేకున్న నెంతటి సాహసకార్యమునకేని జొచ్చియుండును.

హైద—హుజూర్‌సాబ్! నీదిబాత్ సచ్‌వుంది. అచ్ఛామాట శెప్పావు.

విజ—ఏమో మిగిలినదానింగూర్చి ప్రసంగించిన లాభములేదు. ఇఁక ముందేని బొబ్బిలివారిని నిర్బంధింప మనమందఱము సిద్ధపడ వలయును. ఓ బుస్సిప్రభూత్తమా! బొబ్బిలివారి యహంకార మును త్తగించితిరికదా! ఎనఁడో యనపోతానాయకుఁ డఁట. క్షత్రియవంశము నిర్మూలముఁగావించెనఁట. ఇటులెమనల నిర్మూలింతురఁట. ఈముచ్చటలతోనే మనముపద్మనాయకుల యందు నేఁటికాలమునఁగూడ ననపోతనాయకునినాఁటి ప్రతిభ కలదని భ్రాంతిపడుదుమా? ముందు పద్మనాయకవీరుల బంధీకృతులఁ గావింపవలసినదే? తద్రాజ్యము వశముగావించుకొన వలసినదే. బొబ్బిలివీరులు యుద్ధమునకు సన్నద్ధులు కాకముంచె మనము హఠాత్తుగ ముట్టడించినచో నిరంకుశముగ రక్తపాతి ములేకుండ జయింపఁగలము. ఇంతియగాక

సీ॥ రావు వేంకటరంగ ♦ రాయుని, మామక
సేనావిధేయునిఁ ♦ జేయవలయు
బొబ్బిలి సంస్థాన ♦ మును, బద్మనాయక
పాలనమున కేడఁ ♦ బాపవలయు

తాండ్రపాపారాయు ♦ దర్పంబు క్షత్రియ
వీరవశంబుఁ గా ♦ వింపవలయు
వెంగళరాయు దో ♦ ర్వీర్యంబు శాత్రవ
సైనికబద్ధంబు ♦ సలుపవలయు
తే॥ గీ॥ విజయరామావనీశ్వర ♦ నిజభుజాప్ర
సంగమును లోకమందెల్ల ♦ సాఁటవలయు
బుస్సినరపాల! దుర్వైరి ♦ పుంజహరణ
సాధనమునకు యత్నంబు ♦ సలుపుమయ్య॥ 22

బుస్సి—బొబ్బిలివారిని మన్నింపము. నాదర్శనమునకు రాకపోవుటయె గాక సంధిపేరుఁబెట్టి దమ్మన్నను ద్రోహకార్యమునకుఁ బ్రేరేపిన రంగారావు దండనార్హుఁడే. బొబ్బిలిరాజ్యము వెలమవారి యాజమాన్యమునుండి తొలంగించినగాని నాయాగ్రహము చల్లారదు. హైదర్‌జంగుసాహెబ్! మనము బొబ్బిలికోటను శీఘ్రముగా ముట్టడింపవలయును. రంగారాయని వశపఱచుకొనవలయును. నీయభిప్రాయమెద్ది?

హైద—వాండ్లకి మనం సిచ్చ శెయ్యకపోతే మనకీవాండ్లుప్యాణం తీస్తారు. లడాయ్కి పోవడం నాకి భోత్ ఖుషివుంది. (చూచి) ఎవరో వస్తావుంది.

విజ—లాడుఖానువలె నున్నాఁడు (చూచి) అగునాతఁడే.

లాడూ—(ప్రవేశము) ఆదాబ్ సర్కార్.

హైద—ఏమిా! నీకిద్రేహం నెత్తుర్ అయిందివుంది. నీకీ దెబ్బతగిలిందీ లేదూ.

లాడూ—మహరాజ్ శెస్తాక్ దమ్మన్న గుఱ్ఱంకి యెక్కి బొబ్బిల్కి దోవాపట్టి శుక్కాపొయ్యేటట్టు పోతావుండాడు. ఆయన్కి పట్టుకోవాలాఅని హాసనల్లీ, సిద్దీబిలాల్, జానూఖాక్ నేను పోయి పట్టుకుంటే అందర్కి నెట్టి గడబిడాశేసి నాకీకొట్టి

హొయ్యాడు. నేను దమ్మన్నకీ కసరత్ మీాదకత్తితో కొట్టానుజీ!

విజ——తక్కినవారల కాదమ్మన్నవలన నెట్టిగాయములు కలుగలేదుకద!

లాడూ——వాండ్లకు తోడా తోడా తగిలింది మహారాజ్. నాకీ బాగా తగిలింది. దేఖో (గాయములు చూపును)

బుస్సి——మీారలందఱు గాయములకు మందు లుపయోగించుకొని సేనలకు శిక్షలొసఁగుచుండవలయును. కొలఁదిదినములలో బొబ్బిలి కోటపైకి దాడి వెడలవలయును.

లాడూ——అచ్ఛా ఆదాబ్ మహారాజ్. (నిష్క్రమింతురు.)

హైద——బొబ్బిలి అద్మీలు షాలా షాహాసంవాంళ్ళు వుండారు. హుజూర్కి మాట అంటే వాంళ్ళకీ తిరష్కారంవుంది. విజయరాం సాబ్ కి సంపాలాఅని వాంళ్ళకి వుంది. మనము ఊర్కావుంటే సంపీయేసీ తీర్తారు. మనము బొబ్బిలికీ పొడూ శెయ్యాలా! తీరలా!

విజ——దేవా! నావిజ్ఞాపనము నవధారుఁడు.

ఉ॥ పోటుఁదనంపుబీర ముడి ♦ వోనికడిందిని బొబ్బిలీశ్, నిరా
ఘాట పరాక్రమక్రమము ♦ గస్పఁడ బాడొనరించి, విక్రమా
ర్భాటముఁజూపి మూర్ఖులగు ♦ రావుకులీనుల దాస్యకర్మకి
చ్ఛోటికిఁ బట్టి తేవలయుఁ ♦ జూచి సహింపఁగరాదు మాద్దురా॥

బుస్సి——విజయరామరాజా! నీవు కోరినదొక దుస్తరకార్యము కాదు. బొబ్బిలివారి సోధించుట మీాకంటె మాకవశ్య విధాయకము. మేము వీరిని సహించినచో నితరరాజులు కప్పము లొసంగుదురా! దర్శనమునకువత్తురా! ఈవిషయమై సందేహాము పెట్టుకొన నవసరములేదు. ఒక్కఫిరంగిదెబ్బతో బొబ్బిలికోటకూలఁగలదు! హైదర్ జంగ్! సేనలు యుద్ధమునకు సిద్ధముగనున్నవా!

హైద——మనదీ షేనా అంతయెక్వాలేదు. నాలుగుయేలషైన్నెం ఐదువందల్కి పరాష్దోర్లువుండ్లారు. బొబ్బిలిపైకి పోవడానికి యీా షైన్నంసాల్దు. సాల్దు.

విజ——అటులైన నావెంటవచ్చిన పదివేలసైన్యమును గూడ మీాకు

సహాయమునకొసంగి నేనును యుద్ధమునకు వచ్చెదను. అవసర మైనచో విజయనగరమునుండి యింకఁ బదివేలసైన్యమును దెప్పించెదను. మనకు సేనకేమికొఅవు.

బుస్సి—ఇఁక నాలసింప నక్కఅలేదు. సేనల విభాగముఁజేసి వాండ్రకుఁ బ్రయాణముఁ జెప్పవలయును. విజయరామరాజా! నీకా బొబ్బిలి కోట కెన్నియగడలున్నది, ఎన్నిబురుజులున్నది, సైన్య మెచట యుండునది తెలియునా?

విజ—నాయొద్ద బొబ్బిలిరాజ్య స్వరూపపటము కలదు. దానిని బరిశీలించిన నన్నివిషయములు బోధకాఁగలవు. బొబ్బిలికోట యొక్క బాగోగులు రహస్యవృత్తాంతములు తెలిసిన సైనికులు సైతము నాయొద్దకలరు. అడవులలోనుండి యొరుల కంటఁబడకుండ బొబ్బిలికిఁ ద్రోవఁదీయఁగల సూర్యనారాయణరాజను నొకక్షత్రియుఁడు నా సంస్థానమునందున్నాఁడు.

బుస్సి—నీవీవిషయమునఁ దగినప్రయత్నములో నున్నాఁడవుకావున నిది యొక దుస్తరకార్యముకాదు. నీయాంధ్ర సైన్యమునకు నీవధిపతిగ నుండుము. నలుగురు పరాసుసర్వసేనానాయకులను కొన్ని యాయుధములను నీకు సహాయమొసంగుదును.

హైద—ఆలస్యం. అమృతంకేవిషంఅని తెలింగే శాస్త్రంవుంది. పోదాంరాండి బొబ్బిలికోటకి చూర్ణంకీ చూర్ణంశెయ్యాలా.

విజ—మీరు తలంచిన బొబ్బిలికోట సాధించుట యొకలెక్కా.

బుస్సి—రండు పోవుదము. ముందు సైన్యమును జూడవలయును.

నిష్క్రమింతురు

ద్వితీయాంకము

సంపూర్ణము.



శ్రీ ర స్తు.

# పా పా రా య ని ర్యా ణ ము.



## తృతీయాంకము.

(రంగారావు, వెంగళరాయఁడు, కాకర్లపూడి వెంకటరాయఁడు, ఇనుగంటి ధర్మారాయఁడు, చెలికాని వెంకయ్య, తాండ్ర పాపారాయఁడు ప్రవేశింతురు.)

రంగా—మిత్రులారా! దమ్మన్నగారింక సంధికార్యము నిర్వహించి రాకుంటకేద్ది కారణము? మనప్రత్యర్థులేమేని దురంతమునకుఁ బాల్పఁడియుండరుకదా! ఆయనవలనఁ బర్యవసానము తెలియువఱకు మిన్నకుండవలసినదె!

శా॥ అన్యోన్యంబుగనున్న యాంధ్రనృపులం ♦ దంతర్విరోధక్రుధా
విన్యాసంబుజనింపఁజేసి భరతో ♦ ర్వీక్షాసంగ్రహింపంగ దా
ర్జన్యంబుఁ బొనరించుచుండిరి విదే ♦ శక్ష్మావిభుల్ - రామరా
జన్యుండే విషయంబెఱుంగఁడె యప ♦ స్మారుండో యున్మత్తుఁడో॥

వెంగ—సంధి సంగ్రామముగా మాఱెనేమో!

చెలి—మాఱినను మాఱియుండవచ్చును. ప్రత్యర్థులేమేని రంగారాయప్రభునివిషయమైగాని బొబ్బిలివిషయమైగాని యనుచితప్రసంగమొనర్చిరేని దమ్మన్నగారిశాంతకవచము పగిలిపోవును. అప్పుడు దమ్మన్నగారు తెనుదీయరని నావిశ్వాసము.

ఇను—ఒకదమ్మన్నగారేకాదు. ఇంగితవేదియగు నేపద్మనాయకుఁడైన మనల దూషించినవాని నెట్టివిపరీతావస్థలోనేని మన్నింపఁడు. మాతృదేశద్రోహము నాచరించుఁ బాపాత్ములను సహించుటకు పద్మనాయకులు సమర్థులా?

కాక—ఇదిగో? దమ్మన్నగారు వచ్చుచునేయున్నారు. (తేఱిచూచి)

చం॥ కనులను గెంపుచెన్నలరఁ ♦ గాయమునిండను నెత్రుచాఱికల్
కనఁబడ, నెమ్మొగంబుపయి ♦ గ్రౌర్యము శాంతము కందళింపఁగాఁ
దనగతిఁ దానెఱుంగని వి ♦ తంబున దమ్మనగారు శూన్యచే
తనులయి యేగుదెంచెడి క ♦ తంబును నారయుమయ్య నెయ్యమా॥

ఆను—(చెలికాని వెంకయ్యతో) మిత్రమా? కార్యము మిలిగినటులున్నదె. లేకున్న దమ్మన్నగారింత యుద్రేకముతో నైమఱచి యేతెంతురా?

చెలి—నాకునటులనే తోఁచుచున్నది.

(నెత్తురుగుడ్డలతో దమ్మన్న గారు ప్రవేశింతురు)

పాపా—ఔరా! దమ్మన్నగారూ! ఏమీ యీ ప్రళయము. ఏమి యీ విపరీతము. నీమేన నెత్తురుచాఱిక లగుపడుచున్నవే! ఇది విరోధులకృత్యమేనా?

శా॥ ఔరా! వైరినృపాలులార! మిము దా ♦ త్యార్థంబు ప్రశ్నింపగాఁ
జేరన్ వచ్చిన వీరవర్యు నిశితా ♦ సిన్ నొచ్చ జేయంగ నా
నే! రాజన్యులుకారె! ధర్మము విడన్ ♦ శ్రేయంబె? గర్వంబు చే
కూరన్ జేయునె సద్యశశ్చటలు మీ ♦ కున్ గష్టముట్టింపచుల్॥ 3

రంగా—దామెర వంశ భూషణా! ఎట్టి దురవస్థకుఁ బాల్పడితివి.

ఉ॥ వైరముమాన్పి సంధి సలు ♦ పంగలవాఁడనటంచు నేగి యీ
తీరున నొచ్చినావె? దుర ♦ దృష్టవశంబున వైరిరాజచే
కూరిమికాఁడ; నిన్నుగను ♦ గొన్న, హృదంతరజన్యవిక్రమ
స్ఫారతరాగ్నిహోత్రము ప్ర ♦ శాంతి వహింపక ప్రజ్వలించెడిన్॥

దామె—రాజా! ఇది దురదృష్టమని యానతీయకుఁడు. నాయవస్థకు మీరుకారకులుకారు. నేను నిశ్చయముగ శిక్షార్హుఁడనే. ఎటులనఁ జిత్తగింపుఁడు.

శా॥ సంధింగూర్పఁగ జాలనైతినని నీ ♦ చంబైన దేహంపు సం
బంధంబున్ విడనాడనోడితి, న ♦ నల్పప్రాభవోపేత గ

ర్వాంధీభూతమనస్కులీ పురముపైఁ ♦ బ్రజ్ఞాబలాహంక్రియా
స్కంధావారము నిల్పనుండి రెటులీ ♦ కాలుష్య మీక్షించెదర్ ॥5

పాపా—ఏమీ! సంధిప్రయత్నములు వ్యర్థమయ్యెఁగా. ఔను బుస్సి హైదరుజంగులు సంధికియ్యకొందురా? ఇయ్యకొనిన విజయ రామ రాజూఅకొననిచ్చునా? విజయరామ భూపాలున కంత్య కాలమునకె యీదుర్బుద్ధులుఁపుట్టుచున్నవి. ఓవిజయరామా?

చం॥ మొఱకుతనంబు పెంపెసఁగ ♦ బొబ్బిలికోటను ముట్టడింపఁగాఁ
దరియఁగవత్తువేని, నిను ♦ దారుణహేతిని గూల్పకున్న నా
కరముకరంబె? నీయురము ♦ గాఢహతిన్ విదళింపకున్న నా
శరము శరంబె? నీ బెనఁగి ♦ చంపకయుండిన వెల్మబిడ్డనే॥ 6

వెంగ—పరాక్రమములు పరామర్శములు తరువాతఁ జూచుకొందము.
మీ సంధినియమములు ప్రతిపక్షుల కెటు లెఱింగించితిరి. వారేమని ప్రత్యుత్తర మొసంగిరి.

చెలి—మిత్రమా! ఆమూలాగ్ర మెఱుఁగింపుము.

దమ్మ—ఎఱింగింపక చేయునదేమున్నది. నేను సంధినియమముల నెఱింగింప రాజమహేంద్రవరమునకుఁ జనకముస్నె మీకడ శిక్షితుఁడైన పరిచారకుఁడు హైదరుజంగునకు బుస్సిదొరవారికి లేనిపోనివి నివేదింప వారు కోపఘూర్ణితమానసులై యుండిరి. విజయరామరాజుసందర్భములోఁ గొన్ని యీర్ష్యాజనకవాక్య ముల బోధించెను. ఇంతలో నేను సందేశమును దీసికొని వారి చెంతకుఁ జేరితిని.

ఇను—మీరు రాయబార మొనర్చునపుడు బుస్సిదొరవా రొక్కరె యున్న కార్యము శతవిధముల ఫలించెడిది. ఆయన చాలయో గ్యుఁడు. పిమ్మట యేమిజరిగినది.

దమ్మ—(రంగారాయునిదిక్కై) తామును వెంగళరాయుఁడును బాపా రాయుఁడును పచించిన వాక్కులలోని యర్థము బుస్సి, హైదరు

జంగు, విజయరామరాజుల కెఱింగించితిని. హైదరుజంగు, బుస్సీకి వంచనోక్తుల బోధింపసాహసించెను. అపుడు బుస్సీదొరవారు కనులెఱ్ఱఁజేసి రంగారాయఁడు విరసుఁడనియు, మమ్ము నలక్ష్యమొనరించెననియుఁ బ్రేలుచు బొబ్బిలిరాజ్యము విజయరామరాజున కొసంగెదను. మీరాజు బొబ్బిలిగోటను విడచిపెట్టెడినా? యనియడిగెను.

రంగా—తరువాత నేమిజరిగినది.

కాక—ఏమీ బొబ్బిలిరాజ్యము విజయరామరాజున కొసంగునా? ఒసంగువాఁడు బుస్సియా? అనుభవించువాఁడు విజయరామరాజా? ఎంతవింత! ఏమియాగడము.

చం॥ గుదులుగ వైరిభూపతుల ♦ కుత్తుకలఁబఱరాల్చి పౌరుషా
స్పదులయి వెల్మవీరులు, ప్ర ♦ శస్తతరంబుగ యుద్ధపద్ధతుల్
ప్రిదులఁగఁ జేయువేళఁ గను ♦ పించును మీబల విక్రమాది సం
పద లిపుడేల వ్యర్థపువి ♦ వాదములో పరిపంధిభూపతుల్॥

పెమ్మ—బుస్సీదొరవారు బొబ్బిలికోట విడువుమనుట కేను సహింపక యుద్రేకముచే నొడలుమఱచి విజయరామరాజు వికటభ్రుకుటీకరాళుఁడై నన్నుఁదిలకించుచుండ హైదరుజంగు కనులనిప్పులొలయ నామొగము పైఁగ్రూర నిరీక్షణంబులఁ బ్రసరింపుచుండ బుస్సీనిజూచి వలసినంతపన్నొసంగెదము గాని బొబ్బిలి కోటను విడువమనియుఁ గోరినంతరొక్కము మీకొసంగినచో విజయనగరరాజ్యము మాకొసంగెదరా యనియు వాకొంటిని.

రంగా— మిత్రమా! నీవాక్యము లాదరణీయములు. తరువాత తరువాత.

కాక—మీవాక్యములు విజయరామరాజునకు వాగ్బంధన మొనరించి యుండును. దీనికి బుస్సీదొరవా రేమిప్రత్యుత్తర మొసంగిరో వినఁగోరెద.

దమ్మ—బుస్సిదొరవారు నామాట పాటిసేయక రంగారావు బొబ్బిలి కోట విడచిపెట్టి పోవలసినదె! విజయరామరాజునకు బొబ్బిలి రాజ్యము కొలునకొసంగవలసినదె యనివాకొనసాగెను. విజయ నగరరాజ్యమును గోరెదవాయని విజయరామరాజు పండ్లుఁ బటపటఁగొఱుకుచుఁ బైకిఁ గత్తిఁగొనిదూఁకె.

చెలి—ఓరీ! విజయరామరాజా! పరులరాజ్యముపై నీకెంతయాసగల దో నీరాజ్యముపైఁగూడఁ బరుల కంతయాస కలదనుకొనుము. నేఁటి బుస్సి ప్రాపకము జీవితాంతమువఱకు స్థిరమైనది కాదు. తరువాత నీకు రక్షకుఁడెవఁడు.

ఉ॥ బొబ్బిలిరాజ్యమేలుదని ♦ పొంగుచుఁ బొర్లుచునుంటి వద్దినీ
యబ్బ గడించినట్టిధన ♦ మా!యొకఁడిచ్చెడియాతఁడా ? ఒకం
డబ్బెనటంచు బావుకొన ♦ నర్హుఁడ చాలును రామరాజ త
బ్బిబ్బులు, విక్రమించి గరు ♦ వించి స్వరాజ్యముఁ గోలుపోకుమా॥

తాండ్ర—ఆపిమ్మట నెటులఁబరిణమించెను ?

దమ్మ—విజయరాముని యకృత్యములు చూడ నాకును సాహసమతి శయించి సంధి సర్వవిధముల విఫలమయ్యెనని నిర్ధారణముఁ గావించి కొని కరవాలముతో విజయరామరాజును బ్రహారముఁ గావించి గృహాభిముఖుడనై వచ్చుచుండ నన్నుఁ దురుష్కులు చుట్టుముట్టి గాయములుజేసిరి. ఎటులేని మీకీ వార్త నెఱింగించి ప్రాణముల మాతృభూమిలో విడచుట యుక్తమని మిమ్ముదర్శింప నేగుదెంచితిని. సంధి సర్వవిధముల ఫలరహితమయ్యెను. యుద్ధమునిశ్చయము. ఇఁకమీచిత్తము.

రంగా—(కోపముతో) ఓయీ! విజయరామరాజా! నీయందెట్టి విపరీత భావము లుత్పన్నము లగుచున్నవి. పరుల దాస్యమునకుఁ బాలు పడుటయె గాక పరులరాజ్యమునకుసైతి మాసించి కఱవరాని గడ్డికఱచి పట్టరానివాండ్ర కాళ్లుపట్టుచున్నాఁడవా! నీవెంత

రాజాధిరాజువైననేమి. అదృష్టశాలివైననేమి. ఎంత సద్వంశ్యుడవైననేమి! నీబుద్ధుల బట్టిచూడ నెంతటి నీచదశకేని యర్హుఁడవనితోఁచుచున్నది. ఈ రంగారాయని కంఠనాళమున నాయువుండువఱకుఁ బద్మనాయక సైన్యమున నంగవికలులై ఆరోగ్యశూన్యులై యొక్కసైనికుఁడేని ప్రాణముతో నుండువఱకు బొబ్బిలిసంస్థానము విరోధులకు వశము కానేరదు. కానీయము. పరరాజ్యమును విజయరామరాజునకుఁ గట్టిపెట్ట విజృంభించిన బుస్సిదొరయు, లంచపుగడ్డిమేసి పరలోక మున్నదనియెని తలంపని హైదరుజంగుమంత్రియు మాకోపానలమునకుఁ జెదలు పురుగులు కావలసిన వారె! ముఖ్యముగ విజయరామరాజె శిక్షార్హుఁడువధ్యుఁడుఁ గూడ నాతఁడే!

సీ॥ క్షత్రియ రక్తపం ♦ కమునందు జయలక్ష్మి
విజయార్థమై తాండ ♦ వించుకొఱకు
పద్మనాయకవీర ♦ పౌరుష తేజంబు
పృథ్వీస్థలమున వ్యా ♦ పించుకొఱకు
రావువంశీయుల ♦ రక్తనాళంబులు
మాతృదేశప్రీతి ♦ మనుచుకొఱకు
వెలమశూరుల చరి ♦ త్రలు భారతీయుల
ప్రాంచితకీర్తిఁ బ ♦ రించుకొఱకు

తే॥ గీ॥ ఆత్మసంస్థాన సంరక్ష ♦ ణార్థమై ప్ర
పంచమున కాయువుల సమ ♦ ర్పించుకొఱకు
పంచభూతాదికంబు లీ ♦ క్షించుచుండ
గరమునం దాల్చుచున్నాఁడ ♦ ఖడ్గమిపుడు॥

పాపా—ఓరాజా! ఇఁక సహింపవీలులేదు. సోమకుల పరశురాముండగు నసపోతనాయకుఁ డాంధ్రదేశమున సామ్రాజ్యము స్థాపించుటకై ఏదేవి నుపాసించెనో రావుపెద్దనాయఁడు బొబ్బిలిసంస్థానము స్థాపించునపు డేదివ్యస్వరూపిణిని ధ్యానించెనో యాపంచాక్షరీ మంత్రాక్షరవిభాసినిని దేశమాతృను భారతమాతను మనమంద

అము స్మరించి రణార్థులము కావలయును. ఓపద్మనాయక వంశ
భూషణులారా! విరోధి రాజన్య సంహారప్రాభవాకరులారా! వి
క్రమ ప్రాప్త నిర్వ్యాజ కీర్తిమూర్తులారా! లెండు. ఖడ్గముల
ధరింపుఁడు. మాతృదేశమును నిష్కళంకమగు భక్తితోఁ దల్లి
యని సంబోధింపుఁడు. కరవాలములకు మెఱుఁగుపెట్టుఁడు.
మీ దేశభక్తియు రాజభక్తియుఁ బ్రకటింపుఁడు.

ఉ॥ చూచెద రేటికో వెలమ ♦ సోదరులార! విరోధిబృందముల్
బీచమడంచుఁడీ! తెలుగు ♦ బిడ్డల నెత్తురుతోడ వీరల
క్ష్మీ చరణాంబుజంబుల స్పృ ♦ శింపుఁడు లత్తుక, ఆంధ్ర తేజముల్
లోచనగోచరంబుగ వె ♦ లుంగఁగఁ జేయుఁడి, విక్రమింపుఁడీ॥ 10

ఓపరాక్రమైకధనులారా! ఓప్రభుభక్తి పరాయణులారా! మఱి
యొక విజ్ఞప్తి.

సీ॥ వచ్చుసేనలకడ్డు ♦ పడి వినాశనముఁగా
వింప సైనికులఁ బం ♦ పింపవలయుఁ
బరిఘుల పైనుండి ♦ వచ్చుమార్గంబుల
నన్నింటి తీసివే ♦ యంగవలయు
దగినయోధులకాయు ♦ ధములిచ్చి కోటగో
డల పైని బాఱుగా ♦ నిలుపవలయు
సాహసస్ఫూర్తికై ♦ సమరడిండిమముల
నెడ తెగకుండ మ్రో ♦ యింపవలయు

తే॥ గీ॥ అరులవృత్తాంతములనెల్ల ♦ నరయుకొఱకు
యోగ్యులగు చారులకు నాజ్ఞ ♦ యొసఁగవలయు
క్షణము రిత్తగజరుపఁగాఁ ♦ జనదు వెలమ
శూరవరులార! మీపని ♦ చూచుకొండు॥ 11

ఇను—పాహరాయాగ్రణీ! మీవీరవాక్యములు పద్మనాయకయోధులకు
బ్రోత్సాహము నెలకొల్పుచునె యున్నవి. సంధివిషయ మింత

విపరీతముగఁ బరిణమించెను. గావున విరోధులు హఠాత్తుగ నేయర్ధరాత్రిమునవో మనపై బడకమానరు. కావున మన మాత్మసంరక్షణమునకు నాత్మరాజ్యసంరక్షణమునకు బాటుపడ వలయునుగదా! పెచ్చుపెఱిఁగి విచ్చలవిడిగ మనపైఁబడనున్న విరోధిసేనాముద్రమునకుఁ జెల్లెలికట్టగ నేరినేని నియమించుట యుక్తము. దానివలన నరాతుల విజృంభణము నశించును.

వెంగ—ఈమహాత్కార్య నిర్వహణమున కేరో యెట్లుపనికివత్తురు! రాజ్యమర్మ విజ్ఞానియు విపులతర పౌరుషవిభ్రాజియు విరోధి సేనా భూమిరుహ సమూహ నిర్మూలన కర్మఠఝంఝా మారుత సదృశుండునునగు పాపారాయవీరుఁడే యిందుల కర్హుఁడు. అగ్రజా! ఏల సందేహింతురు. పాపారాయు నియో గింపరేల?

రంగా—తమ్ముఁడా! నేనింతకుమున్నె విరోధిసేనల నిరోధింపఁ బాపా రాయుని సైన్యముతోఁబంప సంకల్పించితినిగాని ముందు జరుగ నున్న యుద్ధమునఁ బ్రధానా సేనానాయక భారము నెవరు వహింం తురా యని యోజించుచు నాలసించితిని. ఇపు డాసందేహ మున కేటులో సమాధానము నిర్ణయించుకొంటిని. మిత్రమా! పాపారాయా! పద్మనాయక సంస్థానమునకు బ్రాప్తింప నున్న యవస్థనుగూర్చి నీకుఁ బ్రత్యేకించి చెప్పవలసినదిలేదు. సర్వము నీవె నిర్వహించుచుంటివికదా! నావిజ్ఞాపన మించుక యాలింపుము.

మ॥ అరిరాజన్యులు సైన్యసంభరితులై ♦ యాత్మీయ సంస్థాన ని
ర్భరభోగమ్ములనెల్లఁ జూఱఁగొనఁగా ♦ రానుండి రెల్లేని మా
ర్తురమార్గంబున నడ్డగించిసమదా ♦ స్తోకారి సంఘాత సం
హరణప్రాభవ శక్తిఁ జూపఁగదవ ♦ య్యా! పాపారాయాగ్రణీ॥ 12

ఉ॥ పోరునకీవుజొచ్చునెడ ♦ బొబ్బిలికోటకు నెట్టికీడు చే
కూరదు వైరిసంతతికిఁ ♦ గూడదొఁకించుక బాగు, నీదు దో

స్సారపయోధి నీదుటకు ♦ శక్యమె బుస్సికి రామధారుణీ
దారునకుఁ దురుద్యమని ♦ తాంతుఁడు హైదరుజంగుమంత్రికిన్॥

పాపా—రాజా! విరోధులు ముట్టడింప నే తెంతురను మాట స్పష్టమై నది. మనమందఱము ప్రాణములకుఁ దెగింపవలసినదె! అభిమానము నిల్పుకొనవలసినదె! ప్రాణమున్నంతవఱకు నైహికసంబంధములగు తుచ్ఛసుఖంబుల కాసింపక విక్రమించి విరోధిసేనాబృందమును జెండాడి వీరమరణమును సాధింతుము. కీర్తి గడించుదము. లోకమున నవ్యాహిత కీర్తిచంద్రికలఁ బ్రసరింపఁ జేసి బద్మనాయక పౌరుషచరిత్రములఁ గవుల రచనాంచములఁ దాండవింపఁజేయుదము. ఆంధ్రవీరుల మనోదర్పణముల బ్రతిబింబింపఁజేయుదము. వీరమాతల హృదయముల నటింపఁ జేయుదము. (యోజించి) విరోధులు మనపైకి దాడివెడలునెడ రాజాంకోట మీఁదగనె వచ్చి తీఱవలయును. కావునఁ గతిపయ సేనాసహితముగ నాకోటలో నేను గాచియుండి బొబ్బిలిరాజ్యమును గాపాడఁగలనుగాని యుద్ధసమయమున జన్మభూమిని త్యజింప వలసివచ్చునే యని విచారమగుచున్నది.

చం॥ వినుతగుణాఢ్యులౌ వెలమ ♦ వీరులపాలిటి కల్పవల్లి, పా
వనతరమూర్తి రంగనర ♦ పాలవరేణ్యుని గన్నతల్లి, అ
ర్థినికర కష్టసంతతులఁ ♦ దీర్పఁగఁజాలిన పాలవెల్లి నాఁ
బొనరు మదీయభాగ్యనిధి ♦ బొబ్బిలిరాజ్యము వీడశక్యమే॥ 14

ఇను—పాపారాయా! యోధాగ్రేసరుండవు. దేశభక్తశిఖామణివియగు నీవు యుద్ధాంతము వఱకుబొబ్బిలి కోటను విడువదగనిమాటయే యథార్థము. విరోధిసేనల మార్గమధ్యమున నడ్డగించుట మనకవశ్యాచరణీయము. ప్రతిపక్షుల వంచించుట కిది ప్రధానోపాయము. ఇందులకు సర్వవిధముల నీవెయర్హుఁడవు. కాన నీప్రయాణ మావశ్యకము.

కాక—తాండ్రకులాభరణా! బొబ్బిలిరాజ్యలక్ష్మివియోగమునకై జిం తనొందవలసిన యవసరములేదు. బొబ్బిలిపరిసరభూముల విడచి పోవ నప్పుడట్టివిచారమున కెడమెక్కడిది? జన్మభూమియం దంతటి గౌరవ ముంచదగినది గానఁ బ్రయాణము మానరానిది.

చం॥ మహితులు పద్మనాయకకు ♦ మారులు పెక్కురు ధైర్యధుర్యులై
విహరణమాచరించెదరు ♦ వీరరణాంగణమందు యుద్ధస
న్నహనము నీశిరంబుపయి ♦ నఁగల దెట్లయినన్ స్వరాజ్యధూ
ర్వహుఁడవుగమ్ము మార్తురను♦బైకొనఁబొమ్ము! ప్రతాపభూషణా॥

వెంగ—బావా! ప్రత్యుత్తరము నొసంగవేల? మౌన మర్ధాంగీకార మనియా!

పాపా—అర్ధాంగీకారము కాదు. పూర్ణాంగీకారమె. యుద్ధసమయ మున మాతృభూమిలో వెదఁజల్లవలసిన యీరక్తము పరిసర భూముల పాలుఁగావింప వలసివచ్చెననియె విచారపడుచున్నాఁ డను. మాతృక్షేమంకరమగు నేదుర్ఘటకార్యమందేని నాయును రులు వీడ సిద్ధసంకల్పుఁడనై యున్నాఁడను. అరాతుల వెచ్చని నెత్తురుతో వీరలక్ష్మిచరణముల నభిషేకముఁజేయు భాగ్య మీవెలమవీరు లందఱకుఁ గలదు. నేనె యదృష్టదూరుఁడను గాన రాజాంకోట కేగవలసివచ్చినది.

మ॥ రణరంగంబుననిల్చి బొబ్బిలిపురీ ♦ రక్షార్థమై రక్తసా
రణిఁ బాలించు నదృష్టమీఁగి యెటనో ♦ రాజామదుర్గాంతరాం
గణమందున్ వసియింపఁ దోడుపడె నా ♦ కర్మంబు మత్తేభదా
రణ పారాయణ వీరకేసరిని ని ♦ ర్బంధించె దైవంబహా॥ 16

చెలి—మిత్రమా! నీవెచ్చటనున్నను బొబ్బిలిపై నీపరాక్రమానలము ప్రసరింపకపోదు. అగ్నిహోత్ర మధోముఖముగ నున్నను ఊర్ధ్వజ్వాలల విడువకపోదు. రంగారాయని అవలంబన

మున్నంతవఱకు బొబ్బిలిరాజ్యమున కెట్టియుపాయమును రాదు. మఱియు సధర్మాధిక్యములేనిది అపజయము సాధ్యముకాదు.

కం॥ ఎట ధర్మముండునో యు
చ్చటనే విజయంబుగూడ ♦ సంధిలు, ధర్మం
బెట దొలఁగునో యపజయము
చ్చటఁ గనుపడు "ధర్మమేవ ♦ జయతి" యనరొకో॥ 17

పాపా—రాణ్మణీ! నీయాజ్ఞ శిరసావహించి వైరులఁ జెండాడ రాజాం కోట కరుగనున్నాఁడను. నావిజ్ఞాపనముఁ జిత్తగింపుఁడు. పద్మనాయకులారా! మీకిదియె విజ్ఞప్తి,

శా॥ వేయింపుండు విరోధిరాజ హృదయో ♦ ద్భిన్నైకసంధాన భే
రీయవ్యూహము, వైరిసేన కదనో ♦ ర్వీగూలయోధావళిన్
డాయింపుండు ఇలబద్మనాయకుల శౌ ♦ ష్ఠత్వంబు నిండారఁగాఁ
జేయింపుండు రణంబు విక్రమకళా ♦ జేగీయమానాత్మలై॥ 18

ఓపద్మనాయక కులాభరణులారా? సంగరనిపుణులారా? నేను రాజాంకోటకుఁ బ్రభునియాన శిరసావహించి యేగనున్నాడను. మీరలందఱు బూర్వ పద్మనాయకవీరుల పరాక్రమ జీవితముల సంస్మరించి సంగరరంగ మలకరింపవలయును. ఆంధ్రదేశమున మీకీర్తి చిరస్థాయిగఁజేయవలయును. మీజీవితము లాత్మదేశార్థమ్మె విడువవలయును.

సీ॥ స్మరియింపుఁడీ వైరి ♦ జన విఖండన పటి
ష్ఠాత్ముఁడౌ బ్రహ్మనా ♦ యకుబలంబు
భావింపుఁడీ ఘన ♦ ప్రత్యర్థిసంహారి
బాలచంద్రకుమారు ♦ పౌరుషంబు
పఠియింపుఁడీ వైరి ♦ పటల మర్మచ్ఛేది
భేతాళనాయకు ♦ భీషణంబు
సన్నింపుఁడీ సోమ ♦ వంశ మూలధ్వంసి

యనపోతనాయకు ♦ నతిశయుంబు

తే॥ గీ॥ వినుతిగావింపుఁడ వెల్మ ♦ వీరవర్య
ఖడ్గసముదాయ సద్యశః ♦ కావ్యగీతి
పద్మనాయకులార నీ ♦ వ్యత్ప్రతాపు
లార సంగ్రామ భారవా ♦ హకులుకండు॥ 19

రాజా! బొబ్బిలిరాజ్య వియోగసంతాప తప్తుఁడనగు నాకు సెల విండు. ఓపద్మనాయక వీరశిఖామణులారా యుద్ధాంతమున నదృష్టమున్నఁ గలసికొందము సెలవు.

రంగా—(సమీపించి) మిత్రమా? పాపారాయ! మనస్థితి మిగుల శోచ్యావస్థలోనున్నది. ఈజన్మమునఁ బునర్దర్శనభాగ్యము లభింపనున్నదో లేదో ఒక్కమారు గాఢాలింగన మొనరింపనిమ్ము. (కౌఁగలించికొని) అధీరవచనములతో నేమిపని?

కం॥ రాజాముకోటకరిగి ప
రాజితులు గ నరులనల్పి ♦ రావయ్యా! నీ
కే జయముచేకూరుత రిపు
రాజీ రాజీవహంస ♦ రాజమ చనుమా॥ 20

పాపా—ప్రభుసత్తమా! సెలవు పుచ్చుకొనుచున్నాఁడను. వెంగళరాయా సెలవు ఉత్తమపద్మనాయక సత్తములారా నేను నిర్గమించు చున్నాఁడను. ఆజ్ఞయిండు (ముందునకు నడచి) అకటా మాతృ దేశ మెటుల బాఁసెద.

మ॥ జననీ! వెంకటరంగరాయనృపునా ♦ జ్ఞాశృంఖలాబంధితుం
డనురాజామున కేగుచుంటిఁగృపతో ♦ డఁగాబంపుమా శత్రురః
క్తనితాంతార్ద్రవిచిత్రవస్త్రసదలం ♦ కారంబుతోనున్ననీ
గననే తెంచెదసంగరాంతమునఁ బ్రా ♦ ణంబున్నఁగంఠంబునన్॥ 21

(ఇంచుకనడచి) బొబ్బిలిరాజ్య రమా సపర్యకు దూరగుఁడనగు

చుంటిఁగదా యుని నాహృదయము సంతాప మతిశయించు చున్నది. ఐనఁ జేయునదేమున్నది.

మ॥ భవదీయాంఘ్రి సమర్చనారతుఁడు పా ♦ పారాయవీరుండు నీ
దవుకారుణ్యఫలంబుఁగోరి రిపుసై ♦ న్యవ్రాత విచ్ఛేదన
స్తవవీయూహావ భారనిర్వహణముల్ ♦ సాధింపనున్నాఁడు మ
మ్మవలోకింపఁగదమ్మ బ్రోవఁగద ♦ మ్మా ఆంధ్ర సంస్థానమా॥ 22

శా॥ రాజాంకోటను గావఁబోవలెనిఁకన్ ♦ రారండు వీరాగ్ర్యులా
రా? జన్యంబని జంకఁబోకుఁడు శరీ ♦ రంబుల్ తృణప్రాయముల్
రాజల్లున్ శర హార హీర నిభనీ ♦ రంధ్రాచ్ఛ కీర్తిచ్ఛటా
వ్యాజేందుప్రభ- వెల్మవీరమణులా ♦ రా? లెండు లెండియిఁకన్
ఇదిగో! నేనుగూడ వచ్చుచున్నాఁడు. (నిష్క్రమించును)

వెంగ—(నేపథ్యముఁజూచి) అన్నయ్యా అదిగో పాపారాయఁడు రాజాముకోటకు సేనాసహితముగఁ బ్రయాణమగుచున్నాఁడు. ముందు మనము విరోధులఁ బ్రతిఘటించుటకు యుక్తధర్మమెద్ది యో యోచింపుఁడు.

రంగా—కర్తవ్యమును యోచించుచునే యున్నాఁడను. ముందు విరోధుల నెదిరింపఁ బాపారాయుని సైన్యసహితముగఁ బంపితిమిగదా! ఇక్కార్యమువలన నాగంతుక ప్రమాదము లంతరించిపోవును ఇఁక భవిష్యత్కాల పరిణామములఁ గూర్చి యోచింపవల యును. విరోధు లిపుడేమి చేయనున్నది యుద్ధమున కెపుడు వచ్చునది వారలకు మూలబల మెంతయున్నది తెలిసికొనినఁ గాని మనమేపని చేయ వీలుండదు. సర్వమిదివరకే సిద్ధమై యున్నది. చారులవలన నేమేని రహస్యములు దెలిసెనేని యనంతర విధాయకముల నిర్వర్తించి యుద్ధరంగమునకుఁ బరు గెత్తుదము.

కాక—అదిగో! గూఢచారులు వచ్చునున్నారు. వారల ముఖ

వైఖరులఁ జూడ నేదియో నూతనవార్తలఁగొని తెచ్చుచున్న
ట్లుతో తోఁచుచున్నది,

గూఢ—(ప్రవేశించి) రంగారాయమహారాజా! వందనములు.

రంగా—ఏమి విశేషములు. మన ప్రతిపక్షుల దురుద్యమము లెటు
లున్నవి.

గూఢ—ఈ పరితాపకర వార్త నెటులెఱింగింపవలయును.

వెంగ—ఉపచారవాక్యముల కేమి! కార్యము ముం దెఱింగింపుము.

గూఢ—దేవా! విన్నవించు చున్నాఁడను. బుస్సిదొరవారు మనరాజ్య
ముమీఁదగ ముప్పదిమంది పరాసుసైనికుల నెటకోఁబంపుచుండ
వాండ్రను మాయోపాయములఁ బన్ని విజయరామరాజు మన
పొలిమేరలోఁ జంపివేయించెనఁట.

చెలి—అటులైన బుస్సిదొరగారు విజయరామరాజుపైఁ గత్తికట్టుదురే!

దామె—వెంకయ్యా! నీవు భ్రాంతి పడుచున్నటులున్నది. పరాసుసైని
కులను బొబ్బిలివారు చంపిరని బుస్సిగారికిఁ దెలిపి ద్రోహ
బుద్ధిని వృద్ధిఁజేయుటకె విజయరామరా జీదురుద్యమ మొనరించి
యుండును. లేకున్న విజయరామరాజు వాండ్రను మనప్రోలి
మేరలో నేలచంపించును. సరియె. పిమ్మట నేమైనది.

గూఢ—పిదప విజయరామరాజు బుస్సిదొరగారితో హైదరుజంగుతో
సమయోచితముగ మంత్రాంగ మొనరించి బొబ్బిలిరంగారావు
మీఁసైనికుల ముప్పదిమందిని వధించెనఁట. అందువలన బుస్సి
హైదరుజంగుల కోపము మేరమీఱెను. ఇందులకై మనల
శిక్షించుటకు బుస్సి హైదరుజంగు విజయరామరాజు మొదలగు
వారు సైన్యసహితముగఁ గాసింకోటనుండి దేవులపల్లిమీఁదఁగ
బొబ్బిలిని ముట్టడించుటకు రానున్నారని తెలియవచ్చినది.

ఇను—అనుకొనినంత జరిగినది. దైవవిధి యెటులున్నదో!

రంగా—ఈవార్త రాజాంకోటకు సేనాసమేతముగ నరుగుచున్న పాపారాయునికి నివేదించి మీపనియందు మీారు అప్రమత్తులై సంచరింపుఁడు. పొండు

గూఢ—చిత్తము. సెలవు పుచ్చుకొనియెదను. (నిష్క్రమించును)

వెంగ—బొబ్బిలి వెలమవీరుల పరాక్రమాతిశయము పౌరుషము దేశభక్తి కులాభిమానము యుద్ధరంగమునఁ జూపఁదగిన యవకాశమ మిప్పటికిఁ దటస్థించినది. కావునఁ బద్మనాయకుల జీవితములో నిదియె సుదినము. యోధాగ్రేసరునకు మాతృదేశ సంరక్షణార్థమై ప్రాణములఁ బరిత్యజించుటకంటె స్వర్గమేదియే మున్నది. ఓవెలమవీరులారా? మన పూర్వవీరుల జీవితముల నొక్కమాఱుస్మరించి వీరావేశపూరితులుకండు. ప్రాణముల వెచ్చించి యశోధనమును గడింపుడు. దేశభక్తిచూపుఁడు.

సీ॥ అమరావతిని రాచ ♦ కొమరులు జూపిన
యనుపమ విక్రమం ♦ బునుదలంచి
పలనాఁటిసీమలో ♦ పల తెన్గుమన్నీంద్రు
క్రాలఁజేసిన పరా ♦ క్రమము నెంచి
ఓరుగంటను వెల్మ ♦ వారు కన్పించిన
జగదుపద్రవశక్తి ♦ సంస్మరించి
కొండవీటను రెడ్డి ♦ మండలాధీశ్వరుల్
ప్రకటించినట్టి వి ♦ క్రమమునరసి

తే॥ గీ॥ పద్మనాయకవరులకు ♦ తృప్తిదేశ
మైనబొబ్బిలిగడ్డపై ♦ యాయువున్న
వఱకుఁబోరాడి పగతుర ♦ బలియొసంగి
మాతృసేవయొనర్పుడి ♦ మాన్యులార॥

రంగా—మిత్రులారా! నావిజ్ఞాపన మాకర్ణింపుఁడు. విరోధిసేనాసముద్ర ముప్పొంగి మనపైఁబడనున్నది. మనబలమనునౌక నింక నేని

వినియోగింపకున్నఁ జెడుదుము. మీపౌరుషవిక్రమములు విరోధులపైఁ బ్రసరింపఁజేసి శాశ్వతయశముఁ గడింపుఁడు. సర్వసేనానాయకుఁడగు బాపారాయఁడిచటనున్న సంగ్రామిక భారమంతయు నాయన వహించువాఁడు. ఇపు డాభారము నాపైఁగలదు. సేనల విభజించి యుద్ధమునకుఁ బురిఁగొల్పవలయును. పరరాజ్యమున కాసించినందులకు బుస్సిహైదరుజంగుల ప్రాణములఁదీయవలయును. విరోధిసైన్యమును జెండాడవలయును. విజయరామరాజును వధించి తద్రక్తముచే రాజ్యలక్ష్మి చరణాంబుజంబుల నలంకరింపవలయును.

శా॥ లెండీ! బొబ్బిలియోధులార! రిపుపా ♦ లీక్లేశ సంధాన దో
శ్చండత్వంబును జూపుఁడీ; వెలమవం ♦ శ్య ప్రాజ్య కీర్తిచ్ఛటా
పాండుచ్ఛాయల భూనభోంతరములన్ ♦ బ్రాకించి విద్విణ్ణృపా
ఖండోద్రేక మడంచుఁడీ! కదన రం ♦ గంబింక భూషింపుఁడీ॥ 26

ఇను—రాజా! తాము సర్వసేనాధిపత్యము వహించిన నిఁక నసాధ్యమేమున్నది. తామొనరించిన సేనావిభాగముల ననుసరించి యుద్ధరంగమున కేగ మేముసర్వసిద్ధముగా నున్నారము. మీపై మాకుఁగల భక్తిఁ గృతజ్ఞతారూపమున వెల్లడింపవలసిన సుకృతము లభించుటచే మాజీవితములు పవిత్రములైనవి. మాఘటములలోఁ బ్రాణవాయువు లున్నంతవఱకు, విరోధులఁ గోటలోని కడుగుఁబెట్టనీయము. బుస్సి విజయరామరాజున కెటుల బొబ్బిలిరాజ్యముఁ గట్టిపెట్టునో తిలకించితీరెదము.

మ॥ కరవాలంబులఁబూని వైరిశిరముల్ ♦ ఖండించి, తద్రక్తపూర్
ఝరముల్ బొబ్బిరాజ్యమధ్యమున, రా ♦ జద్వార సీమావనిన్
బరిఘాతోయములన్ బిరానఁ బ్రవహిం ♦ పన్ జేసి వీరవ్రతా
చరణీయంబుల నిర్వహించెదను రా ♦ జా! నన్నుఁ బంపింపుమా॥

చలి—ధరణీనాయకా! పరాక్రమజ్వాలలు హృదయమున నాగక, భావము దగ్ధమొనరించుచున్నవి. విరోధుల వధించువఱకు

కోపానలము చల్లారదు. హృదయసంతాప ముపశమింపదు. కదనరంగమునఁ బద్మనాయకవీర తేజముఁ బ్రసరింపఁజేయ నను జ్ఞాపింపుఁడు. వీరపదవి సాధింతుము. లేదా వీరమరణము సాధింతుము.

చం॥ రణమున వైరిభూపతుల ♦ రక్తముతోడఁ ద్రిశుద్ధిగాఁగఁ ద
ర్పణ మొనరించి మాన్యయగు ♦ భారతమాతను దన్పువాఁడ భీ
షణ కరవాలధారకు విజాతినృ ♦ పాలక రక్తధార భూ
షణ మొనరింపువాఁడ నను ♦ సంగరభూమికిఁ జేర్పఁగోరెదన్॥ 28

కాక—నృపాలమణీ! విరోధిరాజ ఖండన చణుఁడగు నీకాకర్లపూడి వేం
కటరాయఁడు కదనోత్సాహము వారించుకొనఁజాలక విన్న
వించు విజ్ఞప్తి నాలింపుఁడు.

చం॥ కదనము ప్రేతభూమియయి ♦ కన్పడ, వైరులయుత్తమాంగముల్
మెదడులు, కండలున్, దొడలు ♦ మేనులు రాసులు రాసులై భయం
బొదవఁగఁ జేయువైఖరిని ♦ యుద్ధమొనర్చెద, విక్రమక్రమా
స్పదవిభవంబుఁ జూపెదను ♦ పంపుము నన్ను దురంబుఁజేయఁగన్॥

దమ్మ—రాజవతంసా! విరోధుల యుద్ధమునకు రమ్మని పిలిచివచ్చితిని కానఁ బ్రతిఘటింప నేగుట నాకుఁ గర్తవ్యము. నాకరవాలము నకు విరోధులహృదయములకుఁ గల పూర్వపరిచయము మఱలఁ గ్రొత్తజేయ మనసగుచున్నది. కదనరంగమున విరోధుల వక్షస్థలములఁజీల్చి రాజ్యలక్ష్మి కభిషేకము గావింపవలయును.

మహాస్రగ్ధర.

ప్రళయోద్యద్దావకీలా ♦ ప్రచయతులితమౌ ♦ బాణసంఘంబుచే వై
రులకంఠంబుల్ విదల్తున్ ♦ రుధిరమయముగా ♦ రోదసిన్ జేయువాడన్
నిలుమోరీ రామరాజా ♦ నిలునిలుహయిదర్ ♦ నిల్వుమా బూసియన్నా
ల్కులు బ్రహ్మాండంబునిండన్ ♦ గుటిలరిపు శిరః ♦ కోటిఁ జెండాడువాడన్॥

రంగా—మిత్రులారా! మీస్వామిమానమునకు దేశభక్తికి సంతసించితిని. మీరలందఱు యుద్ధమునకు బ్రయాణోన్ముఖులు గండు. విరోధులు కోటదగ్గఱకు రాకమున్నె వ్యూహములఁబన్ని సైనికుల సమరమునకు సర్వసిద్ధముగనుంపుడు. రాజానుచారమ్మున రాజ్యాభిషేక మెవనికేని జేయనిదిరాజుయుద్ధమునకు బయలుదేర రాదు. కావునఁదమ్మునకు బట్టాభిషేకముజేసి నేనును యుద్ధమునకువచ్చెదను. మీరలు నియతధర్మములయం దప్రమత్తులై వర్తింపుఁడు. మీరు సజీవులైయున్నంతవఱకు బొబ్బిలికోటలోనికి విరోధుల నడుగుఁబెట్ట నీయకుఁడు. పూర్వవిఖ్యాతి స్మరింపుఁడు. దేశభక్తి ప్రకటింపుఁడు. ఆత్మరాజ్య రక్షణమునకుఁ బ్రయత్నించి నటుల విజయరామరాజ వధావిషయంబునకుఁగూడ నేకముఖముగఁ బ్రయత్నింపుఁడు. ఆయువుచంచలము. సత్కీర్తియేస్థిరము.

మ॥ అరిరాజన్యవధావిధాన నియత ♦ వ్యాసంగులౌ వెల్మసో
దరులారా! వచియింతు మీకిదియ .క♦ర్తవ్యంబు, ప్రాణంబు సం
గరరంగంబునవీడి వీరపదవిఁ ♦ గైసేయుఁడీ లేక మా
ర్తురఖండించి స్వకీయరాజ్యగత వి♦ద్రోహంబు వారింపుఁడీ॥ 31

("బొబ్బిలి రాజ్యలక్ష్మి!జయజయ" యనుచు రంగారావు ,వెంగళరాయఁడుగక్క మిగిలినవారందఱు నిష్క్రమింతురు.)

వెంగ—అగ్రజా! నేనుగూడ యుద్ధమునకు వచ్చెదను. నాకేల యీపట్టాభిషేకము?

రంగా—తమ్ముఁడా! పట్టాభిషిక్తుఁడవైనను అవసరమైనపుడు నీవుఁగూడ యుద్ధమునకు రావచ్చును. పూర్వాచార మవిలంఘనీయము కాన నిటులొనరింపనున్నాఁడను.

(నేపథ్యమున భేరీయములుమ్రోగును.)

వెంగ—అన్నయ్యా! సమరమనిన నుత్సాహమగుచున్నది. రణరంగమునఁ బద్మనాయకవీరులతోఁ బాటు నాశిక్షాలాఘవముఁగూడఁ

జూప వేడుకపడుచున్నాఁడు. అదిగో వెలమవీరులొనరించు కోలాహలము లాలకింపుఁడు. అదిగో వెలమసేనా నాయకుల వెనువెంటనేగు తెలగ బలిజె ఫౌజులయుత్సాహము జూడుడు. ఈరణదుందుభుల నిస్వనము నా కుద్రేకము నతిశయింపఁజేయు చున్నది. మఱియు

మ॥ తతనిర్ఘాత పృథుస్వనోపమితమై ♦ ధాణంధణధ్వాన సం
యుతమై వైరిచమూసమూహ రచిత ♦ వ్యూహ వ్యథాకారియై
వితతస్వాన చలీకృతాఖిల ధరా ♦ విఖ్యాత జీవౌఘ హృ
ద్గత ధైర్యాహరణప్రవీణమయి మ్రోఁ ♦ గన్ సాగె భేరీచ్ఛటల్॥

రంగా—తమ్ముఁడా! నాకడ్డముఁ జెప్పక పట్టాభిషిక్తుఁడవు కమ్ము.

వెంగ—(విచారముతో) చిత్తము.

పరిచారకుఁడు (ప్రవేశించి)—దేవా తమదర్శనమునకు హుసనల్లీ ఖాన్ అను మహమ్మదీయుఁడు వచ్చి ద్వారమున వేచియున్నాఁడు. ఏమి సెలవు?

రంగా—(స్వగతము) ఇతఁడు మనప్రతిపక్షుల దూతయని తోఁచుచున్నది. ఎట్టివార్తనైన వినవలసినదేకదా (ప్రకాశముగ) శీఘ్రముగఁ బ్రవేశపెట్టుము.

హుస—సలాం సర్కార్ రంగారావుసాహేబ్

రంగా—(ఎదురేగి పీఠముఁజూపి) మీరు బుస్సీదొరవారి సైనికులలోని వారని తోఁచుచున్నది. ఏమి విశేషములు? సెలవిండు.

హుస—మహరాజ్! మీరు లడాయిక్కు బాజాబజాయించారని మూహబుజూర్ హైదర్ జంగుసాహెబు యిని ఆపిమెయ్యమనిన్నీ బొబ్బిలికోట యిడ్చిపెట్టిపొమ్మనిన్నీ చెప్పమన్నాడు. ఆపిమెయ్యకపోతేలడాయిజరిగితీర్తుందిఅంట.

వెంగ—మీమహారాజుగారిపుడెచటనున్నారు

హాస—బొబ్బిలికోట పట్టుకోవాలా అని పైన్నెంతో వచ్చి దేవుల్‌పల్లికి దగ్గ వున్నతోటకాడ లష్కర్‌తోవుండాడు. ఈయాల సాయం కాలంవచ్చాము.

రంగా—మహమ్మదీయా! మనలోనిమాట. పూర్వము నుండియు యుద్ధములలో మాకుఁ బౌరుషచిహ్నాగ నుపయోగింపఁబడు నీభేరీ నిపుడేలప్రయోగింపకుండవలయును. ఇటులఁ జెప్పుటకు మా పైఁబ్రతిఘటించిన మీహుజూరున కేట్టియధికారమున్నది. మేము యుద్ధమునకు సర్వసిద్ధముగానున్నారము. బొబ్బిలికోటను విడచిపెట్టిపోము. ఈవర్తమానము మీప్రభువున కెఱింగింపుము.

హాస—అదిమా హుజూర్కి నిర్లక్ష్యం శెయ్యటం అని శెప్పమన్నాడు జీ.

వెంగ—మీప్రభువును మేము నిర్లక్ష్య మిపుడు చేయుట యేమి. విజయరామరాజు దుర్బోధనవిని మాపై కెప్పుడుకత్తి కట్టెనో నాడెనిర్లక్ష్యమొనరించితిమి. ప్రాణములకుఁ దెగించిన మాకీ హితబోధలతోఁబనిలేదు.

శా॥ ముష్టాముష్టినిబోరి మ్లేచ్ఛనివహం ♦ బున్ బట్టిబంధించి, వి
స్పష్టాహంకరణాతిరేక వితత ♦ ప్రజ్ఞాబలప్రాభవా
వష్టంభంబులఁజూపి,వైరులను జం ♦ పక జావనున్నార మే
కష్టంబేనియు లక్ష్యపెట్టము సురుల్ ♦ కంఠస్థమైయుప్పచోక.

రంగా—రణభేరి నాపమనియు యుద్ధమునకు సిద్ధముగ నుంటిమనియు బుస్సిహైదరు జంగులకు దెలుపుము. సర్వము వ్యతిరేకించిన పిమ్మట రాయబారము శేల.

హాస—మహారాజ్-ఏంశెస్తాం హుజూర్లకిప్రాణం దివాన్లకిచేతుల్లో వుంది. దివాన్లకి ప్రాణం లచంలోవున్నది. నేను ఏంశెస్తాన్ జీ వాళ్లకే యిష్టం మీకీయిష్టం.

వెంగ—మారాజ్యమునకు మేము సర్వస్వతంత్రులమనియు నిట్టసందే

ముల లక్ష్యపెట్టమనియు మీప్రభువులకుఁ దెల్పి చేతనైనపని చేయుమనుము.

హస—అచ్చా అట్టాగె శేస్తామ్. ఆదాబ్ సర్కార్.

(నిష్క్రమించును).

రంగా—సోదరా! ఱేపటి సూర్యోదయమునకు దప్పక విరోధులు మనకోటముట్టడింతురనియు, దాపునకు వచ్చిరనియు యుద్ధము జరిగితీఱుననియు హసనల్లిఖానుని వాక్యములవలన స్పష్టమైనది. నీకు బట్టాభిషేకము ముందొనరించి పాపారాయునిరమ్మని వార్తఁబంపి నేనుయుద్ధరంగమున కరుగవలసియున్నది. పోదము రమ్ము.

వెంగ—పాపరాయనికి వెఱచి విరోధులు దొంగత్రోవలఁ జూచికొని యుందురు. రాజాంకోటమీదుగావచ్చిరేని విరోధిసేనయిదివఱకె నామమాత్రావశిష్టము గావలసినదే. విజయరామరాజు శను గలిగి మెలఁగుచున్నాడు. ఇఁక రాజామకోటను గాచియుండనవసరములేదు. విరోధులు సమీపమునకు వచ్చిరిగానఁ బాపారాయని బలముతోఁ బిలిపింపవలయును.

(నిష్క్రమింతురు.)

తృతీయాంకము.

సంపూర్ణము



శ్రీ ర స్తు.

# పా పా రా య ని ర్యా ణ ము.



## చ తు ర్థాం క ము

రంగము. బొబ్బిలికోట.

చెలికాని వెంకయ్య—(ప్రవేశించి) వెంగళరాయునికి బట్టాభిషేకముఁ జేయుచుండి కాఁబోలు శ్రీరంగరావుగారింకను యుద్ధభూమి నలంకరించియుండరు. విరోధులు జయభేరులు వేయుచున్నారు. పిరంగులు కోటగోడకు గుఱిచేయుచున్నారు. సైన్యమునకు నియతస్థలము లేర్పఱచుచున్నారు. పద్మనాయకసైనికులు విరోధులపై కుఱుకనున్నారు. ఉభయసేనా సమయుద్ధమున కొకత్రుటికాల మంతరాయమున్నది. అదిగో పద్మనాయకసేనానాయకులు బలముగూర్చుకొని దిక్కుల నరికట్టుచున్నారు. ఇఁకఁ బ్రభువర్యుని యనుజ్ఞయే యవశిష్టము (చూచి) అదిగో; రంగారాయనృపుఁడు వచ్చుచున్నాఁడు. ఆయన సెలవందిగాని సైనికుల యుద్ధాభిముఖులుగఁ జేయవీలుండదు.

రంగా— (ప్రవేశించి) మిత్రమా? యుద్ధవిశేషము లేమేనికలవా?

చెలి—పరాసుసైనికులు వ్యూహములఁదీర్చికొని మనపైకి రానున్నారు. సేనానాయకులు మీయాజ్ఞకొఱకునిరీక్షించుచుమీరాక కెదురు చూచుచున్నారు.

రంగా—మిత్రమా! విరోధులు మనపైకి వచ్చినవెంటనే భారతమాతకు వందనములొనరించి మనసేనానాయకులను కదనరంగమునకు సిద్ధపడుమని తెల్పుము. నేనీయున్నతమగు బురుజెక్కి సర్వసైన్యమును దిలకించుచుందును.

చెలి—చిత్తము సెలవుఁ బుచ్చుకొందును. (నిష్క్రమించును)

రంగా—బుస్సిదొరవారు బొబ్బిలికోటను బట్టుకొనుటకు నాలుగువేల మంది సిపాయిలతోడను ఐదువందలమంది యూరోపియనుల తోడను వచ్చెననియు బదివేల సైనికుల విజయరామరాజు సహాయముగా నొసంగెననియు నేనువినినమాటయథార్థము. ఇంత సేనను స్వల్పసంఖ్యాకులగు మనసైనికు లెటులనిర్జింపఁగలరో చెప్పఁజాలను. శమసైన్యమును నాలుగుభాగములుగఁ జేసి యొక్కొక్క సేనాభాగమునకు గొన్నిఫిరంగులు కొన్నియాగ్నే యాస్త్రములు చొప్పున బంచి బుస్సిదొరవారు సమరముచే యించుచున్నారు. అకటా! ఎంత ప్రళయసమర మగుచున్నది. (ముందునకుఁజూచి) ఓవీరవర్యులారా! ఓపద్మనాయకులారా! మీ నియతస్థలంబుల గడుజాగరూకతతోఁ గాఁచి కొనుఁడు.

మఱియు.

సీ॥ దామెరదమ్మన ♦ ధరణీశ! తూరుపు
బురుజుచెంతకు సేన ♦ మఱలనిమ్ము
కాకర్లపూడి వెం ♦ కటరాయ పడమటి
దిశకునీఫౌజును ♦ ద్రిప్పికొమ్ము
చెలికాని వెంకయ ♦ క్షితి నాథయుత్తరం
బునకు నీదళమును ♦ జనఁగనిమ్ము
ఇనుగంటి ధర్మయ ♦ జనపాల దక్షిణం
బునకు నీసైన్యంబు ♦ బోవనిమ్ము
తే॥ గీ॥ పద్మనాయకులార! నల్ ♦ వైపులరసి
అరుల మొగ్గరములను జెం ♦ డాడుఁడయ్య
శాత్రవులు విక్రమించిరి ♦ సత్వరంబు
సైనికాగ్రణులార! పై ♦ కొనఁగరండు॥ 1.

(నలువైపులజూచి) ఓయోధాగ్రేసరులారా! మీసాహసము శ్లాఘనీయము. మీపరాక్రమము వర్ణనీయము. మీప్రభుభక్తి ప్రశంసనీయము.

మ॥ రణరంగంబున విక్రమాధిగత సం♦ రంభంబు జూపించి, భీ
షణ శాతాసికిఁ గంఠనాళములతో ♦ సఖ్యమ్ము వాటించి, వీ
క్షణ వహ్ని ప్రసరంబుచేత నరులకు ♦ సయ్యాటలాడించి, మా
రణభారంబు వహించు వెల్మజనులా ♦ రా ? మిమ్ము శ్లాఘించెదన్ 2

(కొందఱు విరోధులు తాళ్ళనిచ్చెనలతో బురుజులెక్కుదురు).

రంగా—యోధాగ్రేసరులారా ! విరోధులు తాళ్ళనిచ్చెనలతో గోట పై కెక్కుచున్నారు ప్రతిఘటింపుఁడు. మెలకువ వహింపుఁడు. ప్రతిషేధింపుఁడు.

సీ॥ పొంగులు పలుమాఱు ♦ పొంగగాచిననూనె
వైరులపై బోయ ♦ వలయు నిపుడు
బాఱుటీటెలఁగొని ♦ పై కెక్కుగానున్న
పగతుర బొడువగా ♦ వలయునిపుడు
చండహేతుల చిత్త ♦ జల్లుగా నొకమాఱె
పరులపై గుఱిపింప ♦ వలయునిపుడు
ఉడుకు టంబలికుండ ♦ లొకకొన్నిమార్తార
పైజడియకవైవ ♦ వలయు నిపుడు
తే॥ గీ॥ బురుజులకుఁ బ్రాకుచున్నార ♦ లరులుమూగి
ప్రతిఘటించి ధరకుగూల్ప ♦ వలయు నిపుడు
కడగి పగవాండ్రపైఁ బాఱు ♦ గాలినేని
బైకిరాకుండఁ జేయగా ♦ వలయు నిపుడు. 3

(బొబ్బిలిసైనికులు బురుజులెక్కువారిని గ్రిందికిఁ ద్రోయుదురు).

చెలి—ఓవిజయరామరాజా ! బుస్సిదొరా ! హైదరుజంగూ ! మీరలెందుంటిరి. చచ్చుచున్న మీసైనికుల కష్టపడలేరు ! మము బ్రతిఘటింప నరుదేరరేమి ! ఓప్రతిపక్ష సేనానాయకులారా! దొంగత్రోవల చూచుకొందురేల ఇటురండు ఇటురండు.

ఉ॥ సంగరరంగమన్నయెడ ♦ జంకరు వెల్మవజీరు లేలయీ
వెంగలిపాటు మిమ్ము ♦ బలిపెట్టకమానరు యుద్ధమందు, క
త్తింగొని యేగుదెందు, వెను ♦ దీయకరందు, నిలుందు మీప్రధా
నాంగములింక శాశ్వతను ♦ ఖ్యాతులు కందు, విరోధి సైనికుల్॥ 4

ఇను—ఓవిరోధి సైనికులారా? నిలువుఁడు నిలువుఁడు. బొబ్బిలికోట విజయరామరాజునకు గట్టిపెట్టనిదె పలాయన మంత్రముఁ బఠించుచున్నారేల? ఇదిగో మిమ్ముఁ బరామర్శింపుటకు నేను వచ్చుచున్నాఁడను. క్షణముసేపు ప్రతిఘటింపుఁడు. పద్మనాయక వీరులతో ముష్టాముష్టి బాహాబాహి పోరాడనిదే వెన్నుఁ జూపెద రేల? (బురుజు దిగిజూచి) ఓహెూ. పారిపోవుచున్న సేనకె వ్వఁడో తురుష్కుఁడు ధైర్యముం జెప్పి యీవైపునకు దీసికొని వచ్చుచున్నాఁడు. వీండ్రు మమ్మెటులఁ బ్రతిఘటించి ప్రాణములతో నిలిచెదరో పరిశీలించెదఁగాక. (బురుజెక్కును.)

లాడూ ఖాఁ—(ప్రవేశించి) నువ్వు, యెవడూ బే వుండావ్ మాకీ బయం మాకీ బత్తీ లేకుండా మాట్లాడుతావ్. దేఖో నీది దైర్రం నాదీషౌర్రం పైకివస్తుంది. మాశక్తిమీకు తెలిసిందిలేదు. దమ్మన్నసాబ్ కి శూహాం అజే జండాలిల్ మహమ్మద్ హుసేఁ అజి సిద్దిబిలాల్ అజిజాదేఖాడే, అజీ నవాబ్ హుసేఁ అల్లీఖాఁ బహద్దర్ అజిషుకురు ల్లాఖాఁ. బొబ్బిలిగడీ పడో, పడో, జీ, రంగారావు బహద్దర్ సాబ్ మాది తుర్కా దెబ్బా కానుకో

(త్రాటినిచ్చెనతోఁగోటపైకిఁబ్రాఁకును)

దమ్మ—ఓరీ! దురాత్మా? నాబురుజునకే ప్రాకుచుంటివా! రమ్మురమ్ము నీకును నాకును రాయబారమునాటనుండి చిరపరిచయము కలదు. నిను గౌరవించుట నావిధి.

మ॥ అతిగర్వాత్మునిబుస్సినిఁ విడి, మదా ♦ యత్తాత్ముఁడౌ హైదరుఁ
క్షితిపైఁగూల్పక, రామరాజుతలఖం ♦ డింపంగఁబోకే, దురా

గతచిత్తుఁగానినుజంపశాతవిలసత్ ♦ ఖడ్గంబురానుండె, నీ
బ్రతుకీనాఁటికిఁ దెల్లవాఱె చనుమా! ♦ పాపాత్మ! మ్లేచ్ఛాధమా॥ 5

(దమ్మన్న యీటెతోఁ బొడుచును. లాడూఖాఁ మఱికొందఱు గతింతురు.)

విజయరామరాజు—(నేపథ్యమున) ఓబుస్సినరపాలా? హైదరు జంగు మంత్రీశ్వరా! వెలమవీరుల పరాక్రమములముందు మన శక్తియుక్తు లక్కఱకురాకున్నవి. సిద్దిబిలాల్ పాఱిపోయెను. లాడుఖాఁ దమ్మన్నగారి యీటెపోటుచే గతించెను. జాఁ ఖాఁ సైన్య మంతయు దిక్కుచెడి చెల్లాచెదరై పోయెను. సేనలను రక్షింపుఁడు. సైనికులకుఁ బ్రోత్సాహవాక్యముల నుద్బోధింపుఁడు. రండు. రండు.

రంగా—ఓవిజయరామరాజా! చాఁటుననుండి యేదియో ప్రేలెదవేమి? పౌరుషముఁగల మగవాఁడవేని బొబ్బిలివీరులకు నీబలమొక్కింత చవిచూపుము. లేదా? పిక్కబలముఁ జూపుము. పరాక్రమపంత మగు సత్క్షత్రియవంశమున జనించియుఁ గులగౌరముల నేల మంటిపాలుగావించెదవు?

మ॥ ప్రతిభాశాలురు పద్మనాయకులు దు ♦ ర్వారోగ్ర విక్రాంతిసం
గతులై తావక సైన్యసంహరణముం ♦ గావించుచున్నారు, దు
ర్గతిపాల్గాకుము, సైన్యరక్షణ మొన ♦ ర్పఁబొమ్ము లేకున్నచో
హతమై పొమ్ము ప్రతిష్ఠతో విజయరా ♦ మా! పాపభారాశ్రమా॥ 6

ఇను—రాజా! మౌనవ్రత మారంభించినవాని నేలయుద్ధమునకుఁ బిలచెదరు. సేనానాయకుల కేని ప్రోత్సాహవాక్యములు వచింప మొగముచెల్లని యీవిజయరామరాజు రణరంగమున నిలచునా? ఎంతబలము కలవాఁడైననేమి? ఎంతసైన్యము కలవాఁడైన నేమి? హైదరు జంగు బుస్సిగారి కెంతధైర్యముఁ జెప్పిననేమి. బొబ్బిలివీరులనిన విజయరామరాజునకు సింహస్వప్నమే! హృదయశల్యమే!

కం॥ మన తాఁకునకోర్వక మో
మునుమఱలిచి నిలువలేక ♦ మూలలఁజొఁఱువా
నిని యుద్ధమునకుఁ బిలువఁగఁ
జనునే యిది నిక్కువంపు ♦ సాహసమగునే॥ 7

షుకురుల్లా—(ప్రవేశించి) ఈతడ్వ బొబ్బిలికోట ముక్కల్కీ ముక్కల్ చెక్కల్ కీచెక్కల్ కావాలవుంది. పిరంగికి గట్టివుంది. నైతో కోటకుగట్టివుంది తెల్వాలా! బొబ్బిలివాంళ్లకి బోత్ పొగురూవుంది అంతా బైటికి తెప్పిచ్చితీర్తాఁ.
(పిరంగులఁ గోటకుఁబెట్టి కొందఱుసైనికులు కాల్తురు. మఱి కొందఱు కోటలకుఁబ్రాఁకుదురు.)

ఇను—ఓరీ దుర్మార్గులారా! ముందు మీచావుఁ దప్పించికొని కోట గతి విచారింపుఁడు. పద్మనాయకవీరుల విక్రమములముందు మీ జీవితములు బుద్బుదప్రాయములైయుండ వినాశకాలమేల కొని తెచ్చికొందురు? విక్రమింతురా? వెన్నుచూపుదురా?

(పిరంగులుమ్రోగును. కోట పగిలిపోవును. వెలమవీరులు విరోధిసైనికులు సమయుద్ధ మొనరింతురు)

విజయరామరాజు—(నేపథ్యమున)ఛన్నీలాస్ కుప్పీ. మీరిరువురు బలిష్ఠములగు ఫిరంగుల సింహద్వారమున కభిముఖముగ నెడ తెగకుండఁ బ్రేలింపుఁడు. మర్తైఁ ధరాస్ లీలాన్, మీరు సేన తో షుకురుల్లాఖాఁ భేదించిన పశ్చిమదుర్గమును ఛేదించి కోటలోనికి మార్గముఁజేయుఁడు. బురుజులు పడునంతవఱకు బొబ్బిలికోట మనకు వశముగాదు. ఇదిగో నేనుగూడ వచ్చు చున్నాడను. పిరంగులుగాల్చుఁడు.

(నేపథ్యమున పిరంగులు మ్రోగును. కోటపగిలిపోవును).

రంగా—ఓవీరమాతలారా! ఓవీరకాంతలారా? మఱఁగఁ గ్రాఁగినసూనెల సైనికులకందీయుఁడు. కళకళగ్రాఁగు వేడియంబలికుండల కోట

మీఁదినుండి సైన్యముపైకి దొర్లింపుఁడు. ఓవీరమాతా! నీవొన రించుకార్యము ప్రశంసనీయము. నీవు చల్లినకారపుం బొడివలన విరోధిసైన్యమంతయు గ్రుడ్డిదైపోయెను. విరోధులీ యంధత్వము వలన దిక్కులు తెలియక తమ్మఁదాము కాల్చుకొని మడియు చున్నారు. ఓ తెలగవీరులారా! కోటల కెగఁబ్రాఁకు మ్లేచ్ఛుల వధింపుఁడు. ఓవెలమవీరులారా! ఆవచ్చుచున్న సైన్యమున కడ్డు పడుఁడు. ఓ రెడ్డిసేనానాయకులారా! ముందునకు రండు.

(నేపథ్యమునఫిరంగులు మ్రోగును)

రంగా—ఓవిరోధులారా! ఓప్రతిపక్ష సేనానాయకులారా? ఇప్పటికి గోట బగులఁగొట్టి ద్వారమును గావింపఁగలిగితిరా? కానిండు. మీ రాద్వారము నెటులవశముఁ గావించుకొందురో చూచితీఱె దను. ఓవెలమవీరులారా ? ఓసేనానాయకులారా ? ఓసైనిక లారా? కోటగోడల్పైఁ గొలఁది సైన్యమునుంచి విరోధుల లోనికిఁ బోకుండ నీద్వారమున కడ్డుపడుఁడు. ఓవిజయరామరాజా! మురియకుము. మురియకుము. ఇంతవఱకు విజయము మా యదియెయని భావింపుము.

తే॥ గీ॥ బురుజు కూలినమాత్రానఁ ♦ బోయెనొక్క
గురుతరంబైన బొబ్బిలి ♦ కోటసొబగు
వివిధ శాఖోపశాఖలు ♦ వెలయుమావి
కొమ్మయొక్కటివిఱిగిన ♦ గొఱఁతఁగను నె॥ 8

విజయరామరాజు—(నేపథ్యమున) ఓయోధాగ్రేసరులారా! ఓప రాసు సైనికులారా! ఈప్రాగ్దిశలోని కోటగోడకుఁ గూడ ఫిరం గులు గుఱిపెట్టికాల్పుఁడు. ఇకబొబ్బిలికోట వశమైతీరును.. కోట వశమైనవెంటనే లోపలి భటుల సంహరించుటయు విజయధ్వజము స్థాపించుటయు సులభసాధ్యము.

(నేపథ్యమున ఫిరంగులుమ్రోగును)

(రంగస్థలమందలి కోట పగిలిపడిపోవును)

రంగా—ఓసేనానాయకులారా! బురుజుల కాచుకొనుఁడు. ద్వారముల నిరోధింపుఁడు. విరోధులఁ గోటలోనికిఁ జొచ్చకుండఁ బ్రతిఘటింపుఁడు. అదిగో బుస్సిదొర సైన్యము పశ్చిమ దుర్గమును భేదించుచున్నది. జాడిఖాన్ అమీరుజా, అధిక సైన్యముతోఁ గోటభేదించి గోడలఁ బగులఁగొట్టి లోనికిఁ బ్రవేశించుచున్నాఁడు. కాకర్లపూడి వెంకట రాయఁడుగారూ! మీరా బురుజును మెలకువతోఁ గాచికొనియుండి కొంత సైన్యమును ద్వారముల నిరోధించుటకు నంతఃపురమునఁ బ్రవేశించు సైన్యమును బంధించుటకుఁ బంపుఁడు. కోటలోనిక విరోధిమాత్రుని ప్రాణమున్నంతవఱకుఁ బోనీయకుఁడు.

(లోనఫిరంగులు మ్రోఁగును)

దమ్మ—ఓప్రతిపక్షసైనికులారా! ఓవిరోధిసేనానాయకులారా! పద్మనాయకవీరుల కంఠమునఁ బ్రాణమున్నంతవఱకుఁ గోటలో మిమ్ములనడుగుపెట్టనీయము. ఆద్వారమున నడుగిడెదరేని మీకందఱకు సంఘమరణము సర్వసిద్ధముగనున్నది. ఓసైనికులారా!

లయగ్రాహి.

చండతరహేతిఁగొని ◆ కండలును శల్యములు
తుండెములు జేసెదని ◆ యుండు నను గెల్వన్
ఖండపరశుండయిన ◆ దండధరుఁడైన గిరి
ఖండనచణుండయిన ◆ గండుకలవాండ్రే
దండునిటు త్రిప్పి చన ◆ కుండుఁ డెద ధైర్యము వి
డుండు మిముఁ దున్మెదప ◆ దుండు చనఁ బోకుం
డుండుఁడు భవత్పిశిత ◆ ఖండములు తుండములు
చెండెదను వెన్నొసఁగ కుండుఁడు నిలుండీ॥ ౧

రంగా—దమ్మన్నగారు! మీసాహసము సంభావ్యము. మీసైన్యము నించుక యీశాన్యదిశకుఁ ద్రిప్పినఁ బ్రతిపక్షసైన్యమును గోట

లోనికిఁ జొచ్చకుండఁ జేయవచ్చును. ముందు ప్రతిపక్షుల కడ్డు పడినగాని మనయభిమానముదక్కదు.

(దమ్మన్న నిష్క్రమించును.)

రంగా—విజయరామరాజు పద్మనాయకసైన్యమును నురుము చేయించుచున్నాఁడు. పద్మనాయకవీరులు పెక్కండ్రు భయంకరము లగు ఫిరంగుల కాహుతియగుచున్నారు. ఇనుగంటిధర్మారాయని సైన్యమంతయు విరోధులు చెండాడిరి. కాకర్లపూడి వెంకటరాయఁడు విరోధుల దుర్గద్వారముచెంత నెదిరించి సైన్యసమేతముగ స్వర్గమలంకరించెను. కోట పగిలిపోవుచున్నది. ఇట్టి విపత్సమయమున శరణ్యమెద్ది? కర్తవ్యమెద్ది? (నిరాశతో)

ఉ॥ బొబ్బిలిరాజ్యలక్ష్మి! సరి ♦ పోయెను నీకిఁక నా ఋణంబు, నీ
సబ్బుఁగనుండెఁ రామవసు ♦ ధాధిపుకూటమి, రక్తపున్నదిన్
బొబ్బిలి పద్మనాయకులు ♦ యోధులు స్వర్గముఁ జేరి రింక నీ
వబ్బెన మాచరింపఁగద ♦ వమ్మ! పరున్ వరియించి మించఁగన్॥ 10

(అటు నిటుఁ జూచి) ఇఁక బొబ్బిలిరాజ్యము రావువంశీయుల యావలంబనమునుండి తొలంగినటులె. బుస్సిదొరవారు పశ్చిమదుర్గము భేదించి దుర్గపాలకుల వధించి కోటలోఁ బ్రవేశింపనున్నారు. విజయరామరాజు రెండువేలమంది సైనికులతో ఫిరంగులతో విజృంభించి కోటగుమ్మములఁ బగులఁగొట్టించుచున్నాఁడు. వెలమవీరుల సైన్యములు విరోధుల హస్తగతము లగుచున్నవి. విరోధులకు బలసంపత్తి చాలినంతకలదు. (చూచి) అదిగో దక్షిణదుర్గముచెంత నేదియో కలకలము జరుగుచున్నది. పరాసుసైనికులు వెలమ సేనానాయకులు చేయు నట్టహాసములు వినవచ్చుచున్నవి. అదిగో చెలికాని వెంకయ్యయిటె యొకతురుష్కుని తఱుము కొని వచ్చుచున్నాఁడు. అయన కేమెని నిజవర్తమానములు తెలియునేమో యడిగి తెలిసికొందుఁగాక.

తురుష్కుఁడు—అరేహల్లా! చెలికాని వెంకయ్యసబ్ నాకీసంపుతూవుంది సంపుతూవుంది దేఖో! దేఖో!

(తురుష్కుఁడు నిష్క్రమించును.)

(చెలికాని వెంకయ్య వెంబడించి పరుగెత్తును).

రంగా—(వెంకయ్యనాపి) మిత్రమా! పాఱిపోయిన వానిం దఱిమెద వేల?

చెలి—రాజా! నన్ను వారింపకుము. యుద్ధధర్మముల బరిత్యజించి విశ్రమించియున్న పద్మనాయకుల వరించిన యీక్రూరాత్ముని బ్రతుకనిచ్చిన పాపముగూడ వచ్చును. నన్ను బోనిండు. త్వరలో నాతని శిరంబు దెచ్చి మీపాదములముందుంచెదను.

రంగా—"వినాశకాలే విపరీతబుద్ధిః" యన్న నటుల నాతురుష్కున కంత్యకాలమునకే యిట్టిబుద్ధిపుట్టినది. వాని నింతతోఁ బోనిమ్ము. మిత్రమా! యుద్ధవిధమెట్లున్నది? విరోధులకు విజయము లభ్యమయినదా? విజయలక్ష్మి మనల బరిత్యజించి నటులేనా?

చెలి—రాజా! ఏమని విన్నవింతును? మనసైన్యము చాలవఱకు నిర్మూలమైనది. విరోధులిప్పటికి మూఁడు బురుజులఁ బగుల గొట్టిరి. హైదరుజంగు కోటలోనికిఁ బోవలయునని గాఢప్రయత్నముల చేయుచుండఁ బద్మనాయక వీరులు మూర్తీభవించిన ప్రళయస్వరూపములోయన నొక్కొక్కవీరుండు పదిమంది ప్రతిపక్షులపైకి దుముకుచు మదపుటేనుగుపై లాఘవంబు జూపు కొదమసింగము కరణిఁ జెండాడుచు మండలాగ్రముల జళిపించుచు నెల్లెడల తామై ప్రాణములకుఁ దెగించి పోరిపోరి తెగిన మెడలతోడను నొగిలిన తొడలతోడను జీలినమేనులతోడను వ్రాలిన ప్రేగులతోడను పగిలిన కపాలములతోడను బొగిలిన కపోలములతోడను నేలకొరగియునుసురులవీడు చుండియు సంగవికలులయి యుండియుఁ గరవాలమున విసిరి పరిసరమున నున్న

ప్రతిపక్షసైనికుల జంపి తాము వీరస్వర్గము చూఱగొనుచు బగవారిచేగూడ ప్రశంసా సత్కారముల నందసాగిరి. ఇప్పటికి విరోధిసైన్యము సగమునకు బైగా నశించినది. మొత్తముమీద విజయము ప్రతిపక్షులదే. ఇంకను హతశేషులగు పద్మనాయక వీరులు ప్రభుభక్తి పరాయణులు చావున కొప్పుకొని విరోధుల గోటలోనికి బోకుండఁ బ్రతిఘటించుచున్నారు కాని కృతార్థులు కాజాలరు.

రంగా—మిత్రమా! బొబ్బిలి రాజ్యలక్ష్మికి మనకుఋణము తీఱినది. కలకాలమునుండి వెలమతేంద్రకుఁ గాణాచియగు నీరాజ్యరమ పరుల వరింపనుండ నేను జీవముల దాల్పదగను. కోటయంతయు దోర్నివలతో నిండిపోయినది. విరోధిసైన్యమింక నంతఃపురమునకుఁ బ్రవేశించి తీరును. శుద్ధాంత కాంతల నెటుల గాపాడవలయునో యభిమానముల నెట్లు రక్షించు కొనవలయునో తోచకున్నది. (ఆలోచించి) ఇంక గతకావ్యమేమున్నది. విరోధిసైన్య మంతః పురాంగనల గన్నెత్తి చూడకముందె వాండ్ర జెండాడి విజృంభించి వైరిసేనాజనమును మనము హతముగావించి వీరస్వర్గములంకరించి పీనుగులతోడను రక్తప్రవాహములతోడను నిండి ప్రళయ భైరవస్వరూపమును దలపింపజేయు నీరాజ్యము విరోధుల కొరకు విడిచిపెట్టుదము. నీతలంపెద్ది?

చెలి—దేవా? మీయాజ్ఞ కర్తవ్యము. పద్మనాయకవీరుల జీవితాంత మున నంతఃపురాంగనలు దుర్దశలపాలుకాకుండ వీరోచితముగ నందఱ ఖండించి మనము కదనరంగమున స్వేచ్ఛగనటించి శాశ్వతకీర్తి గడించి వీరమరణము సాధించుట ధర్మమె కాని యీసాహసకార్యమున కెవ్వని నియోగించుగము?

రంగా—ఇక్కార్యమునకుఁ బరమాప్తుడవగు నిన్నె నియోగించుచున్నా డను. కార్యభారము నిర్వర్తించి యాహవనిర్వహణమునకు నాకుఁ జేయూతయొసంగుము.

చెలి—దైవమా! నాకెట్టి కష్టవిధిని సంకల్పించితివి! విధి! నాచేత నెట్టి పౌరుషేతర కార్యమును జేయించుచున్నావు! దక్షిణహస్తమా! నీవెట్టి నీచకార్యమున కుపక్రమింప నున్నావు! ప్రభుని యాన దాఁటరానిది. స్త్రీవధ చేయరానిది. కాల ముపేక్షింప రానిది. నా కుచితధర్మ మింక నెయ్యది? మానుష సంరక్షణమున కీచేయఁబోవు దుష్కార్యము కొంతవఱకేని యుక్తమగునేమొగాని యబలలును ముగ్ధలునునగు రాణివాసపుఁ జెలువలను దాక్షిణ్యశూన్యుఁడనై రక్తబాంధవ్యముఁగల నేను చెండాడ గలనా? ఉపేక్షింపఁగలనా?

మ॥ కరవాలంబుధరించి నిష్కరుణమా ♦ కాంతావధాకార్య మె
క్కారణిఁ జేయఁగనేర్తు, నెవ్విధిని నీ ♦ కాలుష్యమీడేర్తు హా
పరమాత్మా! చెలికాని వెకయ కర ♦ ప్రాలంబ తీక్ష్ణాసికా
పరకాంతా నికురంబ కంఠ రుధిర ♦ ప్రత్యగ్రసత్కారముల్॥

దైవమా? పరమపవిత్రమగు బొబ్బిలిరావువంశమున కెట్టిచిక్కులు సమకూర్చుచున్నాఁడవు. నాకెట్టి దుష్కార్యము నియోగించితివి. రేచర్లగోత్రీయుల రాజ్యలక్ష్మి కెంతటి ప్రళయదినము సంఘటింపఁజేసితివి. ఎంత విచారకరము! ఎంత పరితాపకరము

తే॥ గీ॥ తీఱిపోవుచునుండె నీ ♦ దినముతోడ
బొబ్బిలికి రంగరాయభూ ♦ పునకుఁజెలిమి
గాలచక్రంబ! ఎంతవే ♦ గముగఁదిరుగు
చుంటివే? యీయఘంబర ♦ యుటకు బళిరె॥ 12

రంగా—మిత్రమా! ఏల జాగొనరింతువు. ఇది యాలస్యమొనరింపఁదగిన సమయముకాదు. ద్వారములన్నింటిని విరోధు లాక్రమింపక ముందె యంతఃపురమునకుఁ బ్రవేశింపవలయును. ఖడ్గమునకు శుద్ధాంతకాంతలరక్తముఁ జవిఁజూపవలయును.

చెలి—రాజా! ఈపాపకార్యమునకు నే నుపేక్షించిన నింక జేయువారెవరు? అవరోధస్త్రీల కేమేని గడసారి వార్తయున్న నెఱిఁగిం

పుఁడు. వారలకు వినిపించి పిమ్మట స్త్రీవధావిధానమున కొడం
బడెదను.

రంగా—మిత్రమా! నేను బ్రత్యేకించి చెప్పవలసినయంశము లేమియు లేవు. అయినను నామాటలుగ నిటులఁజెప్పుము.

మ॥ అనురాగంబునకున్ బ్రియంబునకుఁ బ్రే ♦ మావేశ సంసిద్ధికిన్
దినమే యంత్యదినంబు సాంఘికమ్మృతిన్ ♦ దేవుండుకల్పించె-ఓ
వనితారత్నములార? ఐహికపుసం ♦ బంధంబుతీరెన్ బలం
బునసే యింక బునస్సమాగమము-త్రా ♦ వుం డశ్రుగర్భాంజలుల్॥

చెలి—ఇంక నాకు సెలవొసంగుదురా?

రంగా—ఇదిగో కత్తిఁ దీసికొని పొమ్ము (ఖడ్గము నొసంగి)

ఉ॥ జాలివహింపకయ్య కలు ♦ షంబని దీనికిఁ బ్రాలుమాలి యీ
వాలునురిత్తసేయుటకు ♦ బాల్పడకయ్య! సతీమతల్లులన్
గూలుచుపట్ల నెమ్మదిని ♦ గుండు వహింపకుమయ్య గెల్వగాఁ
జాలమటంచు స్త్రీవధను ♦ సల్పఁగఁ బోఁగదవయ్య, నెయ్యమా॥

రంగా—మిత్రమా! నీరాకకు నిరీక్షించుచు యుద్ధరంగమున నుండెదను. వేగముగ నీకార్యము నిర్వర్తించుకొనిరమ్ము. ప్రకృతిసహజమగు ప్రేమానుబంధమున మైమఱచి యుచితధర్మమునఁ బ్రమత్తుడవు కాకుము. నీవరుదెంచువఱకు నీసైన్యము నేను నడుపుచుండెద.

చెలి—రాజా! ఈమానవప్రపంచమును ద్యజించు వఱకు బ్రేమానుబంధమును విడనాడవీలుండదు. సాధ్యమగునంతవరకు మెలకువతో విధాయకకృత్య మొనరించి సమ్ముఖమునకు వచ్చెదను. సెలవుబుచ్చుకొనెదను. (నిష్క్రమించును).

రంగా—ఇప్పటికి నాభారముతీరినది. తమ్మునకు రాజ్యాధిపత్య మొసంగితిని. భరించినను ద్యజించినను భారమువానిది. అవరోధ

సతీమ తల్లులకు విరోధులవలన హానిజరుగకుండ తగినయత్న మొనరించితిని. ఇప్పటికి సర్వవిధముల గృతార్థుడ. బొబ్బిలి కోట యెటుల జీర్ణదశకు వచ్చెనోయటులె విరోధులసైన్యము గూడ జీర్ణదశలోనికి వచ్చినది. నావార్తయే చేరి సుకృతవశమున బాపారాయఁడు రాజాంకోటనుండి సైన్యసహితముగ నరుదెంచె నేని ప్రతిపక్షులసైన్యమంతయు వినాశనముఁ గావింపవచ్చును. సుకృత మెటులున్నదో.

విజ— (నే పద్యమున).

శా॥ ఖడింపంబడెఁ గోటనల్ దెసలు పోం ♦ కంబాటెసైన్యంబు మా<br>
దండల్ దుర్గము లన్నిటిన్ దొలిచి శు ♦ ద్ధాంతస్థలిన్ జేరఁగా<br>
నుండెన్, మీకిఁక గెల్పు చేకుఱగ బో ♦ దో రంగ రాయా!సమిత్<br>
శౌండా! వీరుఁడ వైన నడ్డుపడుమా! ♦ శౌర్యంబుఁ జూపింపుమా.

రంగా—ఓహో! విజయరామరాజు ప్రగల్భోక్తులాయివి! విజయ రామరాజా! మురియకుము. సంతోషింపకుము. ఈవిజయము నీయదికాదు. పరాసువారలది. స్వతస్సిద్ధమగు పరాక్రమమె నీకున్న సరిహద్దులలోనున్న మాపై నిగతవఱకుఁ గత్తికట్టకుండ నుందువా? నీవురాజాధిరాజువె! బలశాలివె! అపరిమిత సేనా సహితుఁడవె. ఐన ఫలమేమి? నీయూహ్యాళ్లు పరవంచనాకార్యము నకుఁ బ్రసరించినటులఁ బరాక్రమప్రచారమునఁ జరింపవు. ఆంధ్రదేశమునందలి సుప్రసిద్ధ సంస్థానాధీశులలో నొక్కఁడవ వయ్యు దేశీయులలో నేశూన్యహృదయుఁడేని యొడఁబడని నైచ్యమునకుఁ బాలుపడుచున్నాడ' కావుననే నేఁడు నాపాలఁ బడ నున్నాఁడవు. ఓవిజయరామరాజా!

ఉ॥ వచ్చుచునున్నవాఁడ, భట ♦ వర్గముతోడుత కాఁచికొమ్ము, నీ<br>
యిచ్చకువచ్చినట్లు వచి ♦ యించిన మేలు లభింపఁబోదు, వి<br>
వ్వచ్చుఁడొ భీముఁడో హరుఁడొ ♦ భార్గవుఁడో మఱిరంగరావొ యీ<br>
వచ్చెడివాఁడటంచు రిపు ♦ వారము భ్రాంతిల విక్రమించెదన్॥ 16

ఓపద్మనాయక సైనికాగ్రేసరులారా! నావెంటరండు. మీ సైన్యమునకు నేను నాయకుఁడనై విజయరామ భూపాలు నెదిరించెదను. పోదమురండు.

(రంగారావునిష్క్రమించును.)

చతుర్థాంకము.

సంపూర్ణము.



శ్రీ ర స్తు.

# పా పా రా య ని ర్యా ణ ము.

## ప ం చ మాం క ము.

(రంగము. అంతఃపురము. మల్లమాదేవి చేటి ప్రవేశింతురు)

మల్ల—చేటీ! పిదప నేమైనది?

చేటి—ఆపరిచారకులవధించి వాండ్రవద్దనున్న జాబులఁ జూచి పాపారాయఁడు సేనాసహితముగ రాజాముకోటయందున్నటుల స్థిరముఁ జేసికొని సైన్యమునకుఁ బ్రోత్సాహవాక్యములు వచించుచు హైదర్ జంగు ద్వారములభేదింప నారంభించెను.

మల్ల—ఓసీ యుద్ధసమాచారములెటులున్నవి.

చేటి—ఇదమిత్థమని చెప్పరాని స్థితిలోనున్నవి. విరోధులంద ఱొక్కమాఱు బొబ్బిలికోట నాక్రమించి బురుజుల కెగఁబ్రాకుచుఁ బెక్కండ్రు యోధులఁజెండాడుచు ద్వారములభేదించుచు విక్రమించుచున్నారు. పద్మనాయకవీరులు సేనలతో విరోధులఁ జెండాడుచు బురుజుల రక్షించుచు విక్రమము ప్రదర్శింపుచున్నారు. వీరమాతలగు యువతీమతల్లులు పెక్కండ్రు బురుజులపై వసించి నూనెలగ్రాచి అంబలి యుడికించియు వైరిసేనపైజల్ల సాగిరి. మఱికొందఱు వీరాంగనలు బురుషులకు దోడుపడి యాయుధము లందిచ్చుచు శిబిరములఁ బరికించుచు మహిషాసురమర్దనియగు మహాకాళీ స్వరూపమున నటింపసాగిరి.

మల్ల—ఇపుడు సేనల నడుపుచున్న దెవరు?

చేటి—ఎవరో నడపిన ఇదివఱకె బొబ్బిలికోట విరోధులకు వశమైయుండెడిది. వీరపురుషాగ్రగణ్యుండు విక్రమధనుండు నగు రంగారాయభూమీశ్వరుఁడె నడుపుచున్నాడు.

మల్ల—యుద్ధము కడు భయంకరముగా నున్నదికాఁబోలు.

చేటి—అమ్మా చెప్పినతీఱునా? ఎటఁజూచిన శవములె. ఏమూలగాంచినను మొండెములె. ఏప్రక్కనరసినను రక్తప్రవాహములె. ఏవైపాలకించినను హాహాకారములె. యుద్ధరంగ మెంతభయంకరముగనున్నదన నేరితరము.

మల్ల—ఓసీ విరోధులకుఁ గోటనశమైనదా.

చేటి—మనవి చేయుచున్నదాన. పిరంగిగుండ్ల తాఁకుచే గోటయంతయుఁ గంతలుపడసాగెను. బురుజులు రక్షించుచున్న వీరభటులు గుహాముఖమును బాలించు కొదమసింగములవలె విజృంభించి విరోధులముందున కడుగుఁబెట్టనీయక ప్రాణంబులకుఁ దెగించి పోరాడసాగిరి. విరోధులు ప్రయోగించు నాగ్నేయాస్త్రముల వలన నెట్టియపాయము వాటిల్లునోయని మనభటులు కోట గోడలపైనున్న కప్పంనతయు బెరికివైచి సంగరరంగమున వీర మరణ మందసాగిరి. హిందూసైనికులయం దెన్నఁడుఁ జూచియెఱుంగని పరాక్రమము బొబ్బిలివారియెడల గానవచ్చుచున్నదని విరోధులు ప్రశంసఁ జేయసాగిరి.

మల్ల—నాప్రాణనాథుని మనోధైర్య మెటులున్నది? విజయము సాధ్యమని తలంచుచున్నాఁడా? నిరాశతో విక్రమముఁ జూపుచున్నాఁడా?

చేటి—విరోధుల విజృంభణము స్వసేనానాశముఁజూచి విజయముపై నాసవదలి సామ్రాజ్యసంరక్షణమొ స్వర్గవాసమొ యవశ్యకర్తవ్యమని చెలికానివెంకయ్యగారితో నేదియో మంతనములాడి కదనరంగము నలంకరించిరి.

మల్ల—(విచారముతో) ఇఁక నెక్కడివిజయమె? మనమూఁడువేల సైన్యముపైని విరోధుల పదకొండువేలసైన్య మెపుడుపడెనో

యపుడె బొబ్బిలిరాజ్యమునకు మనకుఁ బ్రాప్తముతీఱినది. ఇఁక మన కుచితవిధియెద్ది? అభిమాన సంరక్షణోమార్గమెద్ది?

చేటి—అమ్మా ఫలితాంశము తేటపడనిది మనము తొందరపడరాదు. ఒకవేళ మనకె విజయములభించునేమో యెవరుచూచి వచ్చిరి. గెలుపోటులు దైవికములుగదా?

మల్ల—ఓసీ! గెలుపే నిశ్చయమేని యిన్నియరిష్టములు సంభవించునా?

సీ॥ రణభేరిరవము దూ ♦ రంబుననుండి హా
హాకారములు సల్పు ♦ నట్లుతోఁచె
సిరినటించెడి యంతి ♦ పురి యంగణముల్లోఁ
బాడిండ్లరీతిఁ గ ♦ న్పడఁదొడంగె
వెలమవీరుల గృహం ♦ బులకడ నపజయం
బాకృతి వహియించి ♦ నట్టులుండె
గులపాలికల ముఖం ♦ బులు మృత్యుదేవతా
నిలయంబులట్లు గ ♦ న్పింపసాగెఁ
తే॥ గీ॥ గారణములేక మదిలోనఁ ♦ గంపమలమి
యంగకములందు నీరస ♦ మతిశయించె
నతివ! బొబ్బిలికే జయం ♦ బగునయేని
వైపరీత్యంబు లిట్లు చూ ♦ పట్టఁగలవె॥ 1

చేటి—అమ్మా! మనసున నేదియో విచారమున్నప్పుడు మనము కాంచు మంచివస్తువులుకూడ వికృతముగ గానవచ్చును. దూర దృష్టి లేనపుడవి యన్నియు నాత్మీయములని తోఁచుట సహజము. మఱియు.

ఉ॥ వందురఁ బోకుమమ్మ ప్రతి ♦ పక్షుల కుంగెలు పబ్బలేదు, రా
జేంద్రిర సత్కృపా విభవ ♦ మే! మనకుంజయమిచ్చు, వైరులన్
జిందర వందరన్ సలిపి ♦ చెండుచునుండిరి వెల్మవీరు లీ
వెందులకమ్మ! యిట్లు వహియించెదు చిత్తగ శోకభావమున్.

మల్లు—మనకేది యలభ్యమె దానిపైని నిరాశాజనకములగు మనోభావము లుత్పన్నములగుట సహజము. నాహృదయమున జనించు పరితాపాతిశయమె మనకపజయము కలుగునని యుద్బోధించుచుండ నేల వ్యర్థముగ భాషించెదవు.

చ॥ వెలమకొలంపు శౌండ్రి రణ ♦ వీధిని గెల్పుల నందువేళ హృ
జ్జలరుహమందు ధైర్యము పొ ♦ సంగె నకారణ జన్యమై విరో
ధులిపుడు విక్రమింప నెద ♦ దుఃఖము గప్పెద నంత, నెందుఁగా
గల విధులాశయంబునకు ♦ గన్పడసాగు యథావిధంబుగన్.

చేటి—అమ్మా! మీరింత నిరాశ నొందవలసిన యవసరములేదు. విజయలక్ష్మి యింతవఱకు వెలమశూరుల మండలాగ్రమున నటించుచున్నది, మనము దోషశూన్యులముగాన గెలుపు నందవచ్చునని మనసైనికులు భావింపుచున్నారు. ఈప్రళయసంగ్రామమునకు విజయరామరాజె కారకుడుగాన నాతనిచెంతకు మీరు కదనము మాన్పుమనియు సంధువిలయమును దొలగింపుమనియు వార్తఁబంపుట యుక్తము.

మల్లు—ఛీ! రాకాసీ! ఉత్తమ పౌరుషాభిరామమగు వెలమకులమున బుట్టి శూరచూడామణియగు రంగారాయుని చెట్టబట్టి. విరోధి దుస్సాధ్యమగు బొబ్బిలిరాజ్యమునకు రాజ్ఞినైన నన్ను విజయరాముని యాచింపుమనుచున్నావా! సామ్రాజ్యము శాశ్వతముగాదు. జీవితము శ్వాశతముగాదు. నీవిట్టి విపరీతోక్తుల భాషింతువేని క్షమింపను.

చేటి—అమ్మా! నాసాహసమునకు మన్నింపుఁడు. ఆపత్కాలముగాన దోచక యిటుల వాకొంటిని. కదనరంగమునుండి స్థిరమగు వర్తమానము వచ్చువఱకు మీరుపేక్షింపుడు. రంగారాయ ప్రభువర్యుడు విజయ మలభ్యమని యూహించెనేని యంతఃపురాంగనల గతి విచారింపక పోడు. దైవకృప యున్న విజయము దుస్సాధ్యముకాదు.

మల్ల—ఓసీ నీవునాకిఁక సుయుక్తుల బోధింపకుము. కోట బగిలిపోవు చున్నదనియు రంగారాయ నృపాలుండు విజయముపై నాస వీడి విజృంభించుచుండెననియు దెలిసికొంటిమి. ఇక నెందులకీ పేరాస! అంతఃపురాంగనలకు దేవుఁడు సంఘమృతి విధించి యున్నాఁడు. ఇంతకంటె నీజన్మమును సుకృతము బడయఁ జాలము.

మ॥ అదిరాజన్యులు గెల్పులన్ బడసి శు ♦ ద్ధాంతస్థలిన్ జేరనుం
డిరి బ్రాణంబులఁ దాల్చుచో ఫలము లే ♦ నేలేదు, తీక్ష్ణాసి చే
శిరమున్ నాకయి నేనె త్రెంచికొని నా ♦ జీర్ణాంగమున్ జ్వాలికా
పరిణద్ధంబగు లీతి హుతాత్రమున నే ♦ భస్మంబుఁ గావించెదన్. 4.

పద్మనాయక కులాభరణలగు నుత్తమకాంత లందరికిందులకు సిద్ధము కాకపోరు. విజయాంతమున విరోధులకు లభింప దగినది పద్మనాయక శిశుబాలికా కాంతాభస్మా వృతంబగు నంతఃపురము వీరవర్య శవానేక పూరితంబగు బొబ్బిలిరాజ్యము మాత్రమె! ఓసీ! నాగారాబముల కాణాచియగు నాముద్దులయ్య నొక మాఱు తీసుకొనిరమ్ము. వానినొక్కమాఱు గాఢాలింగన మాచరించికొని నీకుఁ జెప్పదగినసంగతుల జెప్పి నాయనకు స్వర్గవాసముకొఱకు నాయంతఃకరణముచే మార్గ మేర్పఱ చెదను.

చేటి—అదిగో: చిన్నబాబయ్యగారికె దయచేయుచున్నారు.

చినరంగారావు (ప్రవేశించి) అమ్మా గుమ్మముదగ్గఱ తుపాకులు వేయుచున్నారు. నాన్నగారందఱిచేతను సాములఁ జేయించుచున్నారు. నేను చూచి వచ్చుచున్నాఁడను.

మల్ల—నాయనా! ఒంటరిగ నటుల బోబోకుము. తండ్రీ! ఊరినిండ బూచి వాండ్రున్నారు. చిన్నపిల్లకాయల బట్టుకొనిపోవుదురు. అందుల కనియె కోటగుమ్మములవైచి మేమందరము లోపలనున్నారము.

చిన్న—నాన్నగా రాబూచివాండ్రతో యుద్ధముచేయుచున్నారు. పాపారాయడుమామయ్య రాజాంకోటకు నెందుకుపోయి నాడు. నాకుఁ దుపాకులఁ జెప్పుటకా!

మల్లు—నాయనా! నీముద్దుమాటల నాలకించుట కేని నోచకపోతిని. నీకు నాకు దైవమీవియోగము విధించియుండఁ దప్పింప నేరితరము (కనుల నీరుతుడిచికొని) ఓసీ! చేటీ! మాకందఱకు మరణము విధాయకమై యున్నది. ఈయాకస్మిక మరణమునుండి నాతండ్రిని రక్షించుటకు నీవుపూనుకొనవలయును.

శా॥ రంగారాయని వంశపుఁ మొలక నీ ♦ రాకూన నెట్లైయిన నా
యంగీకారమునిచ్చగించి కుశలం ♦ బొఱంగ, సామర్లకో
టం గూఢమ్ముగఁ జేర్చి, పిన్నతలియిం ♦ టఁ నిల్పి రావమ్మ! యీ
బంగారయ్యయె రావువారి కులముఁ ♦ బాలింప నర్హుండగుఁ.

చేటి—అమ్మా! రాణివాసపు సతుల కింతలో నెట్టియాపద రాజాలదు. మీప్రాణము లశాశ్వతమని యీపసికూనను కాననిక్రంతల కంపకుడు. మనరాజ్యము చుట్టు విరోధి సేనలు నేలయీనినటు లున్నవి. ఎవరుచూచిన నీబిడ్డ కెట్టి విపత్తు తటస్థించునో! అమ్మా! యీశిశువును మీరె సంరక్షించుట ధర్మము.

మల్లు— ఓసీ! మేము రక్షించు దినములలో మాశిశువుల నీచేతిలో బెట్టితిమటే. నాకన్న తండ్రిని చేతులార చంప నేరక రక్షణము చేయుమని నీకొసంగఁ బ్రతికూలించెదవా? కానిమ్ము. మావ లెనే వీనికిగూడ నాయువు స్వల్పకాలము గావలయును. కాకున్న విధేయు రాలవగు నీకిట్టివిపరీతాభిప్రాయము కలుగునా!

చేటి—అమ్మా? మీరుశిశువు చెంతనున్న ఆత్మహత్య మానుదు రేమో యని యిటుల భాషించితిని. బిడ్డ నొసంగిన యవశ్యము సామర్లకోటకు జేర్చెదను. ఆయువున్నంతవఱకుఁ గుమారున కెట్టి యాపద రాకుండ గాపాడగలను. దేవీ!

ఉ॥ ప్రాణమురీతి నీతనయు ♦ భద్రముగాఁ గొనిపోయి యెట్లొ స్వ
స్థానము జేర్చుదాన రిపు ♦ జాల్ముల వంచనఁ కేయుదానఁ గ
ర్మాను భవంబుచే మనర ♦ హాస్యము వైరులెరింగిరేని నీ
సూనుని బ్రోచి మార్తురకుఁ ♦ జూపెద మత్కరవాలతీక్ష్ణముల్॥

మల్ల— (బిడ్డనురాఁదీసిఁ) తనయా! ఈ నిర్భాగ్యురాలు దురదృష్టవంతురాలు నిన్ను విడచి స్వర్గమున కేగనున్నది. తండ్రీ! కడసారి ముద్దు నాకొసంగుము. (ముద్దుఁగొని) నాయనా! నీపైగల ప్రేమానుబంధము నేఁటితో తొలగించుకొనుచున్న దాన! మన్నింపుము.

సీ॥ ఆంధ్రవాఙ్మయ సేవకై నీదు ♦ సర్వస్వ
ముసు ధారవోసి ♦ పేర్గనగదయ్యా
పద్మనాయక వీరవర్యుల ♦ విక్రమ
మహిమంబు గలనైన మఱువకయ్యా
విజయరాముని జెండివేసి ♦ యానెత్రుచే
పిండకంబులు సమర్పింపుమయ్యా
రేచర్ల గోత్రంబు ♦ నీచరిత్రముచేత
విఖ్యాతికరము గావింపుమయ్యా

తే గీ॥ అంత్యమున నేని ♦ ఖండాంతరాగతులకు
జనువు నించుక యేని ♦ యొసంగకయ్యా
జీవితమె క్షాత్రమునకె ♦ వెచ్చింపుమయ్యా
పోయిరావయ్యా విజయంబుఁ ♦ బొందుమయ్యా॥

చిన— అమ్మా! విచారపడకుము. నీవూరికి బోయెదవా? పోయిరమ్మా, నన్నెక్కడకోఁ బొమ్మని సెలవిచ్చుచుంటివే! యుద్ధమునకా! ఆఁ పోయెదను. ఆజ్ఞయిమ్మా.

మ॥ కరఖంగత్తి యొసంగి వైరులను జ ♦ క్కాడుంగఁ బొమ్మందువో
దురమం దయ్యకుఁదోడుఁ బొమ్మనెదవో ♦ దుర్మార్గులా వారలన్

నటుకటా బొమ్మనెదో వచింపగదవే ♦ నాతల్లి నాచెల్మి కాం
ద్రరుగో వారలగూడి నాన్నకు సహో ♦ యంబింకగావించెదన్. 8

చేటి— నాయనా! యుద్ధము భయంకరముగా నున్నది. మీనాయన గారి యొద్దకు నీవుజనవీలులేదు. నీవిక్కడనున్న బూచివాండ్రు పట్టుకొని పోవుదురు చూడుము. నీచెలి కాండ్రందఱు భయపడి యిండ్లలోనున్నారు. మనము సామర్ల కోటకుఁ బోవు దమురమ్మా.

చిన—ఛీ! చెడుఁగా! నన్ను మాయచేసి యెచ్చటికో తీసికొని పోవ నున్నావా? నేను సామర్లకోటకు రాను. నీ కవసరమున్నఁ బొమ్ము. అమ్మా! దాయి నన్ను సామర్లకోటకుఁ దీసికొని పోవునఁట. నీవు వలదని మందలింపుము. ఓదాయీ!

సీ॥ అరుల మొగ్గరమున ♦ జరియించుచున్న మా
బాబయ్యగారల ♦ పజ్జకైనఁ
పేరోలగఁపుఁబనుల్ ♦ దీఱుచుచున్న మా
చిన్నయ్యగారల ♦ చెంతకైన
రాజాముకోటను ♦ రక్షించుచున్న మా
పాపయ్యమామయ్య ♦ ప్రక్కకైనఁ
కదనరంగంబునఁ ♦ గత్తులదల్చుచు
వెలమవీరులు నిల్చు విడిదికైన
తే॥ గీ॥ బోయెదను నన్నుఁబిల్వకు ♦ పొమ్ముపొమ్ము
నేను సామర్లకోటకు ♦ రానురాను
అమ్మ! సెలవీయవమ్మ ♦ యుద్ధమ్ముఁజేసి
నిముసమునవత్తు నీదుపా ♦ దములదఱికి॥ 9

మల్ల—నాయనా! నే నమ్మనుకాదా! నామాట వినవా! నీవు దాయి తోఁ చిన్నమ్మగారి యింటికిఁబొమ్ము. అచ్చటఁ గత్తులు తుపా కులు విల్లనంబులు కలవు నీవు బాగుగ యుద్ధము చేయవచ్చును. నాలుగైదు దినములలో మేమును వచ్చెదము.

చిన్న—నేను సామర్లకోటకుం బోయెదనుగాని మీరచ్చటికెప్పుడు వచ్చెదరు! వచ్చునపుడు నాకుఁ గత్తులు దుపాకులుఁ దెచ్చెదరు కద!

చేటి—నాయనా! నీకుఁ గత్తులు దుపాకు లచ్చటఁ గావలసినన్ని కలవు. చిన్నమ్మగారికి పిల్లకాయలతో బాగుగ నాడుకొనవచ్చును. మీయమ్మగారు రెండుమూఁడుదినములలో సామర్లకోటకు దయచేయుదురు, ముందు మనము పోవుదము.

మల్ల—(దుఃఖముతో) ఆత్మజా! ఇదియె నీకు నాకుఁ గల యనురాగబంధమునకుఁ దుదిదినము. నేటితో మనకుంగల యిహలోకబాంధవ్య మంతరించుచున్నది.

సీ॥ పరువంపు లేనవ్వు ♦ మురుపుఁజూపెడి నీదు
నిద్దమౌ మేల్చెక్కు ♦ టద్దములును
దమ్మిఱేకులకు నం ♦ దము చందముంగూర్చి
క్రాలునీ నిడువాలు ♦ కన్నుదోయి
నిండుచందురుని కాం ♦ తని నెక్కసక్కెంబుఁ
బొనరింపఁజాలు నీ ♦ ముద్దుమోము
విలువంపులై చెలు ♦ వులుగ్రుమ్మరించి సో
గలుదేరితనరు నీ ♦ కన్నుబొమలు
తే॥ గీ॥ కడిఁది గేదంగిచెండుల ♦ నడిమిరేకు
మిసమిసల నవ్వఁజాలు నీమేనిచాయఁ
జూచి సంతోషమందఁగా నోఁచనైతి
ముద్దులకుమార ఇఁకనైనఁ ♦ బోయిరార॥

చేటీ! బాలుని సంరక్షించుభారమంతయు నీతలపైఁగలదు. పరమాత్ముని యనుగ్రహమువలన నీశిశువె జీవించెనేని రావువంశము నిలుచును. దైవవిధి యెటులున్నదో.

చం॥ మనదగు రావువంశమను ♦ మామిడిమోఁక చివురించినట్టి క్రొ
న్నన, కొలమన్న తమిపువు ♦ నక్క జెలువొవిరి దేనె, మల్లమా
జననియు రంగరాయపతి ♦ సల్పిన నోములపంట నీకుమా
రుని యిదెనీకొసంగితిని తోఁచిన జోఁచిన నీవెచేటికా. 12

చిన—అమ్మా! నాకొఱకై మీరు విచారపడవలదు. నేను సామర్ల కోటలోనున్న నన్నఁతోడను చెల్లెండ్రతోను గలసి యుందును. అమ్మా! పోయివచ్చెదను.

మల్ల—నాయనా నీముద్దుముచ్చటలు జూచుటకు మీపిన్నమ్మయే నోచుకొన్నది. పోయిరమ్ము. యెచ్చటనైననేమి. బ్రతికి బట్టగట్టిన నంతియచాలును.

చేటి—అమ్మా! నేను సెలవు పుచ్చుకొందును. మీదర్శనము మరల నెచ్చటనో.

మల్ల—స్వర్గమునసనే! పరలోకవాసమునకు సర్వసిద్ధముగానున్న మీయక్కగా రిటులఁజెప్పిరని నాచెల్లితో నెఱిగింపఁ గోరుచున్నదానను. సోదరీ!

సీ॥ కసుపసిపాపఁడా ♦ కలికిఁ దాళఁగలేఁడు
కడుపుననిడి వీనిఁ ♦ గాంచుమమ్మ
బుడుతండు పిల్లిపేరి ♦ వులవాడు కావునఁ
గనలి యెన్నండేని ♦ కసరకమ్మ
నీకునాకునుగల ♦ నేస్తంబుఁ దలపోసి
యూరకమది దిగు ♦ లొందకమ్మ
పసివానిబ్రతికించి ♦ వంశంబునిల్పి
నాయాశీర్వచనముల ♦ నందుమమ్మ.

తే గీ॥ మరల నీయుత్తరము వచ్చు ♦ వఱకు మేము
బందుగులతోడ స్వర్గాన ♦ నుందుమమ్మ

కరుణవిడకమ్మ! సుతుని యే ♦ మరకుమమ్మ
బాలుబ్రతికింపుమమ్మ! నీ ♦ భారమమ్మ.

చేటి—(కన్నీరు తుడిచి కొనుచు) నాయనా పోదమురమ్ము. అమ్మా! ఆజ్ఞతీసికొనెదను.

చం॥ కడుపున మమ్ముఁబెట్టుకొని ♦ కాచితివింతటిదాక తల్లి? యీ
యిడుముల చేత నిన్ను విడి ♦ యేగుచునుంటిని నేఁడు; కూరిమిన్
విడువకమమ్మ! ప్రాణముల ♦ వీడకయుండిన నెన్నఁడేని నీ
కడ కరుదెంతునమ్మ! కడ ♦ కాళ్లకు మ్రొక్కెదనమ్మ సాధ్విరో॥

(చినరంగారావు చేటి నిష్క్రమింతురు)

మల్ల—ఇప్పటికి నాభారము తీఱినది. నాకు సర్వవిధులఁ కృతార్థత లభించినది. దైవవశమున నాతనయుఁడు విరోధులకుఁ జిక్కకున్నయెడ మావంశము నిలచును. నాకంతకంటెఁ గావలసినదేమున్నది. పద్మనాయక వీరుల బలంబులు వినాశనము కాకముందె! రంగారాయ భూమీశ్వరుండు విరోధులకు వశముకాకముందె యవరోధసతీమతల్లులు శిశుసహితముగ స్వర్గమలంకరింపకముందె నేను పరలోకము నలంకరించుట కర్తవ్యము. (ముందునకుఁజూచి అదిగో! చెలికాని వెంకయ్యగారిటు వచ్చుచున్నారు. ఆయనవలన యుద్ధసమాచారము లాలించుటయె తడవుగ సంకల్పమును నిర్వహించి శాశ్వతలోకవాస మనుభవించెదగాక.

(చెలికాని వెంకయ్యప్రవేశించి) అక్కటా యీపాపకార్యమెటు లొనరింపనేర్తును. దయాదాక్షిణ్యములఁ బోనాడి యెటుల నిర్దోషిణులగు నవరోధ సతీమతల్లుల జెండాడెదను. ఎటులఁ బ్రభునియాజ్ఞ నిర్వర్తించెదను. అక్కటా! యీపాపపుఁజేతఁ జేయుటకు బ్రహ్మ నామనస్సు రాతిఁజేసియుండును. కావుననే యింతదుర్భరకార్య మొనరింపనున్నను నాహృద

యము ప్రయత్నములుకాక యథావిధముగ నున్నది.. ఈపాపాత్ముఁడు ఈయవరోధాంగనా ఖండన వ్రతుఁడు, వీరపురుష విగ్రహశుద్ధాంతాంగనా సంహరణ దుష్కార్య నియుక్తుఁడు విరోధుల శతఘ్నులకు ముందె యెఱయైయున్న యీపాపకృతి యొనరింపక తప్పనుగదా! (చూచి) అప్పుడె యంతిపురికి వచ్చితిని. ఇఁక నీకఠినకార్య విధానమునకు విరామము లేదుకాఁబోలు (ముందునకుఁజూచి) అదిగో మల్లమాదేవి యిచటనేయున్నది. నేనీ పాపకార్యమునకుఁ బాలుపడితినని యీయమతో నెటులవాకొందును? ఎటు లుపేక్షింతును. దైవమా రావువంశమున కెట్టియవస్థఁ దెచ్చిపెట్టితివి. రంగారాయని కుటుంబమున కెంతటి యకాలమరణము సమకూర్చితివి. విధీ నాకెట్టి పనినియోగించితివి.

మల్ల—అగ్రజా! అభివాద మొనరించుచున్నదానను. రణరంగమున నందఱు కుశలముగనున్నారా? యుద్ధమెటులున్నది?

చెలి—విరోధుల శతఘ్నుల కెదురునడుచు బద్ధ్రనాయకవీరుల కుశలవార్త నెటులెఱిగింపవలయును. యుద్ధఫలితము విరోధుల కనుకూలముగ నున్నది మనసైనికబలము చాలవఱకు గతించినది. బొబ్బిలి రాజ్యలక్ష్మి విజయరామరాజును వలచినటులున్నది.

చం॥ బురుజులు కూలుచున్నవి చ ♦ మూబలమెల్ల నశించుచుండె మా
ర్తురు చెలరేఁగి యంతిపురి ♦ దూరఁగనుండిరి రంగరాయ భూ
వరుఁడిఁక నేఁటిగెల్పనుచు ♦ వాకొనెసాగె; విరోధులకే జయెం
దిర వరియింపనున్నది స ♦ తీ! ఇఁకనేమని విన్నవించెదన్॥ 15

మల్ల—అక్కటా! నాహృదయమునఁ బుట్టిన పరితాపము సహేతుకమైనదె. ఈరావు వంశ నిర్మూలన కర్మకుఁడు పరజనవంచనా భావుఁడు చలచిత్తుఁడు నగు విజయరామరాజు సంధికేమేని యంగీకరించునేమొ ప్రయత్నించితిరా!

చెలి— అమ్మా! చేయఁగల ప్రయత్నము లన్నియు నిదివఱకే చేసితిమి. స్వనాశనమునకు స్వసేనా నాశనమునకు జంకని విజయరామ రాజు సంధి కంగీకరించునా! అంగీకరింపఁడు. అతని నావేశించిన దుష్ట గ్రహము లంగీకరింపనీయవు.

మల్ల— పద్మనాయక సాధ్వులలో సంగ్రామ విద్యయం దారితేరిన వారలు పెక్కండ్రు కలరు. వారలందఱు గలసి యుద్ధరంగ మలంకరించినచో బాగుండునది. రాణివాస మాపాటి స్వతం త్రమును గటాక్షింపదా!

చెలి— అమ్మా! ఆచారములకు దేశకాల పాత్రములె లక్ష్యములు. సంఘ విలయము సంభవించి నపుడు కూడ రాణి వాసమా! విరోధుల విజృంభణము నంతయు నెఱింగి యపజయము నిశ్చయ మని తలంచి పద్మనాయక వీరకాంతలు యోధ వేషముల ధరించి మల్లమాదేవిని ప్రత్యర్థులు కన్నెత్తి చూడకుండ జేయుట ధర్మమని సభావేదిక చెంతనున్న బురుజుపైఁ జేరిరి. ప్రళయకాల కాళీ స్వరూపమును దలపింప జేయుచు వీరకాంతలు దుపా కుల బ్రేల్చి యీటెలతోఁ బొడిచి ముష్టాముష్టి బోరాడి ప్రత్య ర్థిలోకమును బంచబంగాళము గావించిరి.

మల్ల— సతీ మణులారా! మీజన్మము సార్థకమైనది. మీజీవితము పవిత్రమైనది. వీరవర్యులకు గూడ మీసాహసము గుణపాఠము గావించుచున్నయది. భర్తృశాసనమున్న నేను మీకు సహా య పడు దాననే. అంతటివిశ్రాంతి లేదయ్యె. అగ్రజా అనం తరమేమైనది.

చెలి— విజృంభించి సహస్ర ముఖముల నరాతులను వీరపత్నులు దునుమాడుచుండ సిగ్గు చెడి నిలువనేరక యంతఃపురాభి ముఖు లైన భటులందఱు వెన్నిచ్చి పాఱి విజయరామరాజు బుస్సీ హైదరుజంగులతో దమ దుర్గతిని చెప్పికొనిరి. నిర్గయా

స్వభావులు పౌరుషశూన్యులునగు నాముప్వురు వచ్చి చూచి చేయునది లేక నలువైపుల నాలుగుఫిరంగుల బెట్టించి ప్రేల్పించిరి. బురుజుపైనున్న వీరపత్నులందఱు నేల గూలిరి.

మల్ల—ప్రత్యర్థినృపులారా! ఛీ! ఛీ! మనుష్య రూప రాక్షసులగు మీకు జ్ఞానము లజ్జ కొలందియగుటలో నాశ్చర్య మేమున్నది! ఆఁడువాండ్రతో నెదిరి పోరాడలేని మీబ్రతుకులు కాల్పనా! పౌరుషహీనులై స్త్రీవధ యొనరించి యేమొగమున దలయెత్తి సిగ్గువిడచి దిరుగుచుంటిరో నాకాశ్చర్యమాగ నున్నది. సంగ్రామమున నాకుత్సాహమగుచున్నది.

ఉ॥ శాతకృపాణ హస్తనయి ♦ శత్రుసమూహమునందు జొచ్చి సా
ధ్వీ తిలకాభినంద్యమగు ♦ వీరవిహారము నాచరింపఁగాఁ
చేతము తొందరించె రణ ♦ సీమకు జేరిన వైరి సైనిక
వ్రాతముతోడఁ బోరుటకు ♦ వల్లభు నాజ్ఞను గోరమానితిన్॥

చెలి—సాధ్వీ! నీ సాహసము శ్లాఘనీయము. ఉత్తమ రసపుత్రకాంతామ తల్లులయందు బ్రతిఫలించు పరాక్రమరసము నీయందుఁ బ్రతిబింబించుచున్నది. వీరకాంతల శిక్షాలాఘవము రణరంగంబునఁ బ్రదర్శింపదగని యీపాపపుగాలమున మీకు దేహత్యాగముదప్ప వేఱుత్రోవలేదు. రంగారాయ భూమీశ్వరుండు నాకీకరవాలము నొసంగి యంతఃపుర ధర్మముల నెఱవేర్పుమని పంపియున్నాడు.

మల్ల—ప్రాణనాయకుని యాజ్ఞకు భిన్నము జరుగునా! అగ్రజా! ఆకరవాలము నిటు తెమ్ము. ఒకమాఱు గాఢాలింగన సౌఖ్యమున మైమఱచెదను. (తీసికొనబోయి)

సీ॥ శ్రీరంగరాయ ధా ♦ త్రీనాథు దక్షిణ
కరమునందు నిగని ♦ గలను జూసి

పరిపంథిభూపాల ♦ పటలకంఠాశ్లేష
పరమసౌఖ్యా నంద ♦ గరిమనొంది
పద్మనాయక వీర ♦ వర్యసేవితమైన
రావువంశమునకుఁ ♦ జేవగూర్చి
జన్యరంగంబున ♦ జయలక్ష్మిని వరించి
యతులసౌజన్య సౌ ♦ ఖ్యముల దేలి,
తే గీ॥ ఇంతదనుక విరోధి దే ♦ హాంతరములఁ
బొదలు క్రొన్నెత్తురుల్ దాగి ♦ మదముఁ గనిన
ప్రాణనాయక దత్త శి ♦ తాసికిదియు
కంఠమొసగెద స్వర్గభో ♦ గముల గనెద. 17

అగ్రజా! నా ప్రాణనాయకుఁడేమేని నాకు గడసారివార్త నెఱింగించి యున్నచో దెలుపుము. వినుటయె తడవుగ నిహలోకమును బరిత్యజించెదను.

చెలి—అమ్మా! ఇంతకుఁ దెగించినవాడను నీప్రాణనాయకుఁడు నీకెఱింగింపుమనిన కడసారివార్త నెఱింగింపక పోవుదునా! ఆలకింపుము.

మ॥ అనురాగంబునకున్ బ్రియంబునకుఁ బే ♦ ర్మావేశ సంసిద్ధికీ
దినమే యంత్యదినంబు సాంఘిక మృతిన్ ♦ దేవుండు కల్పించె ఓ
వనితారత్నములారా ఐహికపు సం ♦ బంధంబు తీఱెన్, బరం
బుననే యింక బునస్సమాగమము తా ♦ వుండశ్రుగర్భాంజలుల్. 8

అమ్మా! ఇదియే నీభర్తృ సందేశము.

మల్ల—నాయకా! ఇట్టి యంత్యవార్తఁ బంపుటచే నీహృదయ మెంత చింతా తరంగిత మయ్యెనో కదా! మాతో బాటు నీకీ యకాల మరణము దాపరింప నుండెనా,

సీ॥ కులముద్ధరింపగాఁ ♦ గల నీదుముద్దుల
తనయుని రంగ రా ♦ యని త్యజించి
అనయ మభేదవృ ♦ త్తిని వెన్ను బాయక
మెలగు వెంగళరాయు ♦ చెలిమిపీడి

తొలుతనుండియు వెల్మ ♦ దొరలకాణాచియై
రాజిల్లు బొబ్బిలి ♦ రాజ్యమువిడి,
పరమసౌభాగ్యసం ♦ భరితమై తనరారు
భారతమాత సే♦వనము వదలి,

తే గీ॥ సర్వభోగంబు లందగా ♦ జాలు నీవె,
స్వర్గభోగంబులందగా ♦ సాహసింప,
బ్రతికి నేనొందవలసిన ♦ ఫలములెవ్వి,
రమ్యసద్గుణ సముదాయ! ♦ రంగరాయ! 19

అగ్రజా! ఆలస్య మొనరింపకుము. నాప్రాణనాయకునియాజ్ఞ దాటరానిది. ఖడ్గమిటు దెమ్ము. నాకుత్తుక నేనె త్రెంచికొనెదను.

చెలి— అక్కటా! ఎంతటి విచారకరమగు కార్యమునకు సాహసించుచున్నాఁడను. ఓకరవాలమా? అవరోధస్త్రీ వధకు తొందరపడుచుంటివా! ఏమీ నీసాహసము!

తే గీ॥ కఠిన కర్కశ రిపురాజ ♦ కంఠదళన
భయద కర్మంబునకు నీవు ♦ పనికిరావు
ఖడ్గమా! యింకమార్దవ ♦ కలితములగు
చిగురుఁ బోడుల కుత్తుకల్ ♦ జెండఁబొమ్ము.

(మల్లమాదేవికి ఖడ్గము నొసంగును).

మల్ల— (ఖడ్గము జేకొని) ఓకరవాల రాజమా! నాయకుని కరగ్రహణము నొంది నాకాశ్లేష సుఖమొనగూర్ప వచ్చితివిగాని, నీవు స్త్రీ వధకు వచ్చియుండవు. ఒక్కమాఱు నాకంఠమును గాఢాలింగన మొనరించు కొనుము. నాకు సుకృతము లభించును. (అట్లు చేయుచు)

సీ॥ వెలమ వీరుల బలంబులు ♦ రూపుమాసె నక్క
ఱు కఠినోక్తి విన ♦ బడకమున్నె

రంగావనీభర్త ♦ రాజ్యరమా కటా
క్షములకు దూరంబు ♦ గాకమున్నె
మార్తుఁడు పసివాని ♦ మార్గమధ్యంబున
జేకొనిరను వార్త ♦ రాకమున్నె
అంతిపురంబున ♦ కరులేగుదెంచి దు
ర్ఘటకార్యముల నొన ♦ ర్చుటకుమున్నె

తే గీ॥ ప్రాణనాయక దత్తమై ♦ నట్టి నిశిత
ఖడ్గమున నాకునేనయి ♦ కంఠనాశ
మతుల శౌర్యంబుమీఱఁజేం ♦ డాడికొనెడి
భాగ్యసంసిద్ధిఁ గంటి స ♦ ద్వార్తవింటి. 21

చెలి—సోదరీ! మమ్మువిడచి పరలోకమున కేగుచున్నావా! ఎంతకష్ట
ము, ఎంతకష్టము.

సీ॥ పటుపరాక్రమ రసా ♦ స్పదులగు పద్మనా
యకుల వంశంబునం ♦ దవతరించి
రణవిహారమునఁ జే ♦ ర్వడిన రంగావనీ
ధూర్వహుఁ బ్రేముడి ♦ తో వరించి
సామంతరాజుల ♦ జాయలయూడిగ
మ్ములనెల్ల గన్న స ♦ న్నల గ్రహించి
అరిరాజ దుస్సాధ ♦ మైనబొబ్బిలిరాజ్య
లక్ష్మి కారుణ్యాఫ ♦ లంబుగాంచి

తే గీ॥ సర్వవిధముల జనముల ♦ సంస్తుతులకుఁ
దగినదాన వఁటంచనఁ ♦ దగిననీవె
యస్తమించిన నెవ్వని ♦ కస్తమింప
నాశయము కల్గదమ్మ! మ ♦ ల్లమ్మదేవి. 22

మల్ల—అగ్రజా! అధీరోచితముగ భాషింపకుము. ప్రేమానుబంధముల
కిది యదనుకాదు. ఆత్మరాజ్యమునకు బ్రాణముల నర్పించుట

మీ కేతుల సహజవిధియో యభిమానసంరక్షణమునకు బ్రాణము లర్పించుట మాకు నటులె సహజవిధి. నీవవరోధకామినుల నందఱ శిశువృద్ధసహితముగ వధించి మరణాంతమున విరోధులు శవములనేని గాంచకుండుటకు దహనవిధిఁగూడ నెఱవేర్పుము. ఈవిలయకారకుడగు విజయరామరాజు నిటులశపించి నాకంఠము నఱకికొనెద. సాధ్వీశాప మూఱక పోదు.

శా॥ ఏనశ్రాంతమునాయకాంఘ్రియుగళీ ♦ సేవారాళి భక్తిప్రత
జ్ఞానప్రాభవనేని, మామకమనః ♦ శాంతుండువిష్ణ్వర్చనా
ధీనస్వాంతపయోజుఁడేని, అజయా ♦ ప్తిన్ రామధాత్రీశుఁ డీ
స్థానంబందుక పద్మనాయకుని చే ♦ తన్ బ్రాణముల్ వాయుతన్.
హా శ్రీహరీ. హా పరమే...శ్వ...రా

(కంఠము నఱకి కొని పడిపోవును)

చెలి—అక్కటా! బొబ్బిలిరాజ్యమున కింతకంటె వినాశన మేమి కావలయును?

ఉ॥ చేతులమీద నెవ్వతెను ♦ చెల్లియటంచును బెంచినాడనో
యాతలిరాకుఁ బోడిని గు ♦ ణాకర నిప్పుడ కూల్చినాఁడఁ జే
చేతుల, నింత నావలనఁ ♦ జేయగరాని దురంతకర్మము
న్నే తరుణీవధంబుఁ గన ♦ నేర్చితి నిప్పటికీవిధంబుగన్ 24

ఇఁక నాలస్యమొనరింప దగదు. మల్లమాదేవి యుపదేశ వాక్యములె స్మరించుచు శేషించిన యవరోధ కాంతావధయు సమాప్తినొందించి రంగారాయుని కీశుభవార్తఁ వినిపించి సాధ్వీరక్తపూరితమగు కరవాలముతో విరోధులఁ జెండాడి స్వర్గరాజ్యముం జూఱకొందుఁ గాక. (ఖడ్గముఁ దీసికొని) ఓ ఖడ్గరాజమా! నీవలన నింక నెంతయో పని కానున్నవి. ముందంతః పురమునకు బయనమగుమ్ము. (నిష్క్రమించును).

పంచమాంకము.

సంపూర్ణము.

శ్రీ ర స్తు.

# పా పా రా య ని ర్యా ణ ము



## ష ష్ఠాం క ము.

(యుద్ధభూమి-రంగారాయడు ప్రవేశించును.)

ఇప్పటికి బొబ్బిలికోట పూర్తిగ నాశనస్థితికి వచ్చినది. వెలమ వీరుల రక్తప్రవాహము పరాసు సైనికులకు జానుదఘ్నముగ బ్రవహించుచున్నవి. ఇంకనెక్కడి విజయము? ఇంకనెక్కడి యాస? బొబ్బిలి రాజ్యవినాశన హేతుభూతుఁడగు విజయ రామరాజును బ్రాణములతో విడచి నాకీయాయువును ద్యజింప మనసగుటలేదు. ఏనాటికేని విక్రమశాలియగు పాపారాయడె యక్కార్యము నిర్వర్తింపగలడు. నేను విరోధుల హతశేషమగు సైన్యముతో నెదిరించుటయే కర్తవ్యము. (చూచి) అదిగో! విరోధుల విజృంభణము మేఱమీఱుచున్నది. ఏమని యీ సంతసము? ఓ విరోధిసేనాజనులారా!

సీ॥ అతులిత పద్మనా ♦ యకచమూబలమెల్ల
దునుమనేర్చితిమని ♦ త్రుళ్ళనలదు
దోర్దర్పమలరార ♦ దుర్గంబులన్నిసా
ధింపగల్గితిమని ♦ త్రెళ్లవలదు
విజయరాముండు బొ ♦ బ్బిలి రాజ్యలక్ష్మిని
పొందగానుండెనట ♦ పొంగవలదు
మానుషమీఁగి సే ♦ నానాయకులఁ జంప
జాలితిమను సంతి ♦ సంబువలదు

తే గీ॥ ఓరిపుక్ష్మాధినాయకు ♦ లార నిలుడు
చండదోర్దండ పాండితీ ♦ మండనుండు
రంగ దరిపుంగవ గరోఘు ♦ భంగచణుడు
రంగరాయండు మిముఁగొండ ♦ రాఁదొడంగె॥

ఎవ రాభాషించునది. విరోధి సేనానాయకులగుదురా? కారు కారు. వాండ్రకంతటి పౌరుషమెక్కడిది? (ఆలకించును).

(నేపథ్యమున)

మ॥ ప్రకటారాతి శిరోవిఖండన కళా ♦ ప్రాగ్భార సంపన్న మా
మకఖడ్గంబవరోధసుందరి వధా ♦ మాత్రంబుతోఁ దృప్తిఁగాం
చక మీ సైనిక కంఠరక్తరస మా ♦ స్వాదింపఁగానుండెఁ బో
వకుఁడీ వైరినృపాలులార? మిముఁగూ ♦ ల్పక బోనఁగావించితిన్॥ 2

ఓపిఱికిపందలార! జాతిమాత్రోపజీవులారా! నిల్వుఁడు. నిల్వుఁడు.

రంగా—(ఆలకించి) ఓహో! స్త్రీవధ నొనరించి ప్రతిపక్ష వీరవధావిధానమున కుఱుకు చెలికాని వెంకయ్య పలుకులే యివి! విచారాతిశయమున స్త్రీవధావిధానమున నుద్రేకవంతమయిన యీతని పరాక్రమము విరోధిసైన్యమును సర్వనాశనముఁ జేయక పోదు. (చూచి) యేమి నీవిక్రమము! ఏమినీలాఘవము, ఏమి నీచాతుర్యము! నీపశ్చిమ దుర్గద్వారమునే నిరోధింపుము. ఈ ప్రయత్నమువలన విరోధులబలము సగము నాశనముకాఁగలదు. దిగ్భిత్తికలపైఁ బద్మనాయకుల పరాక్రమజీవితములు యశోలేఖినితో వ్రాయవలసిన యదనిదియె. (నాలుగువైపులుజూచి) అక్కటా! విగోధులీ సంకులావస్థలో బురుజు నాక్రమించిరి. అదిగో పద్మనాయకవీరులతో ఘోరావహముఁ జేయుచున్నారు. సేనలఁ బురికొల్పి వైరిసైనికుల దుర్గమునుండి క్రిందికి ద్రోయవలయును. (నడచి) బురుజుపైఁ తనబావుటా నెలకొల్పవలయునని కాఁబోలు విజయరామరాజిటు వచ్చుచున్నాఁడు. మగటిమితో నా కెదురువచ్చినసరి. లేకున్న సేనతో నాతని ప్రతిఘటించి నాకోపముఁ జల్లార్పుకొందును. సర్వనాశనమైన యీ బొబ్బిలి సంస్థానమునకుం గ్రొత్తగా రావలసిన యవస్థలు వేఱు లేవు. ఓవిజయరామరాజా? ముందునన్నుఁ బ్రతిఘటించి కోటలో నడుగుపెట్టుము.

ఉ॥ క్షత్రియ వంశమందునను ♦ జన్మము నొందినవాఁడవేని లో
కత్రయ వందనీయ భుజ ♦ గర్వముఁజూపి యశఃపవిత్ర చా
రిత్రుఁడవై తరింపుము త ♦ రించుట కిద్ది రహస్యమార్గ మీ
మాత్రపు విక్రమంబునకు ♦ మార్మొగమైనఁ బరంబుతప్పెడిన్॥

విజ—(ప్రవేశించి) చింత జచ్చినను పులుసు చావదనినటుల బొబ్బిలి రాజ్యము సర్వవిధములనిర్మూలమైనను నీరంగారాయని కింక విజయముపై నాసతీఱలేదు. చచ్చిన రాచవానిచేతనే చావవలయునని కాఁబోలు చేయెత్తి నన్ను సంగ్రామమునకుఁ బిలుచుచున్నాఁడు. ఈ కడసారి కోరికఁదీర్చుటధర్మము.

ఉ॥ బురుజులు కూలిపోయినవి ♦ భూరిపరాక్రమ భాసమానులౌ
దొరలు గతించినారు పడఁ ♦ తుల్ కదనాంగణమందు నేలపై
కొరిగిరి సర్వవైభవ స♦మూహము నాశనమందె గెల్చి యె
వ్వరిఁ దనియింపనెంచితివొ ♦ వచ్చివచింపుము రంగరాట్పతీ॥

రంగా—నాసంస్థానమును జీవించియున్నంతవఱకుఁ గాపాడుటయే నాధర్మము. దురాశాపీడితుఁడై బొబ్బిలి నపేక్షించిన వంచకుని వధించుటయే నాప్రతిజ్ఞ. విజయరామరాజా? ముందీవేటును గాచికొని పిమ్మట బొబ్బిలిరాజ్యమున విజయధ్వజమును స్థాపింపుము.

విజ—ఇదిగో! సంగ్రామమున కాయితమైతిని. రాజు రాజుచేతను బంటు బంటుచేతను సేనానాయకుడు సేనానాయకునిచేతనే గతించుటగౌరవ ప్రదము. ఈసమయుద్ధమున నెవరుజయించినను విజయము సులభముగా సువ్యక్తము కాగలదు. ఈవేటును గాచికొమ్ము.

(ఇరువురు ద్వంద్వయుద్ధము గావింతురు).

రంగా—ఇదిగో! తాళఫలమువలె నీశిరము నెగుర గొట్టుచున్నాను. బొబ్బిలిరాజ్యలక్ష్మి ఋణము తీర్చుకొను నదృష్టము లభించుటచే నేను సర్వవిధముల ధన్యుఁడను. ఖండాంతరుల యపవిత్ర

స్పర్శముచే గలుషితమైన రాజ్యలక్ష్మిని పావనమగు క్షత్రియ రక్తముతో నభిషేకింతును.

మ॥ బలవద్దర్ప సమగ్రబుద్ధినయి యీ ♦ పాశ్చాత్య దుశ్చిత్తులన్
కలుషస్వాంతుల విశ్వసించి, రణరం ♦ గంబందు నాంధ్రావనీ
స్థల విభ్రాజిత వీరబొబ్బిలిపురీ ♦ సర్వస్వ విద్రోహతా
కలనంబున్ వెలయింతువే! కలకళం ♦ కా! రామభూమీశ్వరా.

సీవనినటుల రాజునకు రాజుచేతనే మరణము లభించినది. ఉత్తమున కుత్తమ లోకము లభించుట స్వతస్సిద్ధమే కదా?

చం॥ బలియొనరింతు నిన్నిపుడు ♦ భారత భూమికి విక్రమక్ర మో
జ్జ్వలులగు వెల్మవారి భగ ♦ వంతుడు సైతమెదుర్పలేడు, కే
వల దురహంక్రియా భరము ♦ పైకొన యుక్తమెఱుంగలేక బొ
బ్బిలిపయి కేగుదెంచితివి ♦ బీరముపీరిడిపోయె నిత్తఱిన్.

(రంగారావు విజయరామరాజు గుండెకు బాకుగుచ్చిచేయును).

(నేపథ్యమున) ఓ సేనానాయకులారా! సింహము వలె విజృంభించి రంగారావు విజయరామరాజును వధించుచున్నాడు. చూచెదరేల? రక్షింపుడు రక్షింపుడు.

ఉ॥ శాతకృపాణ నిర్దళిత ♦ శత్రుడు వేంకటరంగరావు; ప్ర
జ్ఞాతిశయంబుచే మనబ ♦ లా వళినంతయు జూరబుచ్చి ని
ర్ఘాత సమానుడై విజయ ♦ రామనృపాలుని జెండుచుండె బు
స్సీ! తిలకింపవేల? దయ ♦ చేయ వదేటికి? హైదరుప్రభూ.

విజ—ఇతరులసహాయ మెంతమాత్ర మవసరములేదు. విజయరామ నృపాలుడాహవదోహలుండని యెఱుంగక మీరుభ్రాంతి పడుచున్నారలు. మేము ధర్మయుద్ధ మొనరించుచున్నారము. పరులందరు మధ్యవర్తులై. రంగారాయ! సిద్ధముగా నున్నావుకదా! (రంగస్థలమున దుపాకి పేలును, రంగారావు పడిపోవును).

విజ—రంగారాయ! రంగారాయ! ఏమి నేలకొఱఁగినాఁడవు.

(రంగారాయుని గాయము పరిశీలించును).

రంగా—ఔరా! ఈబాధదుర్భరముగా నున్నది. ఈతుపాకిగుండు వక్షస్థలమునుండి వెనుకకు దూఱిపోయినది. ఇక నీయాయువులు స్వల్పకాలముగూడ ధరింపజాలను. వీరపురుషుల కొక్కప్రోత్సాహవాక్యము వచించి స్వర్గరాజ్యమును జూఱఁగొందుగాక! వీరునకు రణరంగమున గతించుటకంటె వేఱుసుకృతము లేదు.

విజ—(స్వగతము) అధర్మప్రేరితుఁడై యేసేనానాయకుఁడో రంగారావు నీదుస్థితికి బాలుపఱచినాఁడు. సంగరధర్మవిచ్యుతుఁడగు నొక్కజాల్మునిచేతనే రాజ్యమునంతటి కపకీర్తి వచ్చును. ఈవీరుని యక్రమ మరణమునకు జింతించ ఫలములేదు. ఈవార్త వెల్లడికాకముందే నేనిటనుండి నడచుట యుక్తము.

రంగా—ఓసేనానాయకులారా! ఓపద్మనాయకులారా! ఇదే నాయంత్యవిజ్ఞప్తి.

సీ॥ హతశేషులగు సైన్య ♦ పతులార! మీపట్టు
దలల జూపింప స ♦ త్వరము లెండు
పద్మనాయకులారా ♦ ప్రాణమేగును గాక
పరదాస్యమునకు బా ♦ ల్పడకు డయ్య
రాజ్యలక్ష్మి నీకు ♦ రాజువెంగళరాయ
డతనికే చేయుమ ♦ మ్మాత్మసపర్య
అంబుజమిత్ర నీ ♦ వైన బాపారాయ
సకు నాయవస్థవి ♦ న్నపమొనర్పు

తే॥ గీ॥ అరుగుచున్నాను సురసతీ ♦ నిరుపమప్రి
యోపగూహనలకు నాన ♦ నొందినేను
రంగరాయండు యుద్ధంపు ♦ రంగమువిడి
అమ్మ భారతమాత నా ♦ కాజ్ఞనిమ్ము.

(వెంగళరాయఁడు ప్రవేశించును.)

వెంగ—అక్కటా! బొబ్బిలి రాజ్యవైభవము సమాప్తమగుట చే గాబోలు! యుద్ధవార్తలు తెలియవయ్యెను. (చూచి) హా దైవమా! ఎంతలో నెంతటి విపత్కాలమును గల్పించితివి. ఇంతకు మున్ను రంగరాయుండు యుద్ధంపు రంగము వీడి యరుగు చున్నాఁడు. అది నాకు వినబడిన వాక్యము. మాయన్నగారి నోటినుండివచ్చిన పలుకువలెనే యున్నది. ఈపలుకెచటి నుండి బయలు దేరెనో యలికిడి బట్టి ప్రయత్నమొనరించినను తెలిసి కొన దుస్సాధ్యముగనున్నది. నన్ను వంచించుటకు విరోధులు పన్నిన దురుద్యమమైన గావచ్చును. పద్మనాయక శవానేక నిబిడీకృతంబగు నీరణరంగంబున నాకు యథార్థ మెఱింగించు వారెవరు? (ముందునకు బరికించి) హా! బొబ్బిలి రాజ్యలక్ష్మీ నీకెంతటి యాపద ప్రాప్తించినది. హా! పద్మనాయక వంశమా! ఎంతటి యమూల్య భూషణముం గోలుపోతివి. (మూర్ఛపోయి తెప్పిరిల్లి) హా అగ్రజాత! విజయరామ వధావిధాన బద్ధకంకణ! హా పౌరుషాభిరామ! పద్మనాయక సంస్థాన సర్వస్వ! హా సంగ్రామధనంజయ! హా ప్రతిపక్ష భూపాల సేనాకానన దావానల! హా జగదేకవీర! ఎంతలో నెట్టి దుర్విధికి లోనైతివి. (శవముపైబడి)

సీ॥ విక్రమించినయట్టి ♦ విజయరామునకు నీ
ప్రధన విక్రమముఁ గ ♦ న్పరచలేదు
ఆత్మజాతునకు రా ♦ జ్యాధిపత్యమొసంగి
యతుల కృతార్థత్వ ♦ మందలేదు
సాగరవేష్టిత ♦ క్ష్మాభాగమున జయ
స్తంభముఁ ♦ స్థాపన సలుపలేదు
తలచిన సంకల్ప ♦ ములనన్నిటిని సమ
ర్థించి ప్రతిష్ఠ నా ♦ ర్జింపలేదు,

తే గీ॥ ప్రాయమా ముప్పదేండ్లకుఁ ♦ బాయలేదు
చిత్తమా! శాంతభావంబుఁ ♦ జెందలేదు
కటకటా! యింతలోన యీ ♦ గతినిగంటె
ప్రధన గాంగేయ! శ్రీరావు ♦ రంగరాయ॥

అగ్రజాతా! నీవదన సుధాకిరణాస్తమయానంతర మీకువలయ శ్రీలు సౌఖ్యకరములా! మనసున బెచ్చుపెఱుగు విచారత మోరాశి యంతరించునా! వంశవాగాశి యుప్పొంగునా? దైవమెట్టి కష్టవిధి సంకల్పించెను? విరోధుల దురుద్యమ మెంతలో ఫలించెను? ఎన్నియో కోఱితలుండఁగనే నీజీవితము ముగిసెనా? ఆహా! అగ్రజా!

సీ॥ కటకటా! ఎంతటి ♦ కష్టంబుప్రాప్తించె
నమరీతి నాసిక ♦ నంగుళినిడి
కనరాదు దుర్జన ♦ కలితమాలోకంబు
నున్నట్లుఁ గన్నుదో ♦ యినిమొగిడ్చి
అన్నివిధాల కృ ♦ తార్థుండ ననిపల్కు
కరణి వక్షస్థలి ♦ కరముఁజేర్చి
యుద్ధమంతయుఁ గాంచ ♦ కుండ నేగుచునుంటి
ననుమాడ్కి దైన్యమా ♦ స్యమునననించి

తే గీ॥ రాజమణులకుఁ జావెందు ♦ రణమునందె
యనెడి నుడువుల కీవుదృ ♦ ష్టాంతముగను
నేటితోడుత నూఱేండ్లు ♦ నిర్గమింప
నరిగితివె అగ్రజాతద ♦ యాసమేత॥ 6

పద్మనాయక వంశాలంకారుడగు నీరంగారాయుడు గతించిన పిమ్మట నేను జీవించి యనుభవింప వలసిన సౌఖ్యమెద్ది? రణ రంగమున యావచ్ఛక్తి వినియోగించి స్వర్గమున నన్నగారితో నేకీభవించుటయే యాచరణీయము. ఓవైరిసైనికులార!

శా॥ భంగంబుల్ బొనరింతుఁ దావక చమూ ♦ వారాశి నెల్లన్, సమి
ద్రంగంబందు భవత్ విరోధుల నవా ♦ ర్యప్రౌఢిరాల్తున్, భువిన్
నింగిన్ మీాయపవిత్రరక్త నదులన్ ♦ నిండారఁ బాఱింతు, నీ
వెంగళ్రాయని శక్తి మీాకిదియె క ♦ న్పింతుఁ గ్నుఁ డీ శాత్రవుల్.

నాభుజాబలమునకు విజయరామరా జడ్డుపడునో బుస్సీఅడ్డు పడునో హైదరుజంగు అడ్డు పడునో పరికింతుగాక! ఓసైనికు లారా! మిగిలినదానికి జేయునదిలేదు. మీాస్థానముల వర్జింప కుడు. నేనుమీాకు సేనానాయకత్వము వహించెదను. (నిష్క్ర మించును.)

(విజయరామరాజు, బుస్సి, హైదరుజంగు, జవాను ప్రవేశింతురు.)

హైద—బొబ్బిలివాంళ్లు బడా బలవంతుల్ వుండారు. బాట్లు అంతా సచ్చిందాకా కోటలో హడుగుపెట్టనిచ్చారు లేదు. వాంళ్లకి పౌరుసం ఎక్వావుంది. మనకీ తక్వావుంది. లేకపోతేమనకీ పౌజు యెనిమిదియేలునష్టం. వాంళ్లకి పేన మూడుయేలుఁనష్టం. యెట్ట అవుతుంది. క్యా యిజయరాంసాబ్.

విజ—పౌరుషవంతుల కెప్పుడు జయములభించితీఱును. జయమున కేమిగాని జీవములతో పద్మనాయకుల బంధించి యంతః పురాంగనలతో వలసఁబంపి బొబ్బిలిదీసికొనఁజాలనైతి మని నాకు బరితాపముగ నున్నది.

బుస్సి—విజయరామరాజా! ఇవి నీవంటిప్రభువున కుండవలసిన బుద్ధులు కావుసుమా! నీహృదయమున కిప్పటికేని పశ్చాత్తాపము కలుగకున్నది. నిష్కారణముగ నిన్నికుటుంబములు రూపుమా పెనని విచారపడుటకు మాఱు వికటోక్తు లాడుచుంటివా? ఖండాంతరుఁడనైననేనే ఇంతవిచారించుచుండ దేశీయునకునీకు విచారము కలుగదేమి?

హైద—యిజయరాంసాబ్ మహరాజ్‌కి కోపంవచ్చింది. తుం శాంత్ కర్ నకో.

విజ—దేవా! తాము కోపించుచున్నారుగాని బొబ్బిలివారు నన్నెంతకష్ట పెట్టిరో తాముచూచియుంటిరా? నాహృదయ మెంతయో పరితపింపకున్న సాహసించి యిటుల గావింతునా? కావలయునని జయించి యింక పశ్చాత్తాపమొందనేల?

బుస్సి—మీకు మీకు ద్వేషముండుఁగాక. అనవసరముగ మేమీ యుద్ధమున జోక్యము కల్గించుకొనుటచేతనేకదా బొబ్బిలి సంస్థాన మిటు లంతరించినది?

హైద—మహారాజ్ పోయిందాన్కి అనుకోవాలావద్దు. అన్కోని లాభంలేదు. ఈలడాయిలో యిజయరాంసాబ్ తప్పా ఒక్క ర్వా అంతా లేదు. అంతాబొబ్బిలిది.

(నేపథ్యమున) అయ్యో! సామర్లకోటకుఁ బోవుమార్గమేది! ఆపడిపోయినబు రుజుపక్కనుండిపోవు లుబాటయేకదా మెవ్వరుమారుపలుకరే?

(చేటి, చినరంగారావు ప్రవేశింతురు.)

చిన—అబ్బా! నేనింక నడువఁజాలను. నాయడుగులు తడబడుచున్నవి ఆకలియగుచున్నది. ఇఁక నేనురాను. ఇంటికిబోయెదను.

తే॥ గీ॥ మెుఱకురానేల పాదంబు ♦ మోపఁజాల
ఒడలు భారంబుగాఁదోఁచె ♦ నడువఁజాల
దప్పియగు చుండె నిముసంబు ♦ తాళఁజాల
చేటి! ఇఁక నెంతపయనంబు ♦ చేయవలెనె?        8

చేటి—(బుస్సిమొదలగువారిఁజూపి) నాయనా? అరవకుము. అరుగో దొంగలు పట్టుకొనిపోవుదురు. సామర్లకోట దగ్గరకు వచ్చితిమి. (స్వగతము) అక్కటా! ఆకానవచ్చువారు విరోధులవలె నున్నారు. ఈబిడ్డకేమి యపాయము కలుగునో? (నడచి)

తే. గీ॥ ఈనగాచియు నక్కల♦కిచ్చినట్లు
శిశువు నిందాక రక్షణ ♦ జేసి యిపుడు

వైరులకు నప్పగింపగా ♦ వలసె నింక
పాపనికి దిక్కు లేదు దై ♦ వంబుదక్క.

హైద—ఏజవాన్! ఒకఆడుది పిల్లవాడు పోతూవుంది. మహారాజ్కీ హుకుం అయిందీ అని వాంళ్లకి పిల్చుకరా. బొబ్బిలివాళ్ళు వుండారు.

జవాన్—చిత్త మటులె యొనరించెదను. (నిష్క్రమించును).

విజ—పిల్లవాడు పోలికలఁ బట్టి చూడ రంగారావు కుమారునివలె నున్నాడు. ఈకుఱ్ఱవానిని దాసి యెచ్చటికో తీసికొనిపోవు చున్నది. మనకంటపడిరి. ఇక నెక్కడికి బోయెదరు?

(చేటి చినరంగారావు ప్రవేశింతురు).

హైద—ఓసీ ఆడ అమ్మో మీదికోన్ సాబస్తీ యీచోటాకీ యాడ్కీ తీస్కాపోతావుండావు. పిల్లవాడు యెవర్కీ కొడుకు నువ్వ యెవరు బోలో.

దాసి—నాదిబో......కాదు పెద్దాపురము. ఈబాలుఁడు నాతన యుడు......

విజ—నిజముచెప్పకున్న నిన్ను ఖండింతుము. దాసీకుల సహజమగు నసత్యసంభాషణము మాత్రము సలుపకుము. జాగ్రత్త! నీది పెద్దాపురమా?

చిన—ఏమిరా! నోటికి వచ్చినటుల వాగెదవు. నీకు వెరచువారులేరు

తే. గీ॥ కత్తిఁగొనిరార నాతోడి ♦ కయ్యమునకు
శిరము బొబ్బిలికత్తితో ♦ నఱకువాడ
పిల్లవాడుగదాయని ♦ త్రుళ్ళఁబోకు
పదను కత్తికి ముందు నీ ♦ ప్రాణమెంత? 1

విజ—ఓరీ శుంఠా! శాబకా! వెలమకులమునఁ బుట్టినందులకు మాటలుమాత్రము దిట్టముగ విడుచుచున్నాడవు. మాటఁ బింకమైన లేకున్నబ్రతుకు తెరువేది? (బుగ్గపట్టుకొనబోవును.

హైద — పిల్లవాఁడు బడా గట్టివాఁడు వుండాఁడు పిర్కా గిర్కా లేదు.

బుస్సీ — విజయరామరాజా? ఆబాలకుని కసరకుము. మిగుల గారాబముగ బెరిగిన కుఱ్ఱవానివలె నున్నాఁడు. కావుననే తొందరపడి మాటలాడుచున్నాఁడు. హైదర్ జంగ్! ఆబాలకుఁ డెవ్వఁడో విచారింపుము.

హైద — ఇ పిల్లగాఁడూ యెవడు? నువ్వు యెవడు సత్తెం బోలో,

చేటి — (బుస్సీవైపునకు మరలి) ధర్మస్వరూపులగు మీముందు యథార్థము వాక్రొనెదను. బొబ్బిలిరాజ్యము విరోధివశము కానున్నదని అంతఃపురకాంతలందఱు నాత్మహత్య గావించుకొనిరి. మా రాణియగు మల్లమాదేవి తానాత్మహత్యఁ గావించుకొనబోవుచుఁ గుమారుని సామర్లకోటలోనున్న తన చెల్లియింట నుంచిరమ్మని నాకాజ్ఞయొసంగినది. ఈ బాలుఁడు రంగారాయని కుమారుఁడు. మీ చేతులలోఁ జిక్కెను. రక్షించినను శిక్షించినను మీ రేదిక్కు.

తే. గీ॥ మోడువోయిన శ్రీరంగ ♦ భూమిపాలు
వంశవృక్షంబునకు దైవ ♦ వశమువలన
చివరకు మిగుల్పఁబడియె నీ ♦ చివురు గాన
త్రుంతురో పెంతురో యొప్ప ♦ గింతు మీకు.

విజ — రంగారాయని కుమారుఁడే యైనచో బంధింప వలసినదే! బొబ్బిలి రాజ్యము స్వాధీనపఱుచుకొనిన తరువాత నీతని సంగతి విచారింప వచ్చును. అంతవఱకు దాసివద్దనుండి బాలుని లాగించి మన భటుల కప్పగింపవలయును.

చేటి — కుఱ్ఱవానిని బంధింపుటయే! నాకంఠనాళమున నాయువున్నంతవఱకటుల జరుగనేరదు. ఓ విజయరామరాజా! ఈ పాపమిహలోకముననే కట్టికుడుపును.

శా॥ శ్రీమన్మల్లమదేవి దివ్యకరుణా ♦ శీర్వాదముల్ రంగరా
డ్స్వామీనాయక సత్కృపావిలసనం ♦ బుల్ హేతువుంగాఁగ సం
గ్రామప్రాభవ మేనునేర్చితిని నా ♦ ప్రాణావసానంబునం
దేమోగాని కుమారుఁ గైకొనవశం ♦ బే నీకు రామాధిపా. 12

బొబ్బిలి రాజ్యమునఁ బ్రతియువతియు వీరాహవ నిర్వహణ ప్రవీణయె. ఇంతవఱకు మీరుస్వానుభవమున నెఱింగిన యంశ మేయిది. కదనమున నన్నెదిరించి పిమ్మట బాలుని పైకిఁ బొమ్ము. మధ్యవర్తిగ ధర్మమూర్తి బుస్సిదొరగారుందురు.

విజ—ధీ నోరుమూయుము. వీరక్షత్రియ కుమారుని దాసి సంగ్రామమునకు బిలచెనన్న నవ్విపోదురు. తెలివిగలిగి బ్రతుకుము. ఎవరనుకొంటివో.

హైద—చోటా! విజయరాంసాబ్ కీసలాంకరో? వాడికి దయనీమీద వుంటే నీకు షేమం అవుతుంది. ఇప్డు నీదిషర్వం ఆయన్కి శేతుల్లో వుంది.

చిన—చేటీ! విజయరామరాజీతఁడేనా! నాన్నగారితో యుద్ధము చేయవచ్చినాడని నాచెలికాఁడు చెప్పినాఁడు. ఈతఁడు నన్ను చంపునా?

విజ—కుమారా? నిన్ను వధించుట మాసంకల్పముకాదు. ప్రకృత విషమ పరిస్థితులలో నోరెఱుఁగని నిన్నుఁగాపాడి యనంతర మేదోయొక సంస్థానము నొసంగవలయుననియే మాసంకల్పము. రమ్ము. నావద్దకురమ్ము (పిలువఁబోవును.)

దాసి—బొబ్బిలి వెలమబిడ్డసుమా? తాఁక బోకుము.

చిన—నేనురాను, నేనురాను. (కత్తితోఁ బొడువఁబోవును.)

బుస్సి—చినరంగారాయని ముద్దుపెట్టుకొని నాయనా! ఉత్తమవంశమునఁబుటిన నీకీపౌరుష ముండవలసినదె గాని, నీకివి కానిదినములు

ఈయక్రమయుద్ధమున హైదరుజంగు విజయరామరాజుల మాటలువిని నీవంశనాశనమునకుఁ గారకుఁడనైన నేను నీకుఁ జేయవలసిన ప్రతిక్రృతిలేదు. పరులమాటలనేను విశ్వసింపకున్న మీకీ యవస్థలురావు. హతశేషులగు బొబ్బిలివీరులచేతిలో నుండి బయటఁబడితినేని నీకుఁ దగినమేలు చేసితీఱుదును. ఓరీజవాన్! ఈకుఱ్ఱవానిని జాగరూకతతో సామర్లకోటకుం జేర్పుము. దాసి నీబాలుని సంరక్షణమున నియోగింపుము. (తనలో) ఇప్పుడుకాకున్న మఱియొకప్పుడేని బొబ్బిలిరాజ్య మీకుఱ్ఱవాని కిచ్చి తీఱెదను.

చిన—అయ్యా! నేనువెళ్లివచ్చెదను, నాకుసెలవిండు. (సలాముచేయును)

బుస్సి—నాయనా! పోయిరమ్ము.

(చినరంగారావు చేటి, భటుఁడు నిష్క్రమింతురు.)

హైద—అచ్ఛాఛోటా వుండాడు. బొబ్బిలిగడ్డమీద పిరికివాడూ లేడు, అంతావస్తాదులు అంతాసర్దారులు వుండారు. ఆడవాండ్లకి మొగవాండ్లకి పౌరుసంవుంది.కసరత్ వుంది. బలం పరాక్రం వుంది. తెలింగీ దేషములో యీపౌరుసం శూశాంలేదు.

విజ—(తనలో) బొబ్బిలికోట యిప్పటికి సర్వవిధముల నాశనమైనట్లె పశ్చాత్తాప స్వభావముగల బుస్సిని వంచించి బొబ్బిలికోట యేనాటికైనా వెలమవారికి, అందుముఖ్యముగ రంగారాయుని పుత్రునకు, సంక్రమింపకుండఁ జేయవలయును. దైవవశమున బ్రతికి బట్టకట్టిననాటికి రంగారాయుని పుత్రుని కేమన్నెపు గ్రామములో జూపునటు లిపుడె కట్టుదిట్టముచేయవలెను. సంగ్రామపరిస్థితులు ఈదిక్కుమాలిన శిశువును జూచిన దాది బుస్సిహృదయము విచారక్లిన్నమై నటులున్నది. ఇతనిహృదయము నన్యత్ర మరల్చుట కర్తవ్యము. (ప్రకాశముగ) బుస్సిప్రభూ! కోటయిప్పటికి మనవశమైనది. ఒకమాఱు లోనికేగి చూచివత్తమా?

బుస్సీ—ఇంక నేమిచూడవలయును? బురుజులు, కోటలు మనమే పగుల్ కొట్టితిమి. అంతఃపురాంగన లందఱు నాత్మహత్యగావించు కొనిరి. సేనానాయకులకుటుంబము లెప్పుడో మనఫిరంగులచే నాశనమయినవి. నేను చూడజాలను. శవములచేనిండియున్న యీ బొబ్బిలిరాజ్యమును నేనుజూచి సహింపజాలను. నేనురాజాలను.

విజ—చిత్తము. రేపటి దినము చూడవచ్చును. బొబ్బిలివీరులలో వేరుపడిన పాపారాయడింకను జీవించియేయున్నాడు. అతడు బొబ్బిలి దురవస్థ వినెనేని మనపైబడి తీఱును. ముందాతని సైన్యసహితముగ బంధింపవలయును.

హైద—యిజయరాంసాబ్ వాడు యిప్పుడెక్కడా వుండాడు?

విజ—మనము బొబ్బిలికోటకు రాజాంకోటమీఁదగ వచ్చెదమేమో యని మనల నెదిరించుటకు సైన్యసహితముగ రాజాంకోటయొద్ద నున్నాడట. మనము మారుతోవను ముట్టడింపవచ్చితిమని బొబ్బిలివారు పాపారాయనిచెంతకంపిన భటులనందఱ వధించి యీలేఖలఁ దెప్పించి యాతనికి వార్త బోకుండ జేసితిని.

బుస్సీ—విజయరామరాజా! నీకు సాహసము దూరాలోచనము లేదు. పాపారాయనికి వార్త బోనిచ్చి సైన్యసహితముగ నాతని నిటకు వచ్చునటుల జేసియున్న మనము సులభముగ నెదిరింప వీలుచిక్కునది. నీవు నిరర్థకముగ భంగముగావించితివి. అతనిసంగతి రేపువిచారించుదము. పొద్దుగ్రుంకువేళ గావచ్చినది. సేనల నియతస్థలములు వదలి శిబిరములకు రానాజ్ఞాపింపుము. మనము బసలకు జేరుదము.

(నేపథ్యమున)

ఆ. వె॥ ఏఁడి బుస్సిహైద ♦ రెచ్చటనున్నాఁడో
ఏఁడి విజయరాముఁ ♦ డెందుడాగె
సేనలెల్ల నిలువఁ ♦ గూడివేచియున్న
నష్టపడెడి యొక్కఁ ♦ డైనగాని.

విజ—అదిగో! వెంగళరాయఁడు వెలమసైనికులతోఁగూడి మనసైనికులను నుగ్గునూచము గావించుచున్నాఁడు. రక్షింపుఁడు, రక్షింపుఁడు.

బుస్సీ—ఈపద్మనాయక వీరులగెలుచుట కష్టసాధ్యము. ఆంధ్రవీరుల యందింత పరాక్రమ మిదివఱకెచ్చట జూచి యెఱుంగము. దేశాభిమానమన నిటులెయుండవలయును. బొబ్బిలివీరులకు న్నంత దేశాభిమానము, ప్రభుభక్తి యాంధ్రులందఱకున్నచో సర్వదేశములు జయించియుందురు. (ప్రకాశముగ) విజయ రామరాజా! సైనికుల వెన్నీయవలదని తెలుపుము. ఇదిగో మేము వచ్చుచున్నారము.

విజ—రండు, పోవుదము. (అందరు నిష్క్రమింతురు).

షష్ఠాంకము.

సంపూర్ణము.



శ్రీ ర స్తు.

# పాపారాయ నిర్యాణము



## సప్తమాంకము.

(దేవులపల్లి పెద్దన్న, తాండ్ర పాపారాయఁడు ప్రవేశింతురు.)

తాండ్ర—మిత్రమా! పెద్దన్నా! నామనస్సున నేదియో విచారము కారణములేకే జనించి వృద్ధి నొందుచున్నది. తగినటుల బొబ్బిలి కోటను విడచినదిమొదలింతవఱకు వార్తలునైతము తెలియుటలేదు. ఇఁక మనమెంతదూర మేగవలయును?

దేవు—అదిగో! ఈకటికిచీఁకటిలో మినుకుమినుకుమనుచుఁ గానవచ్చునదియే బొబ్బిలికోట. సమీపమునకుఁ గూడ వచ్చితిమి.

పాపా—(నడచి) మిత్రమా! కాంచుము, కాంచుము. కోట యిటుల భయంకరముగఁ గనవచ్చుచున్నదేమి! నీకు నిటులనే గనవచ్చుచున్నదా! ఏమి యీవిపరీతము?

సీ॥ గ్రుడ్లగూబలు మూఁకఁ ♦ గూడి యంతఃపురంబు
గోడలపై బట్టు ♦ గూయసాఁగె
ఘాతుకమృగము లె ♦ క్కడనుండియో శవం
బుబంగొని వేవేగఁ ♦ బోవుచుండె
కొఱవిదయ్యంబులు ♦ బురుజులపైఁ జేరి
వింతనృత్యములు గా ♦ వింపఁదొడఁగె
గుంపుగాజనులుండు ♦ కోటగుమ్మమువద్దోయి
యశుభచిహ్నంబుల ♦ నాక్రమించె

తే॥ గీ॥ దూరమునునుండివచ్చెడి ♦ మారుతంబు
క్రుళ్లునెత్తురు వాసనల్ ♦ గ్రుమ్మరించెఁ
జెలుఁడ! ఇవి మనరాజ్యంపు ♦ విలయసూచ
కంబులనితోఁచు నా మనః ♦ కంజమునకు॥ 1

దేవు—మిత్రమా! మీరు విచారము నొంద నవసరములేదు. మన స్సున సందేహ మున్నపుడు గాంచునవియన్నియు సందేహాస్పదములుగ నుండుట నైజము. అంతియగాని మన కెట్టియపకారము జరిగి యుండదు. ఇంకను శోధించుదము.

పాపా—(నడచి) పెద్దన్న! ఇంక సందేహింతువేల? మన బొబ్బిలి రాజ్యమున కింతయనరాని ప్రళయము నిజముగ జరిగినది. కోటలోనికి వచ్చుచుంటిమి. ఎచ్చట సంవడి వినవచ్చుటలేదు. త్రోవలయందు సైనికులు కానరారు. ఇంతియగాక.

ఉ॥ దిక్కుల రక్తపున్నదులు ♦ తెంపొకయించుక లేక పాఱె, నే
ప్రక్కలఁగాంచినన్ వెలమ ♦ వారల పీన్గులుకానవచ్చె, నే
చక్కినిజూచినన్ రణము ♦ సల్పిన చిహ్నలు చూడనయ్యె: హా
యెక్కడిమాట: బొబ్బిలికి ♦ యేదో యరిష్టముగల్గె నెయ్యమా॥ 2

(కొంచెము నడచి దిక్కులుచూచి) మిత్రమా! ఇంక సందేహింప నవసరములేదు,

సీ॥ వితత పరాక్రమా ♦ కృతి ధర్మమూర్తి రం
గారాయ భూపతి ♦ కానరాఁడు
ఆత్మీయ సామ్రాజ్య ♦ హర్మ్య మూలస్తంభ
మైన వేంగళరాయఁ ♦ డగపడఁడు
రమణీయ బొబ్బిలి ♦ రాజ్యరమా నిరం
తరభోగగరిమ నో ♦ చరము కాదు
అతులిత పద్మనా ♦ యక వీర తేజంబు
బాహ్యదృష్టికిఁ గను ♦ పట్టబోదు

తే॥ గీ॥ చేతనవ్రాత మందలి ♦ జీవకళలు
భౌతిక రహస్యతత్త్వ సం ♦ పదలఁగనవు
కోటలోపలఁ బ్రజలును ♦ గూడ లేరు
కటకటా దీనికెయ్యది ♦ కారణంబు॥

దేవు—(స్వగతము) ఏమిది! బొబ్బిలికోటను సమీపించినను సద్దు వినరాదు. పాపారాయఁడు రాజాంకోటలో నున్నసమయమున విరోధు లీకోటను ముట్టడించి యిట్టిదుర్గతిని గూర్చియుందురు. లేకున్న నభాగ్యదేవత యిటులఁదాండవించునా? (ప్రకాశముగ) పాపారాయా! ఇంకఁ జెప్పవలసినదేమున్నది?

ఉ॥ ప్రోవులుఁగాఁగ బీనుగులు ♦ పొంతలఁ గన్పడసాగె నెందునే
త్రోవలఁగాంచినన్ రిపువ ♦ రూథినులున్న గుడారముల్ కనం
గావడె; భూమి సైన్యపద ♦ ఘట్టనమందుటఁ జేసి క్రుంగె ఓ
దేవర! ఇవ్వి బొబ్బిలి క ♦ దృష్టముదప్పెనఁటంచు దెల్పెడిన్.

పాపా—మిత్రమా! నీవు వాకొనినటుల విరోధు లేవియో మాయోపాయములఁబన్ని బొబ్బిలికోటను బాడుచేసియుందురు. హా! పద్మనాయక సంస్థానరాజమా! హా!రంగారాయ భూపాల భాగధేయమా! హా! చతుస్సహస్ర దేశీయశూర సైన్య జీవిత సర్వస్వమా! హా! బొబ్బిలిరాజ్యమా! నీదుస్థితి కెంతని పరితపింతును.

సీ॥ మ్లేచ్ఛరాజులకు న ♦ మ్రికఁగూర్చి నిర్వాణ
రాయుండు పాలనఁ ♦ జేయునాడు
రాజ్యంబు సంపద్ధు ♦ రంధరంబొనరించి
లింగప్పరాజు పా ♦ లించునాఁడు
రిపులదేశముల నా ♦ ర్జించి జనార్దన
రావు జయాంకముల్ ♦ వ్రాయునాఁడు
శత్రునాశనముగా ♦ సంగరంబులొనర్చి
శ్రీరాయఁడప్ప ర ♦ క్షించునాఁడు

తే॥ గీ॥ స్వప్నముననేమి గనని క ♦ ష్టములు నీకు
రంగరాయుని పాపభా ♦ రంబువలనఁ
గలిగె, నేమనవచ్చు నీ ♦ కాలమహిమ?
రమ్యగుణలక్ష్మి! బొబ్బిలి ♦ రాజ్యలక్ష్మి !

దేవు—మిత్రమా! విచారమువలనఁ గాఁదగుకార్యములేదు. అదియుఁ గాక కష్టము సౌఖ్యమను చక్రములు సంసార శకటమునకు విధికృతములు. దైవిక విధు లనుభవింపక తప్పునవి కావు. కొంచెము ముందునకుఁ బోయి రాజ్యవ్యవస్థల సాకల్యముగ నెఱింగి యుచిత విధాయకమున్న నూహించుదము. పోవు దము రండు.

పాపా— నెయ్యమా! విచారాతిశయమున నాహృదయమునకు నిల్కడ తొలంగినది. నేను ముందు చనఁజాలను. నీవుత్రోవఁ దీయుము. నేను వెంట వచ్చెదను.

దేవు— పాపారాయా! ఆకరదీపిక నిటుల తెమ్ము. ఇట నొకశవము కానవచ్చుచున్నది. పరిశీలించి మన సంశయమునకు మార్పు కలిగించుకొందము.

(పెద్దన్న, పాపారాయఁడు పరిశీలింతురు)

పాపా— హా! పరమేశ్వరా! బొబ్బిలి రాజ్యమున కెట్టి విపత్కాలము ను ప్రాప్తింపజేసితివి. రావు వంశమున కెట్టి దురవస్థ ఘటించితివి నేఁటితో నీస్థలభోగము తీఱెగదా!

సీ॥ కడిఁది నెత్తురు పెను ♦ కాలువలోపలి
మేను క్రొంజవులీనఁ ♦ దానమాడి
పసపు నిగ్గులు దేఱ ♦ మిసిమి గ్రక్కెడు మేన
మెదడు గందఁపుఁబూంపెఁ ♦ గదియఁబూసి
పుడమి ముద్దియ పైని ♦ పొలయుల్కగనుగతి
నవ్వాలి మోముగా ♦ నత్తమిల్లి
పరసౌఖ్యవితతాను ♦ భవముఁ దెల్పెడు భంగి
గన్నుఁ దమ్ముల్లను స ♦ గమ్ముమూసి

తే. గీ॥ వెలమవారల బలములు ♦ వీటిబోవ
వలసె ననుచింతఁబోలె నై ♦ చెలువుఁదొలఁగి

సూర్యమండలమును జీల్చి ♦ సురపురమ్ము
డాయఁబోయితె వెంగళ ♦ రాయభూప॥ 6

హా! మిత్రమా! హా రంగారాయాజ్ఞానిర్వహణ ప్రవీణ! హా విజయస్వయంవర వధూపరిష్వంగాధీన భావా! హా శూరలోక శిరోభూషణ! హా పరాక్రమ నిధాన! "సుకృతీ గతాయుః" అను సూక్తి నీయందె యర్థవంతము కావలయునా! ఎంతకష్టము. ఎంతవిపరీతము. ఎంతవిచారజనకము. హా దైవమా! ఎంతటి యవస్థఁగూర్చితివి.

వేపు——మిత్రమా! విచారమునొందుటకు జీవితకాలమంతయు వ్యవధి కలదు. రణరంగమున వీరస్వర్గ మలంకరించిన యీశూరవర్యుని మరణమునకై దుఃఖము నొందుదుమేని పరమున నాత్మకు సుఖముండదని యాత్మజ్ఞు లందురు. దుఃఖమెందులకు?

ఉ॥ పౌరుషమెల్ల రూపముగ ♦ భాసిలఁజేసి, నితాంతధైర్యముం
బేరి యనూనజీవమున ♦ బేర్చి, పరాక్రమమన్న రక్తముం
గూరిచి వెల్మవంశమున ♦ కుం విధిగూర్చిన భూషణం బహో
పేరిడిపోయె; నింక విల ♦ పించిన లాభము కల్గనేర్చునే॥ 7

పాపా——మిత్రమా! నాకాయువుపై నిరుత్సాహము కలిగినది. విక్రమధనుండగు నీవెంగళరాయని మరణవార్త విని రంగారాయఁడు గతించియుండును. ఆయనసఖునింబట్టి యవరోధసతులు శూరవర్యులు గతించియుందురు. ఈ వెంగళరాయని యకాలమరణమునకు విజయరాముని దురుద్యమబద్ధమగు యుద్ధమె హేతువై యుండును. ఇంతటి విలయము జరిగినపిమ్మట నేను జీవించి ఫలమేమి? (కత్తిఁదీసి)

మ॥ ఘనభూమీశ్వర కంకనిర్గళ వన్య ♦ గ్ధారాళిచేఁ బుణ్యభా
జనమై సజ్జనగేయమై యమలమై ♦ సంపత్ప్రదంబై చరి

త్ర నిశాంతంబయి సర్వరీతులఁ బ్రశ ♦ స్తంబైన యిచ్చోట నే
నును బ్రాణంబుల వీడి వైశమ సుధాం ♦ ధోలోకముం జేరెదన్

వెంగ— (లేవఁబోయి పడి) ఓరీ దురాశయా! అధర్మ యుద్ధమున॥ కుపక్రమించుచున్నాడవా! నాకంఠమునఁ బ్రాణవాయువున్నంతవ ఱకు విరోధినిఁ జేరనీయను.

మ॥ పురుషాకారముఁ దాల్చినట్టి పశువా? ♦ పుంజీకృతాఘవ్రతా
చరణీయా? నిలు వెందుఁబోయెదవు మూ ♦ ర్ఖా బంధుఁగుఱ్ఱఁజంప ని
కరమెట్లొడెను? రాజధర్మము తొలం ♦ గన్ వచ్చునే? పౌరుషా
కరుడీఁ చేతకు నిచ్చగించునె యహం ♦ కారంబు రక్షించునే॥

(కత్తితోఁ బాపారాయని కొట్టఁబోవును)

పాపా—(కత్తి బట్టుకొని కొంచెమాఁగి) నాయనా! నేను పాపారాయుఁడను, నీకు విరోధిని గాను. నీవుగతించితివని నేను బ్రాణత్యాగముఁ జేసి కొనఁబోయితిని గాని విరోధులెవ్వరును లేరు. ఏల యీదురవస్థకుఁ బాలుపడితివి.

వెంగ—హా! పాపారాయా! నీవేనా! నన్నొకమారు కౌఁగలించుకొనుము. దాన నాసంతాపము సగముతీఱును. ఇంతటిదురవస్థకులోనైతిని.

సీ॥ శాత్రవమున్మృత్యు ♦ సమితిచే బొబ్బిలి
కోటసర్వము నేల ♦ గూలిపోయె
అంతఃపురాంగన ♦ లవమానభీతిచేఁ
గరవాలములకు నం ♦ గకములిడిరి
రణమొనర్పఁగఁ బోయి ♦ రంగావనీభర్త
సురలోక విభవంబుఁ ♦ జూఱఁగొనియె
పౌరుషార్థము పాటు ♦ వడినతమ్ముఁగల
వెలమవారల వంశ ♦ ములుగతించె

తే.గీ॥ అతులమైనట్టి మనరాజ్య ♦ మస్తమించె
నవనిఁ బాపీ చిరాయువ ♦ టన్నరీతిఁ
గడకుఁ జాలేక మఱిబ్రతు ♦ కంగలేక
తుదకు మిగిలితి జీవన్మృ ♦ తుండనైతి॥

పాపా—హా! బొబ్బిలిరాజ్యలక్ష్మీ! ఈపాపారాయఁడు జీవించియుండఁగనే నీకు వైధవ్యము తప్పదయ్యె. రంగారాయభూమీశ్వరా! నీకు నాకు ఋణముతీఱినది. వెలమసామ్రాజ్యమా! నీకుఁ బరిచర్యచేయు సౌభాగ్య మంతరించినది. ఓసాధ్వీ, మల్లమాదేవీ! నీకు నాకుఁగల ప్రేమానుబంధమున కంతరాయము కలిగినది. ఓపద్మనాయకవీరులారా! ఓ యవరోధాంగనామతల్లులారా! దేశమునకై జీవిత మర్పించి కృతార్థులైతిరా!

చ॥ వినఁదగనట్టి వార్తవిని ♦ వీఁకెడిపోవు నశింపవేమె స
న్మనమ! రవంత సిగ్గుఁగొను ♦ మా! ఇఁక దేహముతోడ శోకవ
హ్నినిఁబడి క్రుగ్గి బూదియగు ♦ మీ! పనిదీఱెను పాపరాయుతోఁ
జను మిటనుండఁగాఁదగదు ♦ శాశ్వతలోకము వేగఁజేరుమా॥ 11

దేవు—మిత్రమా! నిరుత్సాహ పడవలదు. జీవముధరించి నిర్వహింపవలసినధర్మములేమేని విచారించుట యుక్తము. వెంగళరాయని నేమేని యడుగవలసిన యంశములున్న నడిగి తెలిసికొనుఁడు. ఆచరణీయ కార్యములు పెక్కులు మిగిలియున్నవి.

పాపా—ఓయీ వెంగళరాయా! ఈ బొబ్బిలిరాజ్య వినాశనమునకు విజయరామరాజే కదా కారకుఁడు? అతఁడు రాజాంకోటకు రాకుండ నిట కెటుల రాగల్గెను? ఈవార్త నాకేల తెలుపరైతిరి?

వెంగ—మనరాజ్యమున కాసపడి యింతవిలయము కల్పించినది విజయరామరాజే! మే మీవార్త పలుపురివలన నీకుఁ బంపితిమిగాని విరోధులు వారిద్ర నిర్బంధించి యుందురు. పద్మనాయకవీరులు మాతృదేశాభిమాన పరాయణులై రణరంగమునఁ బ్రాణము

విడచుచుఁ గరవాలముతోఁ జేరువనున్న వైరులనఱకి యాంధ్ర
దేశమున నేనాఁడు కానరాని పరాక్రమవహ్ని ప్రజ్వలింపఁ
జేసి స్వర్గరాజ్యము చూఱఁగొనిరి. అపజయము మాత్రము
కడకు మనల విడనాడదాయెను. నేనిఁక మాటలాడఁజాలను.

(వెంగళరాయఁడు పడిపోవును.)

దేవు—ఓరీ విజయరామరాజా! బొబ్బిలిరాజ్యనిర్మూలన ప్రతిష్ఠాధురం
ధరా! నీకీ పాపారాయనిచేఁ జావుతప్పదు. నీవు చచ్చితివి,
చచ్చితివి.

పాపా—మిత్రమా! పెద్దన్నా! నీవీ వెంగళరాయనిఁ గాచియుండుము.
నేను నీప్రళయకాలకల్పానానల్ప దోశ్శక్తిప్రమత్తమనస్కుఁడగు
విజయరాముని పనఁబట్టెద.

సీ॥ బొబ్బిలిరాజ్య మే ♦ పురుషమాత్రుఁడు వినా
శనముఁగావించి దా ♦ ష్ట్యంబు నెఱపె
భారతమాత కే ♦ పాపి యవాచ్యమౌ
కష్టంబుఁగూర్చి వి ♦ క్రమముఁజూపె
రావువంశమున కే ♦ రాజన్యమాత్రుండు
కడలేని సంతాప ♦ కారియయ్యె
హిందూమతమున నే ♦ హీనుండు దుర్మార్గ
చక్రవర్తి పదప్ర ♦ శస్తుఁడయ్యె

తే॥ గీ॥ అతని దుర్గర్వు విజయరా ♦ మావనీశు
కదనరంగంబునందు జ ♦ క్కాడి వాని
ప్రేవులను దండరీతి ధ ♦ రించి రంగ
రాయునాత్మకు శాంతినిఁ ♦ జేయువాఁడ॥ 12

(అటునిటుచూచి) ఏమీ! ప్రపంచమంతయు శూన్యమందిర
మువలెఁ గానవచ్చుచున్నది? రోదోంతరమునకెగబ్రాకు స్వామిభక్తి
యూఁడిపోయినదికాఁబోలు. పద్మనాయకవీరులతోఁబాటు పద్మబాంధ

వుఁడున నస్తమించెఁగాఁబోలు. హృదయదృష్టియు బాహ్యదృష్టియు శూన్యప్రపంచమును జూడఁజాలకున్నవి. నాకీ ప్రపంచమంతయు దిర్దిరఁ దిరుగుచుఁ బ్రళయకాలమహానటుని వదనగహ్వరమునఁ బడుచున్నటులున్నది. అదిగో! బొబ్బిలిరాజ్యముపై నొకమహాజ్వాలవ్యాపించి విజృంభించుచున్నది. శూన్యప్రపంచ మా జ్యోతివలననేని ప్రకాశించుటలేదు. ఏమిది! దిక్కులుకానరావే! ఇది విచారాతిశయమువలన జనించిన చిత్తవిభ్రమమా? నే నున్మత్తుఁడ నైతినా? (పడిపోయి నెమ్మదిగ లేచి) ఓ జ్యోతిస్స్వరూపమా! నీయాజ్ఞఁ బాలించుటకై దీక్షాకంకణము ధరించుచున్నాను. ఫలము విజయరామరాజె యనుభవించుఁగాక. (అటునిటు నడచి) పెద్దన్నా! విజయరాముని వధింప నేను భరతమాతచే నాజ్ఞాపింపఁబడితిని. నేనిందు దురదృష్టవశమునఁ గృతార్థుఁడనుగాక విరోధులకుఁ బట్టువడితినేని నీజీవితము నయిత మిందులకు వెచ్చించి తీరవలయును.

దేవు—నీయాజ్ఞ పరిపాలింప నేను సర్వసిద్ధముగ నున్నాఁడను.

పాపా—(నడచుచు) హృదయ పేటిక నిండి నయనద్వారములనుండి విస్ఫులింగముల వెలిగ్రక్కు నీకోపవహ్నిని భరింపఁజాలకున్నాడ. విజయరాముని వక్షస్థానముఁ జీల్చి వేడినెత్తురుచే స్నానమాడినఁగాని నాతాపము చల్లారదు. ఆ త్రీయసామ్రాజ్యమున కింతటివిపత్తును గూర్చిన యాతనిం గరవాలముతో సఱికి రక్తధారల రాజ్యమధ్యంబునఁ బాఱించుటకు మున్ను ప్రతిజ్ఞ యొనరించితిని. దానిని పుడ నిర్వహించి సర్వవిధములఁ గృతార్థుఁడ నయ్యెద. ఈ శోచ్యావస్థలోని జీవితమున కింతకంటెఁ గావలసిన ఫలమేమున్నది? (నడచి) ఏదీ విజయరాముని పటకుటీరము? నారాక విని యాతఁడు కాలికి బుద్ధి చెప్ప లేదుకద! ఇఁక నాతఁడెక్కడకుఁ బోవఁగలఁడు? క్షాత్రధర్మములగు చతురోపాయములతో నాతనివధించి ప్రతిజ్ఞనిర్వహింపనేని రంగారాయసిబ్బిణమునఁ బోదును. విజయరామరాజెందుపోఁ గలఁడు. యమలోకమున కతిథి కావలసియున్నాఁడు.

మ॥ ప్రళయస్థాణు జటాతటీ నివసన ♦ ప్రాగల్భ్యోద్దైనగా రసా
తలముగా జొచ్చిన వానివృత్తిని గుహాం ♦ తర్వాసిమైనగా సము
జ్జ్వల శేషాహి ఫణాసహస్రతట వి ♦ శ్రాంతాత్ముడైనగా రణ
స్థలిఁజెండాడెద రామభూవిభుని దో ♦ ర్దర్పంబు వారించెదన్. 13

ఈ పాపవృత్తికిసమభాగులగు బుస్సీయు హైదరును దండ్యులేకాని ముందు విజయరామరాజును జెండాడినగాని నాశాపమారదు. ఇఁక ప్రొద్దెంతయో లేనటులున్నది.

ఉ॥ కాంతినశించు దీపకళి ♦ కల్ కొకొకోయను కుక్కుటంబు లు
ద్ధ్వాంత విచారణంబు సలు ♦ పన్ బ్రదుకుతించెడి రిక్కచాలు, ఆ
శాంతమునుండి వచ్చు మరు ♦ దంకురముల్ వచియింపసాగె రా
త్ర్యంతము వచ్చెనంచు నిపు ♦ డాన్నృపజాల్మువధించితీరెదన్॥

విజయరామరాజును వధించుట యుక్తమా? అయుక్తమా? యను చర్చ కిది యదనుకాదు. విచారాతిశయమున నున్మత్తావస్థలోనున్న నాకీ విచారణచేయు శక్తియులేదు. (కొంచెము నడచి) ఇఁక విజయరామరాజున్న పటకుటీర మేదియో వెదకవలయును. అదిగో ముందు మూఁడు గుడారములు కానవచ్చుచున్నవి. అందొకటి విజయరామరాజుది కావచ్చును. సందేహింపనేల? గుడారము ముందు కానవచ్చు ధ్వజమే యాపటకుటీరము విజయరామరాజుదని చాటుచున్నది. (సమీపమునకుఁబోయి గుడారముంజూచి) ఇదియె విజయరామరాజు పటకుటీరము. అదిగో విజయరామరా జొడలుమఱచి నిదురఁబోవుచున్నాఁడు. ద్వారపాలకులు నిదురకు మొగమువాచి సొమ్మసిల్లి పడియున్నారు. విజయరామ వధా విధానమున కిదియ యదను. (ఆలోచించి) నిదురించినవానిఁ జంపుట రాజధర్మ విరుద్ధమే! ఎటులీ యకార్య మొనరింతును? (కొంచమాగి) ఈ వంచకస్వభావునిఁ జంపుటకుఁగూడ న్యాయబద్ధుఁడను గావల

యునా? (కరవాలముఁదీసి) నేను కావింపఁబోవు పని వీరోచిత
మైనదె! ఎటులన.

శా॥ శశ్వ ద్బాహుబలాభిరాముఁడగు వ ♦ శ్వత్థామ యుద్ధక్రియా
విశ్వవ్యాపకమూర్తి, భండనకళా ♦ బీభత్సుఁ డుత్సాహియై
నిశ్వాసంబులఁబుచ్చు చిన్నిశిశువుల్ ♦ జెండాడఁడే; దాన గీ
ర్త్యాశ్వాసావృత జీవితప్రథిత కా ♦ వ్యప్రౌఢిమల్ తగ్గెనే? 15

ఖ్యాతవీరులలోఁ గొక్కరుండు నిద్రాకలగు విరోధులఁ జెండాడి యున్నారు. ఇదియొక దోషముకాదు. ఒకవేళ దోషమైన యెడల నీదుష్టవధంబునఁ జనించిన సుకృతముకంటె నాదోష మతిశయముకాదు. నిద్రితు నేలవధింపవలయును? లేపియే వధించెదను. (చూచి) ఇతఁడు విజయరామరాజేనా ? (సందేహించి) అగు నాతఁడె. ఆతఁడె. ఇతనిముఖముఁ గాంచినకొలఁది నాహృదయమున [illegible] నుద్రేక మతిశయించుచున్నది. చిత్రవధఁ గావించినఁగాని నాక్రోధాగ్ని చల్లారదు. కరవాలముతో నీదుష్టాత్ముని ఖండఖండములుగ నఱికి బొబ్బిలిరాజ్యమున వెదఁజల్లి భూతబలిఁ గావించెద.

(గుడారమును జీల్చి విజయరామరాజుపైఁబడి)

కం॥ పులి పులి; పైనింబడె బొ
బ్బిలిబెబ్బులి నిదురలేర! ♦ భీషణదంష్ట్రా
స్థలమునఁబడితివి ప్రాణం
బులు శౌర్యంబుడిగి ధారఁ ♦ బోయర! క్రూరా॥ 16

విజ—(అదరిపడిలేవఁబోయి) ఏది పులి? ఏది పులి? ఓహో పాపారాయఁడా! నన్ను ఖడ్గముఁ దీసికొననిమ్ము. నీ శీర్ష ముత్తరించెదను.

పాపా—(నెట్టివడవేసి) ఏమిరా! ఇంకను విక్రమింపనున్నాఁడవా? (కత్తితో వక్షమునఁబొడచి) నేఁడు నాపాలఁబడితివి. నీమాంస

ఖండములు రాజ్యమధ్యమున వెదజల్లుటయే నా వ్రతము
(కత్తితో మఱల పొడిచి.)

మ॥ పరమాహంకరణాతిరేకులగు నీ ♦ పాశ్చాత్యులన్ గూడి రా
జ్యరమాద్రోహముసల్పినందులకు వ ♦ క్షస్థానమున్ జీల్చి, ని
ర్ఝర పూరమ్ములరీతి నీ రుధిర ధా ♦ రా ఘోరణీ సారణీ
పరిణామమ్ముల రాజ్యమందు ప్రవహిం ♦ పన్ జేసి శాంతించెదన్॥
(కత్తితోఁ బొడుచును.)

విజ—ఓరీ! పాపారాయా! ఇప్పటికైన నన్నుఁ గత్తిఁదీసికొననిమ్ము నీ...............

పాపా—ఛీ! దురాత్మా! ప్రేలకుము. ఇంకఁ బ్రతుకవలయునని యాస పడుచున్నాఁడవా? (కంఠమును గట్టిగా నొక్కిపట్టును)

విజ—(వికారముగా నఱచును).

పాపా—ఏమిరా! వికృతస్వరము చేయుచున్నాఁడవు!

మ॥ పరరాజ్యంబున కాసనొంది, కుల వి ♦ ధ్వంసంబుఁ గావించి, దు
స్తర దుష్కీర్తి భరించి మించి, యెవరో ♦ ధర్త్రీ వధా ఘోర బం
ధురపాపంబు గడించినాఁడ వింక ని♦న్నున్ సైపఁగావచ్చునే?
మరణావస్థ సహింపుమా! విజయరా ♦ మా! దోషమూలద్రుమా॥

(కత్తితో మరలఁబొడిచి) నాఁడు దామెరదమ్మన్నగారి ముందొనర్చిన ప్రతిజ్ఞ నెఱవేరినది. (తేరిచూచి) ఇంకను బ్రాణముతోడనే యున్నాఁడే! విజయరాముడు.

ఉ॥ చావవిదేమిరా? విశిఖ ♦ జాతహతిన్ హృదయంబు భిన్నమై
ప్రేవులు పైకివచ్చినను, ♦ బృథ్విపయిన్ దమియింకఁ దీఱలే
దా! వెడఁగా! యవస్థలకుఁ ♦ దాఁకి శరీరమువీడవేల? మూ
ర్ఖా! విడిపించువారెవరు ♦ రా నిను! చేరర పాపలోకమున్॥

(చేతికోలంది రొమ్ముపైఁగ్రుద్ది)

తే॥ గీ॥ పగులదేమి నీదు ♦ వక్షఃకవాటంబు
కఠిన దారుమయమొ ♦ కాంస్యమయమొ
కరుగ దెట్టిజాలి ♦ కల్గుమాటలకును
భంగురోక్తి విస్ఫు ♦ లింగములకు॥ 26

విజ—అబ్బా! యీబాధ నెటుల సహింతును.

కం॥ చంపెడివాఁడవు చంపక
జంపొనరింపంగ నీకుఁ ♦ జనునే తల ఖం
డింపుము పరలోకమునకుఁ
బంపుము యాతనల కోరు ♦ వఁగనేర సుమా! 20

పాపా—ఓరీ తొందరపడకుము. పరలోకమునఁ బడరాని పాట్లు శ్రీరంగారాయని సమక్షమునం బొందుటకంటెఁ బరోక్షమున నాచేత శిక్షితుఁడవగుటయే యుక్తము. కృతార్థుఁడ వయ్యెదవు. తొందరపడకుము.

శా॥ వక్షస్థాన విపాటనంబిదె యు ♦ నల్పప్రౌఢిఁ గావించి నీ
కుక్షిస్థంబగు దీర్ఘశల్యముల పం ♦ క్తుల్ దండఁగాఁదాల్చి నా
దక్షత్వంబును సాటనుంటి దురితా ♦ త్మా!యింకనైనన్ బరా
పేక్షన్ దాల్పుమి నారకంబునకుఁ బో ♦ మిమ్మా రామభూపాలకా॥

(ప్రేవులుదీసి దండలుగధరించి) ఇప్పటికి రంగారాయుని ఋణముఁ దీర్చికొంటిని. పద్మనాయక సంస్థానము రూపుమాపినందులకు విజయరామునకుఁ దగిన ప్రాయశ్చిత్తముగావించితిని. నేనిక సర్వవిధముల ధన్యుఁడను. సిద్ధసంకల్పుఁడను (వెనుకకు మఱలి) అదిగో విజయరామరాజింకను బ్రతికి యున్నటు లున్నది.

శా॥ మేసన్ ముప్పదియాఱు గాయములఁ జే ♦ ర్మిన్ జేసితిన్ జీన వ
క్షోనిక్షేపములైన శల్యముల పం ♦ క్తుల్ దాల్చితిన్ దావక
ప్రాణస్పర్శన తాలవృంతభవ సౌ ♦ భాగ్యంబుఁ గాంక్షించితిన్
గానీ! చావవిదేమిరా! కులకళం ♦ కా! రామభూపాలకా॥ 22

(కత్తితో మరల మఱల బొడుచుచుఁ దిరిగిచూచి)

ఇప్పటికి విజయరామరాజు కడతేఱినట్లే. వెంగళరాయా! నాకు జయలక్ష్మినిగాని వరింపనంటివి. ఇదిగో విజయరామునిచే బంధీకృతులరాలైన యాసచ్చరిత్రను విడచిపెట్టితిని. నీజీవితమే నిశ్చయమైన నిన్నే వరించి తీఱును. ఓపద్మనాయక సంస్థానరాజమా! నీఋణము తీర్చికొంటిని. ఓరంగారాయ భూపాలకా! ఇహలోకమున నీకు సంతోషము గల్పింప లేకపోయినను బరలోకమందైనను నీయాత్మకు శాంతిఁ జేకూర్పఁజాలితిని. (నలువైపులరసి) ఇంతకోలాహలము జరిగినను విజయరామరాజు సైనికులింక మేల్కొనియుండరు. పనిలోఁబనిగ హైదరుజంగును గూడ నిపుడె వధించిన బాగుండునుగాని (అదిగోఁ జెల్లవాఱుచున్నది). ఓవిజయరామరాజ సైనికులారా! ఓ పరాసు సైనికులారా! ఓ మహమ్మదీయ సైనికులారా! లెండు, లెండు,

సీ॥ మన్నె ఱేఁడుల గెల్చి ♦ మానవాతీతమౌ
పటిమఁ జూపిన బల ♦ ప్రాభవుండు
చీకటిరాజ్యంబు ♦ సింహాచలేంద్రంబు
కడదాఁక నేలిన ♦ కఱలలాని
భోగభాగ్యంబులఁ ♦ బురుహూతునకుసాటి
నలుపఁగాఁదగిన రా ♦ జన్యమౌళి
తురకఱేఁడుల నాంధ్ర ♦ ధరణికి బలిజేసి
సత్కీర్తిఁగాంచిన ♦ చక్రవర్తి
తే॥ గీ॥ విజయరామాహ్వయ క్షమా ♦ విభుఁడు తాంద్ర
పాపరా డ్విక్రమాగ్నిచే ♦ భస్మమయ్యె
ద్వారపాలకులార! హై ♦ దరువజీర!
బుస్సినరపాల! సంగరం ♦ బునకులెండు॥ 23

భటులు—(ప్రవేశించి) అక్కటా! మనము నిద్రించుతఱిఁ బాపారాయఁడు విజయరామరాజును గడతేర్చెనే గడతేర్చెను. హా!

యెంతవిలయము జరిగినది. భటులారా! రండు. రండు. రక్త సిక్తాంగుఁడై శల్యముల దండలుగఁదాల్చి ప్రళయకాలభైరవుని దలపించుచు విజయరామ గంధసింధురమును దునిమిన పాపా రాయసింహమిటులె వచ్చుచున్నది. ఎదిరింతము రండు. రండు.

పాపా—రండురండు. భటులారా! రండు రండు. రాచపీనుఁగు తోడు లేనిది పోదఁట మిమ్మందఱను మీప్రభువునకుఁ దోడుగాఁ బంపెద.

భటు—ఇదిగో వచ్చితిమి కాచికొండు, కాచికొండు.

(పాపారాయఁడు భటులనందఱ నురుమాడును. వెనుకనుండి యొకభటుడు తుపాకిఁ బేల్పఁ బాపారాయఁడు పడి కత్తివిసరివేయును. తుపాకిఁ బేల్చినవాఁడు గతించును.)

పాపా—ప్రాణములారా! మీరు స్వేచ్ఛగఁబొండు. మీవలనఁ గాదగిన పని యంతయు నిదివఱకె నిర్వర్తించితిని.

తే॥ గీ॥ ఆత్మసంస్థాన విద్రోహి ♦ యైన విజయ
రాము ఖండించినాఁడను, ♦ రంగరాయ
విభుని యాత్మకు శాంతిఁ గ ♦ ల్పించినాఁడఁ
జనుచునున్నాఁడ స్వేచ్ఛగా ♦ స్వర్గమునకు॥ ౨

(పడిపోవును)

పాపారాయనిర్యాణము.

సప్తమాంకము.

సర్వము.

సమాప్తి.



| | | | |
|---|---|---|---|
| ౫౯ | ౧౭ | లకరింప | లంకరింప |
| ౬౧ | ౫ | స్తవవీయ | స్తవనీయ |
| ,, | ౯ | చ్ఛక్రీత్రిచ్ఛటా | చ్ఛక్రిత్రిచ్ఛటా |
| ౬౨ | ౨౦ | నటు | నవెనటు |
| ౬౪ | ౩ | సంగ్రామిక | సాంగ్రామిక |
| ౬౮ | ౨౩ | లచం | లంచం |
| ౭౨ | ౧౫ | మార్తార | మార్తుర |
| ,, | ౧౮ | ఘరకు | ధరణ |
| ౭౯ | ౮ | వరించి | వధించి |
| ,, | ౧౯ | ప్రిళయ | ప్రళయకాల |
| ,, | ౨౬ | వాలమునవిసరి | వాలమునఁవిసరి |
| ౮౦ | ౧౪ | గతణ | గర్త |
| ౮౧ | ౧౨ | తీక్ష్ణాసికా | తీక్ష్ణాసికా? |
| ,, | ౧౩ | నికురంబ | నికురుంబ |
| | | గర్షాంజలుల్ | గర్భాంజలుల్ |
| | | | మింల |
| | | | కప్పనంత |

| | | | |
|---|---|---|---|
| ౯౮ | ౬ | మూలంబగుటకు | మూలకందమగుటకు |
| ౬౧ | ౨ | కేయు | జేయు |
| ,, | ౨౦ | వితమొ | ఏవితము |
| ౯౪ | ౧ | చిన్నరిబి | చిప్పర్చి |
| ,, | ౪ | సీనే | నీవె |
| ౯౬ | ౧౬ | యుద్ధ | యుద్ధ |
| ౧౦౨ | ౧౧ | స్థానంబందునక | స్థానంబందొక |
| ౧౦౪ | ౧౪ | నీపశ్చిమ | నివాపశ్చిమ |
| ౧౦౫ | ౩ | తరింపుము | చరింపుము |
| ౧౦౭ | ౧౨ | చింతించ | చింతించి |
| ,, | ౧౫ | లారా | లార |
| ౧౦౯ | ౧౪ | నున్నట్లు | ననునట్లు |
| ౧౧౦ | ౨ | విరోధుల | శిరోధుల |
| ౧౧౧ | ౧౨ | పోవులు | పోవుచీలు |
| ౧౧౪ | ౨ | హేతువుం | హేతువుల్ |

విస్తరభీతిచే సర్గానుస్వార శకటరేఫ లోపముల వదలితిని. నాటకమునందల—అవస్థ, వ్యర్థము, కృతార్థ, సార్థక, పృథుల, అస్థి, స్థలము, యథార్థ, కంఠస్థ, నాథ, పరిధాన, జీవవ్యవస్థితి, స్థానము లోనగు వాక్యంగల థవర్ణమునకు థవర్ణము, దుస్థితి, వక్షస్థల, లోనగు చోట సకారమునకు ద్విత్వము, ధ్వజము, సాధ్వి, సుధర్వా, అధిరోచిత, మధ్య, ధర్మ, సాధ్య అనువాని ధ వర్ణమునకు ధ వర్ణము చేర్చు కొన పాఠకులు ప్రార్థితులు. కొన్ని స్వల్ప దోషములు వదలితిమి పాఠకులు యథామతి సవరించుకొందురు గాక!